

మన్నారాయణచర
ణౌమమత్తారహితహృదయనళినవసంత
రామ। శరణంప్రపద్యే
భూమానందప్రదౌ విభూ సుమహాంతౌ ।

# ఉపోద్ఘాతము.



రాధ యను నవల తొలుత ద్రావిడభాషలోఁ బండిత నటేశ శాస్త్రిగారిచే రచింపఁబడి 'దిక్కట్ర ఇరుకోళందిగళ్' (ఇరువు రనాథ బాలికలు) అను పేరిటఁ జాల ప్రసిద్ధిఁ గాంచియున్నది. నేను 1917 వ సంవత్సరమున వితంతుశరణాలయమునఁ జెన్నపట్టణమున విద్య నభ్యసించుచున్న సమయమునఁ దోడిబాలికలు కోరఁగా వారి వినోదార్థము మూలము ననుసరించి వ్రాసితిని. ఇందలి భావములుగాని, కథాసంవిధానముగాని నా సొంతము కాదు. రచించిననాఁటనుండియుఁ బాఠకులలో మిక్కిలి ప్రచారముఁ గాంచుటచే నిది తిరిగి ముద్రింపఁ బడినది.

ఇట్లు,

కాంచనపల్లి కనకమ్మ,

ఆంధ్రోపన్యాసకురాలు,

క్వీన్ మేరీ కళాశాల, చెన్నపట్టణము.

**3—11—1933.**



# విషయసూచిక.

శ్రీ రా మ.



# మొదటిప్రకరణము.

## అక్క సెల్లెండ్రు.

విజయనామసంవత్సర శ్రావణమాసమునం దొకనాఁటి సాయంకాలమునందు నాకాశము నిర్మలముగను, మనోహరముగ నుండెను. వర్షము లధికముగఁ గురియుటచే నఖండకావేరీప్రవాహము గట్లు పొంగి, పొరలి పాఱుచుండెను. అయ్యేటికెలంకులం దతిరమణీయములై మిన్నంటఁ బెరిగిన దట్టమైన తోఁపు లుండెను. కోయిలల కలస్వనంబులు, శారికలపలుకులు, మయూరముల కేకారవంబులు, వినువారివీనులకు విందు సేయుచుండెను. అచ్చటి పర్వతసానువులు, నరణ్యప్రదేశములు, పచ్చని భూభాగములు, పచ్చికబయళ్ళు, నిసుకతిన్నియలు చూపఱులకుఁ గన్నులపండు వొనర్చుచుండెను. కావేరీభంగములతుంపురులు మెయి సోఁకఁగ నిరంతరదుఃఖములు పటాపంచలై చన నఖండానందము నందనివా రచట లేరు.

అట్టిమనోజ్ఞప్రదేశములో నొకప్రక్కఁ బఱుపువలె మెత్తగ నుండిన పచ్చికమీఁద నొక ముదుసలి, ముఱికిగుడ్డలు, ముడతలు పడిన శరీరము, లోనికిఁ బోయిన కన్నులు కలిగి, నడుచుటకు శక్తి లేమి నలసి సొలసి పండుకొనియుండెను. వానిదాపున నిద్దఱు బాలికలు పరుగెత్తుచు నాడుకొనుచుండిరి. వారి ముఖములు వాడియుండెను. నల్లని పరికిణీలు మాత్రము వారు కట్టుకొనియుండిరి. ఆభరణము లెవ్వియును లేవు. వా రిద్దఱును గవలపిల్లలవలె నుండిరి. దూరమునకు విశేషవ్యత్యాసము వా రిరువురయందుఁ గానరాకుండినను సమీపమునకు వచ్చినపుడు భేదము తెలియవచ్చుచుండెను.

పెద్దపిల్లకు విశాలమైన ఫాలము, నిడుపైన నేత్రములు, చామనచాయ మేను, ముత్యములవంటి దంతములు, నల్లని పెన్నెఱులు నుండెను. చిన్న పిల్ల తెల్లని మైచాయ, నల్లని వెండ్రుకలు, సుందరములైన గొప్ప కన్నులు, నందమైన ముఖము, వెన్నెలవంటి మందహాసము, నున్నని బుగ్గలతో నొప్పియుండెను. పెద్దదానికిఁ గల ధైర్యము, గాంభీర్యము, చిన్నదానియందుఁ గానరావు. చుఱుకుఁదనము, వివేకము, శాంతము వారిద్దఱముఖవికాసములందు వ్యక్తమగుచుండెను.

చిన్నపిల్ల యా వృద్ధునికడకు వచ్చి యతని లేపి "తాతా! నేను, రాధయు నామంటితిన్నియ నెక్కి చూచితిమి. ఏమివేడుక! ఎందఱు మనుజులు! వారందఱు నేమియో యేరి బుట్టలలో వేసి కొనుచున్నారు. మేము కూడ వెళ్ళి పండ్ల నేరి తెచ్చెదము. తాతా! ఏమి! నిద్రపోయితివా? లేలే!" అని లేపఁగా నాముసలివాఁడు కన్నులు తెఱచి, "నిద్ర లేదు. భద్ర లేదు. అలసటగా నున్నది. చల్లని గాలి వీచుచుండఁగా మైమఱచియుంటిని. అలమేలు! అటులే పోవుదము. ఎంతో దూరము లేదు" అని చెప్పి మోఁకాళ్లు పట్టుకొని లేవలేక లేచి కఱ్ఱఁ బట్టుకొని నిలిచి అలమేలు చూపించినవైపు చూచు చుండెను. రాధయు బొటమనవ్రేళ్ళమీఁద నిలిచి యా ప్రక్కనఁ జూడఁ దొడంగెను. సంధ్యారాగంబు నలుఁగడల నల్లుకొనియె. ఆప్ర దేశంబునకుఁ గొంతదూరంబున నొకలోయ యుండెను. అందుఁ దలక్రిం దుగా మలఁకలై దిగుకాలువ యొకటి యుండెను. సంజకెంజాయయందుఁ బ్రతిఫలించుటచే నాసెలయేఱు రక్తప్రవాహమో యను భ్రమను బుట్టించుచుండె. దాని కిరుప్రక్కలనుండిన వృక్షాగ్రములు బంగారు పూఁత పూయఁబడినట్లగపడుచుండెను. పక్షులు గుంపులు గుంపు లుగా తమ గూండ్లకుఁ బరుగెత్తుచుండెను. ఆ ప్రదేశమున కనతి దూరంబున నొక్క గ్రామంబు గానవచ్చుచుండెను. ఆ పల్లెకు ముం దర నొక దివ్యహర్మ్యం బాసంధ్యారాగంబున నతిచిత్రంబుగను మనోహరంబుగను గనఁబడుచుండెను. రాధ దానిం జూచి "తాతా! ఆయూరికా మనము పోఁదలంచుట? అదియేనా మనయూరు? ఆమే

డలోనా నీవు చిన్నప్పు డుండినది?" అని యడుగ నల్లప్ప "అవు నమ్మా! అచ్చటనే యుంటిని" అనెను.

రాధ—నీ వుండినమేడ యెంత బాగుగ నున్నది! తాతా! నీ యిల్లు చూపింపవా?

నల్లప్ప (తాత)—అక్కడికే కదా మనము బయలుదేరుట. రండి, పోవుదము.

అనిచెప్పి ఆకాశమువంకఁ జూచి యొక పెద్దనిట్టూర్పు విడిచెను. రాధ కొంచెము పెద్దదై నందున వడిగా నడుచుచు, వెనుకఁబడిన తాతదగ్గఱకు వచ్చుచుండెను. అలమేలు చిన్నదగుటచే నంత త్వరితముగ నడువలేకపోయెను. కొంత దవ్వరిగినపిదప, మార్గమధ్యంబున రాధ "అదిగో! బంగారు తుమ్మెద" అని అలమేలునకుఁ జూపఁగ నాచిన్నది 'దానింబట్టియి'మ్మని కోరెను. తోడనే యిద్దరును తాతను వదలి పరుగెత్తిరి. నల్లప్ప తన్నుఁ దా మఱచి గొప్పవిచారమున మునిఁగి కాళ్ళు తడఁబడ నడుచుచుండెను. సమీపమున నగపడు చుండిన గ్రామమును జూచినవెంటనే కడచిన తన యరువదియేండ్ల చరిత్ర యంతయుఁ దలకుఁ దట్టఁగ వేడినిట్టూర్పు లాముసలివాఁడు విడువఁ బ్రారంభించెను. "ఎవ్వరును దగ్గర లేకుండుటం గని ఆమె నన్నుఁ జూచి యేమనునో కదా! కోప మున్నాంగెనా యామెయెదుట నుండుటయే యసాధ్యము. అయిన నామెకోపమున కెన్నాళ్లు భయపడి యూరు విడిచి పాఱిపోఁగలను? ఈ యాతేండ్లు పడరానిపాట్లన్ని యుఁ బడితిని. నా దేహములో నింక బల ముండినఁ బ్రాణము లఱచేతిలోఁ బట్టుకొని యీ పిల్లలను భిక్షమెత్తియైనఁ బెంచుచుందును. అయ్యో! దేహశక్తియుడిగె. ఏపని చేయుటకును సామర్థ్యము శూన్యమయ్యె; కదలలేను; మెదలలేను; ఇఁక మరణమే శరణము. నన్నుఁ గొంపోవుటకు యముఁడు సిద్ధముగ నున్నాఁడనుట నిశ్చయము. ఇంకొక యూరిలో నా యూపిరి వదలుట కిష్టము లేదు. పుట్టిపెరిగిన యూరిలోనే గిట్టవలెను. ఆమె చేసిన ఘోరపాపము నామనస్సులో దాఁచి చచ్చుటకును మన సొప్పదు. ఎన్నటికి నట్లు జరుగదు. పాపము! పాపము! ఈభారము నామెయొద్దనే యొప్పగింపవలయును. తప్పక

చేసెదను. నా కిఁక భరింపశక్యము కాదు" అనుచు నడక చాలించి వేఁడినిట్టూర్పు విడిచి, వీధిలో నిలువఁబడెను.

అలమేలు—ఏమి భారము తాతా! నాకిమ్ము, నేను దానిని మోసికొని వచ్చెదను. నీలో నీవే మాటలాడుకొను చున్నావే! మాతోఁ జెప్పరాదా!

నల్లప్ప—నేను మాటలాడితినా? ఏమిమాటలు? ఏదైన పాట పాడియుందును.

రాధ—తాతా! మూఁడు నాలుగు దినములనుండి మత్తుగ నున్నావు. నీకు బుద్ధి మందమైనది. జ్వరముగా నున్నదా?

అలమేలు—తాతా! మా నాయనయు నమ్మయు నక్కడనే యున్నారా?

నల్లప్ప—అవునమ్మా! ఎందుల కట్లడుగుచున్నావు? తల్లిదండ్రులేల తలంపునకు వచ్చిరి? ఎప్పుడును లేదే?

అలమేలు—ఏమో! యీ దినము అమ్మ జ్ఞాపకమునకు వచ్చినది. తాతా! నాకుఁ గూడ నమ్మయుంటే బాగుండునని కోరిక.

నల్లప్ప దీనికి బదులు చెప్పకముందే రాధ "అలమూ! ఒక చిత్రమైనపువ్విక్కడ నున్న"దనఁగా నచటికి నలమేలు పరుగెత్తెను. ఇరువురు బాలికలును బరుగిడి చిన్నవినాయకునిగుడి యొక రావి చెట్టు క్రింద నుండఁ జూచి, "తాతా! తాతా! కాళ్ళు నొప్పులెత్తు చున్నవి. ఈ కోవెలయొద్ద కొంచెము కూర్చుండి శ్రమ తీర్చుకొని యెదము" అని యడుగఁగా సరే యని తాత దూరమున నుండియే తల యూఁపెను. ఆపిల్లలు కోవెలలోపలికిఁ బరుగెత్తిరి. నల్లప్పకూడ నధికప్రయాసముతో మెల్లగా నడిచివచ్చి "ఓ విఘ్నేశ్వరా! నీ యందమైన యాలయము మఱవనే లే దని చెప్పుచుఁ గోవెలగుమ్మము దగ్గఱకు వచ్చి కూరుచుండెను. గోడ లన్నియు పాచి పట్టుటచేఁ బచ్చగా నుండెను. పూజాపునస్కారములు లేక పాడుపడి యుండిన యీ దేవాలయమునకు నొక ప్రక్క నొక్క కాలువ పాఱు చుండెను. పచ్చని దళ్ళును, వాని చుట్టు నల్లరాళ్ల చేఁ గట్టఁబడిన

చిన్నగోడలు, పనసచెట్లు, నేరేడుచెట్లు, రావిచెట్లు, వేపచెట్లు, పొన్నచెట్లు, సెలసెల మని పాఱుచుండు తేటనీటికాలువలు నా కోవెల కొకక్రొత్తశోభను గల్పించినవి. నిర్మనుష్యమైన యరణ్య ప్రదేశమైనను నా యందచందము లేమని వచింపనగును! ఏ మహానీయుఁడో దానిని నిర్మాణము గావించెను! ఎట్టి పుణ్యాత్ముఁడు! వినాయకుని దేవళమే యైనను నల్లరాళ్ల గుహాయందు గర్భగృహమును, దానిచుట్టు, నొక ప్రాకారము నుండెను. కళాకౌశల్యము మెండుగ నందుఁ గన్పట్టుచుండెను. మనపట్టణములలో నెన్ని వినాయకుని కోవెల లున్నను ఊరాచ్చికోట వినాయకుని గుడితో సమానములు కానేరవు. ఆపిల్ల లిద్దఱు ప్రాకారముచుట్టుఁ బరువెత్తుచు, గుడియొద్ద పాఱుచుండిన నీటిచెంతకుఁ బోయి యా తేఁటనీటిం గలియం బెట్టఁజొచ్చిరి. రాధ దోసిలితో నీరుఁ గైకొని త్రాఁగెను.

రాధ—జలము చల్లఁగా, బహురుచిగా నున్నది. అమ్మా! త్రాగవే నీరు. తాతా! నీవును వచ్చి నీళ్లు త్రాఁగుము.

నల్లప్ప—ఔనౌను; బిడ్డలారా! మీవలె నేనును చిన్నప్పుడు నేరేడు పండ్లను దిని యీ సెలయేటిలో నీరు త్రాఁగి యిక్కడనే యాడుకొనుచుంటిని. వేసవికాలమందునయిత మీనీరు చల్లగా నుండును. ఎంత యానందము! ఏమి సౌఖ్యము! అట్టి కాలము తిరిగిరాదు.

అని చెప్పుచు మెల్లగా వచ్చి "అయ్యో! కన్నులు తిరుగుచున్నవి. ప్రాణము తల్లడిల్లుచున్నది. నిలువలేక యున్నాను. ఇఁక నే నెక్కువకాలము జీవింపను. శీఘ్రముగ నామెను జూడఁగలనా? ఈ పిల్లల నెవరికి నొప్పగింతును? వారి తల్రా(వ్రా)ఁత యెటు లున్నదో కదా" అని యేమేమో గొణుగుకొని పరితపింపనారంభించెను.

రాధ—కోవెలతలుపులు దగ్గఱగా వేసియున్నవి. తలుపులు తీసి స్వామిని జూడవచ్చునా?

నల్లప్ప—తెఱచియుండినఁ బోయి స్వామికి నమస్కారము చేయుఁడు. ఈ దేవునికి మిక్కిలి శక్తిగలదు. ఆయనయే మిమ్ముఁ గాపా

డును. ఇది యడవికోవెల యగుట జనులు విశేషముగ వచ్చుట లేదు. అందువలన నీ దేవాలయము బహు పరిశుద్ధముగా నున్నది. పొండు, పొండు.

రాధయు నలమును లోపలికి వెళ్ళి వినాయకునికి దండము పెట్టి వచ్చుచుండఁగా నాముసలివాఁడు "అమ్మా! రండు, బాగుగ చీఁకటి పడుటకు ముందే మనము పోవలయు" నని చెప్పి యందఱును గలిసి బయలుదేఱిరి. ఒక మనుష్యుఁడుమాత్రము నడువ వీలగు దారిలో నొక తులసికోటయు, దానిదాపున నిద్దఱు పిల్లలయొక్క ప్రతిమలు నల్లఱాతియందు చెక్కఁబడియుండుట వారు చూచి "తాతా! తాతా! ఇదియేమి? ఎవరి ప్రతిమ లివి?" అని యడుగఁగా నల్లప్ప తనకఱ్ఱను నేల మీఁద నానించి దానిమీఁద తనభారము మోపి నిలిచి, యొగశ్వాసలు దిగశ్వాసలు విడుచుచుఁ గొంతసేపటికి తమాయించుకొని "బిడ్డలారా! ఈయూరాచ్చికోటలో పచ్చయప్పయను ప్రభువుకలఁడు. అతఁడమితధనవంతుఁడు. అతనిపిల్ల లేకకాలములో నకస్మాత్తుగా నీ యేటిలోఁ బడి గతించిరి. వారు నా కిప్పుడుసయితము కన్నుల కగపడు చున్నారు. అలంకారం, రంగం, అని వారిపేళ్లు. వారితండ్రి యా పిల్లల నిక్కడ ఖననము గావించెను. ఆ బాలికలను బోలిన బొమ్మలను జేయించి యిక్కడ వారిజ్ఞాపకార్థ మతఁడు వానిని స్థాపించెను. తిరువణ్ణామలైనుండి మంచి రాతిపనివానిని బిలిపించి యీ ప్రతిమల నతఁడు చెక్కించెను." అని చెప్పుచుండఁగా నూరాచ్చికోట దేవునిగుడిలో సాయంకాలపు గంట వినఁబడెను. దానిని వినఁగానే నల్లప్ప "కోవెల గంటకూడ కొట్టినారు. మనము పోవచ్చును. ఈయడవిలోఁ జీఁకటి పడిన నడచుట చాలఁ గష్టము" అనెను.

అలము—తాతా! అలంకారమునుగుఱించి నీ కేమి తెలియును? చెప్పుము. రంగ మెవ్వరు? తాతా! కావేరిలోఁ బడి గతించినారంటివి. చెప్పుము తాతా! ఏమి? వారికిఁ దల్లి లేదా?

నల్లప్ప—అట్లే చెప్పెదను. కాని మనము త్వరగఁ బోవలయును. చీఁకటి క్రమ్ముకొని వచ్చుచున్నది.

అని చెప్పుచు నెంతశక్తిహీనుఁడైనను, చీఁకటి పడుటకుఁ బూర్వమే పిల్లలతోఁగూడ నొక నీడపట్టునఁ జేరవలయు ననుకోరికతో సమయమునకుఁ దగు బలముఁ దెచ్చుకొని నడువఁ బ్రారంభించెను. ఇంతలో నొక పూజారి యాపిల్లలవెంటఁబడి "కొట్టెదను, చూడుఁడు; నేను లేని సమయములో కోవెలతలుపులఁ దెఱచి, యేటినీరు కలఁతపెట్టి పారిపోవుచున్నారా? ఇదిగో వచ్చుచున్నాను." అని యొక చింతబెత్తము పట్టుకొని వచ్చెను. అలము భయపడెను. రాధ ధైర్యముతో "ఎందుకబద్ధములు పలుకుచున్నావు? మాతాతయు మేమును నీరు మాత్రము త్రాఁగి మరలివచ్చితిమి." అనఁగా, నా పూజారి దగ్గర నుండిన తాతను జూచి పోట్లాడుటకు మనసొప్పక, "ఇఁకమీఁద నిక్కడికి వచ్చితిరా కాళ్లు విఱుఁగఁ గొట్టెదను. నే నక్కడ నప్పు డుండిన మిమ్ముఁను విడిచియుందునా? పొండి." అని తిరిగి వెళ్ళెను. ఎటులైనను వదలినాఁడు గదా యని పిల్లలు సంతోషించి తమ దారినిఁ బోవుచుండిరి. ముసలివాని కేమియుఁ దెలియకుండెను. దేహముమాత్రము వాంఛాప్రాబల్యముచే నడుచుచుండెనుగాని మనం బెచటనో సంచరించుచుండెను. అతని యాలోచనల కంతము లేకుండెను. అలము దగ్గరకు వచ్చి "తాతా! కాళ్లు నొప్పులెత్తుచున్నవి. నడచుటకు శక్తి లేదు. ఇఁక నెంతదూరము? చెప్పు తాతా!" అని యడుగ, నల్లప్ప "వచ్చినాము, తల్లులారా! అదిగో ఆమేడయే! కనఁబడుచున్నది." అనఁగా నలము "అదియా మనయిల్లు?" అని సంభ్రమముతో నడిగెను. "కాదమ్మా, ఒక చిన్నగుడిసె, చుట్టు నొక దడి కలదు. చూడుము. అదియే మనయిల్లు." అని తెల్లపోయి, భయపడి తడబడుమాటలతో నల్లప్ప చెప్పెను. ఇల్లు దగ్గఱకు వచ్చిన దని చెప్పఁగానే యదియే గొప్ప సంతోషమయ్యెను. మనది యని యొక చిన్నగుడిసె యుండినను జాలు. అక్కడఁ గూర్చుండి శ్రమ తీర్చుకొనవచ్చు నని వారికిఁ దోఁచెను. ఆగుడిసె రాజవీధికిఁ బదియడుగుల దూరమున మిక్కిలి రమ్యముగఁ గట్టఁబడియుండెను. దానిచుట్టును ప్రత్తిచెట్లు, నందివర్ధనములు, పారిజాతములు, దాసానిచెట్లు, పూలతో నిండియుండెను. ఆగుడిసెకు చుట్టుప్రక్కల నిండ్లు లేక

పొల ముండుటచేఁ బైరుగాలి చల్లగ వీఁచుచుండెను. రాధ యాగుడి సెను సమీపింపఁగనే చెంతకుఁ బోయి, "తాతా! తలుపు మూసి యున్నదే" యనెను. "అవును మూసియే యున్నది. గుమ్మముమీఁద తాళముచెవి యుండును." అని నల్లప్ప చెప్పుచు వచ్చి యక్కడ నుండిన తాళముచెవిని దీసి, తలుపు తెఱచి యిద్దఱు పిల్లలతో నింటి లోనికి వెళ్లెను. లోపలికిఁ బోగానే రాధ యి ల్లంతయు గలియం జూచి 'అలుకులు, ముగ్గులుకూడ మిక్కిలి ప్రాఁతవడియున్నవి. చాల దినములుగా తాళము వేసియుండియుండును.' అని తలంచి "తాతా! తాతా! చీఁకటిగా నున్నది. భయమెత్తుచున్నది. అయ్యో! తల మీఁద నేమో వ్రాలి కఱచి వెళ్ళుచున్నది తాతా!" అని యాముసలి వానినిఁ గౌఁగిలించుకొనెను. "అది గబ్బిలము, భయపడవలదు. ప్రమాద మేమియు లేదు. ఊరు విడిచి చిరకాల మయ్యెను. నీకుఁ దెలియదా! నేను లేనప్పుడు నాయి ల్లెట్లుండును? అన్ని సరిగా నుండు నులే! భయమును జెందకుము. మీయవ్వ చనిపోయెను. నా కన్ననో! కాలుతీసి కాలుపెట్ట శక్తి లేదు. ఏదో భగవంతుఁ డిక్కడికిఁ దీసికొని వచ్చి మనలను జేర్చినాఁడు." అని పలుకుచుఁ గూలఁబడెను. సమ యమునకుఁ దగిన ధైర్యమును దెచ్చుకొనిన రాధ దగ్గఱనున్న బల్ల మీఁదఁ దాతను బండుకొనఁజేసి యక్కడ నుండిన దీపమును దాత చెప్పినప్రకారము వెలిగించెను. ఆనిప్పుపెట్టె నక్కడఁ బెట్టి యెన్ని దినములాయెనో? పది యిరువది పుల్లలు గీచినతర్వాత దైవాధీన ముగా నొక పుల్ల వెలిఁగెను. దీపపుసెమ్మెమీఁది ప్రమిదలోఁ జమురు పూర్ణముగ నుండినను, ఱెక్కపురుగులు, దుమ్ము పడినందున వత్తి బాగుగ వెలుఁగలేదు. దీపము ప్రకాశవంతముగ నుండుట కప్పటి కేమిచేయవలయునో దాని నంతయు రాధ యొనరించెను. ప్రత్తితో వేఱువత్తిఁజేసి చమురు క్రొత్తగా వేఱుప్రమిదయం దుంచి వత్తిని వెలిగించెను. రాధ కౌశలము గల బాలిక. గృహకృత్యముల నన్నింటిని జక్కగ నెఱవేర్పఁగల చాకచక్యముగలది. అష్టవర్షముల వయస్సుమాత్రము కలిగినను విసుగుఁజెందక, పనియన్న మూలు గక యత్యంతాసక్తితోఁ బ్రియముతో నితరులచేత నొకమాటయు

ననిపించుకొనక, మహాసంతోషముతోను, వినయముతోను దన శక్తికొలఁది పనులఁ జేయుచుండెడిది. అలము, సోదరివెంటఁ దిరుగుచు నధికానురాగముతోఁ జెప్పినపనులను జేయుచు ననఁకువగా నుండెను. రాధకన్న నలము రెండు సంవత్సరములు చిన్నది. వీ రిద్దఱకును గల పరస్పరానురాగము, ప్రేమబంధము గట్టిగ నుండెను. ఇట్టి యనాథబాలికలకు దిక్కుగా నుండిన ముసలివానికి నవసానకాల మాసన్నమైన ట్లుండెను. ప్రయాణముచే నలసటఁ జెందిన ముదుసలి కన్నులు మూసికొని బల్లమీఁద కొంతసేపు పరుండి తటాలున లేచి కన్నులు తెరచి "బాగుగా తెలివి యున్నప్పుడే చేయవలసినది చేసి ముగింపవలయు; లేనియెడ నా కెట్టి జన్మము సంభవించునో తెలియదు! నేను మహాపాపిని. ఇంకను దాఁచి మృతిఁ జెందితినా నిజముఁ దెలుపు వా రెవ్వరు నుండరు." అని చెప్పి రాధను బిలిచి "అమ్మా! యా గూఁటిలోని తాటాకును, గంటమును దీసికొనిరమ్మ" అనెను. రాధ తత్క్షణమే వానిని దెచ్చియిచ్చెను. మిక్కిలి ప్రయాసముతో నా ముసలివాఁడు వంకర టింకరగా నా తాటాకుపై నీ రెండు పఙ్క్తులు వ్రాసి యత్యాశ్చర్యముతోఁ జూచుచు నిల్చియుండిన రాధచేతి కిచ్చి "అమ్మా! నీవు పెద్దదానవు. అలమువలె నీ వంతగ నలసి యుండలేదు. నా పని నీవు శిరసా వహించి చేయుదువు. నీవు దీనిని నేఁ జెప్పినచోటికిఁ దీసికొనిపోయి యిమ్మ"నఁగా, "తాతా! నే నెక్కడకుఁ బోయి దీని నెవరి కియ్యవలయు? ఇం దెవ్వరిని నే నెఱుంగనే" అని రాధ పలుకుచుండ నల్లప్ప "పచ్చయప్పగారి భార్యయైన యమృతవల్లికి దీని నీయవలయు, నయ్యో, తల్లులారా! మిమ్ముల నిద్దఱ నిట్లొంటరిగ విడిచిపో నాకు మన సొప్పకున్నది. ఒకసారి యామెను తిన్నగాఁ బోయి చూచివచ్చిన" అని యనుకొనుచుండఁగ నలము వానిముఖము పరికించి, "తాతా! మమ్ముల వదలిపోయెదవా? నేను మాత్రము నిన్ను వదలను. ఊఁ, ఊఁ, తాతా! నీవు వెళ్ళిన నేను నీవెంటనే వచ్చెదను." అని యేడ్చెను. నల్లప్ప కన్నీరు విడిచెను. చావు బ్రదుకు లేమియో తెలియని యా చిన్నపిల్ల లింతప్రేమతో, దన్నుఁ గౌఁగి

లించుకొని కూర్చున్నప్పుడు తనకుఁ గాలము చెల్లిపోయిన దని యెవరు చెప్పఁగలరు? అథవా చెప్పినప్పటికిని వారి కేమి తెలియును? నల్లప్ప దుఃఖించి కొంతసేపటికి ధైర్యము తెచ్చుకొని "రాధా! రాధా! నీవు ధైర్యశాలినివి. భయపడకుండ నామేడకు వెళ్ళి యమృతవల్లి కీకమ్మ నిమ్మ. పరుగెత్తు-శ్రమయని చూడవలదు. ఇదే సమయము" అని చెప్పఁగా రాధ, 'సరే!' యని యాకుఁ దీసి బొడ్డులోఁ జెక్కుకొని తాను బోవుచో టెట్టిదని తెలియకుండ క్రొత్తస్థలమైనను ధైర్యము తెచ్చుకొని బయలుదేరెను. నల్లప్ప రాధను బంపి బల్లమీఁద కొట్టి వేసిన చెట్టువలె కదలక మెదలక, ప్రజ్ఞలేక యావృద్ధుఁడు పడియుం డెను. మిక్కిలి యలసి సొలసి తలయొద్దఁ గూర్చుండిన యలము "తాతా! ఏమి తలనొప్పియా? ఏమి యిట్లు పరితపించెదవు?" అనెను. కొంతప్రజ్ఞ కలిగినప్పుడు అలముమాటలను విని "అమ్మా! భయప డకుము. కన్నులు మూసికొని పండుకొనెదను." అని చెప్పుచుండఁగ కన్నులు మూఁతపడెను. "నేను నీచెయ్యి పట్టుకొని యుండెదను. ఆకులు కదలుటను జూడ భయ మెత్తుచున్నది." అనుచు నలము వానిచెయ్యి పట్టుకొనెను. నల్లప్ప మరణావస్థయందును నాపిల్ల రెండు చేతులు తనచేతితోఁ బట్టుకొని "దేని కమ్మా! భయము? ఈశ్వరుఁ డేలోపమును మీకుఁ జేయఁడు" అనెను.

రాధ తనవయస్సునకు మించిన ధైర్యముతో దారిపట్టి తాత చెప్పిన గుర్తులను గమనించుచు వెళ్ళుచుండెను. సాయంకాలము నందుఁ దానుఁ జూచిన మేడయే గనుక దానితోఁటవాకిలి కనుఁగొని యందుఁ బ్రవేశించెను. రెండు ప్రక్కలను మిక్కిలి రమణీయముగాఁ బెరిఁగిన గోరింటచెట్లు పూచియుండుటచేఁ గమ్మనితావుల వెదఁ జల్లుచుండఁగ రాధ యానందపరవశయై "ఏమి సొగసైనతోఁట! ఇట్టి తోఁటను నేఁ బుట్టినదిమొద లెఱుంగను. ఆహా! యేమి కమ్మని వాసన! ఈ గుడ్డివెన్నెల యుండియు నిష్ప్రయోజనముగా నున్న ది. బాలచంద్రుఁడు కదా. మీఁదుమిక్కిలి మేఘము లడ్డము. మిణుకు మిణుకు మను నీ నక్షత్రములు కొంత సాహాయ్య మొన

రించుచున్నవి. దారి కన్పడుచున్నది. చాలు” ననుకొనుచు నాపెద్ద తోఁటలోఁ గొంతదూరము పోఁగా నాబాట రెండు మార్గములుగాఁ జీలియుండెను. ఏత్రోవను బోయిన మేడకుఁ బోనగునో రాధకుఁ దెలియకుండెను. నిర్విణ్ణయై నిలువఁగ నొకకాకి ఎడమవైపుగా నెగిరి పోయెను. 'ఇది దారిం జూపుచున్నది కాఁబోలు' నని తలఁచి మంచి శకునమని యెంచి యామార్గమునఁ బోఁదొడంగెను. కొంచెము దూరము నడచిపోఁగా నాదారి కిరువైపులను వృక్షములు దట్టముగాఁ బెరిఁగి యాకాశము గన్పడకుండునటుల నావరించుకొని యుండెను. నక్షత్రముల వెలుతురుకూడ నిరోధింపఁబడియె. గాఢాంధకార మయ్యెను. ఏమియుఁ గానరాకుండెను. మేడ కన్నుల కగపడుట లేదు. దారి తప్పుటకు సంశయమేమి! పోఁగా పోఁగా నొక్క పెద్ద తోఁట కనఁబడెను. ఆ తోఁటలో నేనుఁగులు, సింహములు రాతితోఁ జెక్కబడి యలంకారార్థ మక్కడక్కడ నమర్పఁబడి యుండెను. చీఁకటిలో నారూపములు నిజమైన మృగములవలె రాధకన్నుల కగుపడెను. ఇట్టితోఁట లాబాలిక పూర్వము చూచియుండలేదు. అందు నిట్టిప్రతిమల నుంచుదురను మాటయుఁ దెలియదు. చిన్నది యగుటచే నానల్లనిరూపములు దయ్యములో భూతములో యను భయము కలిగెను. తడఁబడుచు భయముచే వణఁకుచు శరీర మంతయుఁ జెమ్మటలు గ్రమ్మ నేడ్చుచు నిలువఁబడి యుండఁగ మచ్చలు గల చిన్న లేడిపిల్ల, యాబాలికకు దగ్గఱగాఁ బరుగెత్తెను. గుండె ఝల్లుమనఁగ “అయ్యో!” అని రోదనము చేయుచు నడువఁజాలక నేలపైఁ బడి “అడవిలోఁ జిక్కుకొంటిని. తాతా! అలమూ! ఇఁక నేను మిమ్ముఁ జూచుటలేదు. నా కిక్కడనే చావు మూడినది.” అని రాధ బెగ్గడిల్లి, యెలుఁగెత్తి యేడ్చుచుండెను.

---

# రెండవప్రకరణము.

## పచ్చయప్ప.

నల్లప్పయే మేడకు రాధను బంపెనో యాసౌధముయొక్క యజమానుఁడగు పచ్చయప్పగారినిగుఱించియు నాతనికుటుంబమును గూర్చియుఁ గొంచెము విచారింతము. పచ్చయప్ప యుండినహర్మ్యము కన్నులు మిఱుమిట్లు గొలుపునటుల నల్లనిఱాళ్లు, సూర్యకాంతఁపురాళ్లు, చంద్రకాంతఁపురాళ్లు, స్ఫటికఁపురాళ్లు మొదలగు నమూల్యవస్తువులతోఁ గట్టఁబడినది. విశ్వకర్మయే వచ్చి పరీక్షించినను లోపము కానరాదు. వాస్తుశాస్త్రప్రకారము, నిర్మాణము గావింపఁబడిన యా దివ్యప్రాసాదముయొక్క చిత్రము లిట్టివి యని వర్ణించుట కేరికిని దరముకాదు. నలువైపులను వసారా లుండెను. ఈ పంచామలు రమ్యమగు పనితనముఁ జేయఁబడిన ఱాతికంబముల మీఁద నిలుపఁబడెను. గోడలయొక్క ధావళ్య మతిశయమై ప్రతివస్తువును ప్రతిఫలింపఁ జేయుచుండెను. పంచ లెత్తుగ నుండుటచే సోపానము లేర్పఱుపఁబడినవి. పంచాదిలోనుండి చావడిలోనికి దారి కలదు. శిల్పికళాకౌశలము గన్పట్టుపను లనేకములు మనస్సు నాకర్షించుచుండెను. చలువఱాతితోఁ గట్టఁబడియుండుటచే నక్కడిచలువ వేఱ చెప్పవలయునా! నడిచావడి చిత్రభంగు లుపచరించు సౌధమణికూటమరీచులు నొప్పు, లక్ష్మియచటఁ దాండవమాడుచున్నటు లుండెను. ఆ చావడిలోనుండి మేడపైకిఁ బోవుటకు సోపానము లుండెను. అనేకములైన గదులలోనికి ద్వారము లుండెను. మేడమెట్లు తెల్ల చలువరాళ్లతోఁ గట్టఁబడియె. ముంగిలి దాఁటగానే విశాలమైన చావడి యుండెను. అందు బల్లలు, కుర్చీలు, సోఫాలు, చిత్రవిచిత్రమైన పనితనముగల చాఁపలు, బొమ్మలు, పటములు, నందమగు నద్దములు, నానామనోహరవస్తుజాలము లుండెను. అన్నియుఁ జక్కఁగ నుచితస్థలములలో నమర్పఁబడియుండెను. ఆకాంతి, యాశోభ, యాయందము చూపరులకు దిగ్భ్రమను గల్పించుచుండెను. ఆచావడిచుట్టు

పెక్కుగదు లుండెను. మేడకుఁ బైనున్న మిద్దెమీఁదికిఁ బోయి చూచినఁ జుట్టుపక్కల నుండు గ్రామములు, వీథులు, తోఁటలు నన్నియుఁ జక్కఁగఁ గనఁబడును. ఆ సౌధమునకు నలుగడలను పచ్చికబయళ్లు, పూలతీఁగెలు, నుద్యానవనములు, గుల్మములు, నికుంజములు, నానావిధపుష్పఫలవృక్షములు, సుందరారవిందభూషితహ్రదములు నుండుటచే శృంగారము వెల్లివిరియుచుండెను.

ఈ హర్మ్యమునందుఁ బచ్చయప్పగారి వంశీయులు పారంపర్యముగా వసించుచుండిరి. వీరిదియే యూరాచ్చికోటలో మిక్కిలి ప్రసిద్ధికెక్కిన వంశము. పచ్చయప్ప యొక ప్రభువు. విశేషముగ నెవ్వరితోడను మాటాడఁడు. ఏరికిని హాని యొనర్పఁడు. పెద్దలను గౌరవించి తత్త్వార్థప్రసంగములు మాత్రము సల్పుచుండెడివాఁడు. నిగర్వి, గొప్పవిద్వాంసుఁడు, గుణసంపన్నుఁడు, ముప్పదివత్సరముల వయస్సుగలవాఁడు. దేనివలననో యొకనాఁదిన మైనను నవ్వుచు నెవ్వరితోడను మాటలాడి యెఱుంగఁడు. ఆతని విచారమున కాయూరివారు కారణము లేవేవియో చెప్పుదురు. ఇరువది యేండ్లప్రాయమప్పు డంబుజమ్మ యనుపేరుగల సుందరిని బచ్చయప్ప వివాహమాడి యామెతో నమితసౌఖ్యముగఁ గాలము గడుపుచుండెను. ఆయమ యుత్తమగుణవతి. ఆ సతీతిలకము భర్తతో రెండేండ్లు కాఁపురము చేసి యిద్దఱాఁడుపిల్లలను గని చనిపోయెను. ఆ బాలిక లిరువురును సంవత్సరమునకుఁ దరువాత కాలధర్మము నొందిరి. ప్రియపత్నియుఁ, బిల్లలును నట్లు కాఁగ నాయన దుఃఖసాగరమున మునింగెనని కొందఱును; నాయనవంశమే పిచ్చి దనియు నది వారిలో ముసలితనమున బయల్పడుచుండెడిది, గాని యితని కిప్పుడే పిచ్చెత్తినదని కొందఱును; వినాయకవర్ష వర్ధంతి నూఱువరహాలు వ్యయపఱచి జరుపనందున నిట్లు సంభవించె నని కొందఱును; నీతని రెండవభార్య మొదటిభార్యయంత మంచిదికాదు, భర్త కనుకూలముగ నడుచుట తెలియదు గాన నింట సంతోషములేమి వాడినమొగముతో నుండు నని మఱి కొందఱును ననుకొనుచుండిరి. ఏది సరియైన కారణమో

యీశ్వరునకే యెఱుక. ఆయనముఖము సంతోషమందహాసము లను నవి లేనిదియై చింతకు నాకరమై పరఁగుచుండెను. ఎవ రేమనినను లక్ష్యముచేయక తన పనినే యాయన చూచుకొనుచుండెను. ఏపుఁ బెరిగిన శరీరము, విశాలమైన వక్షస్థలము, నాజానుబాహువులు, నల్లని నిడుపైన కుటిలపు తలవెండ్రుకలు, విశాలలలాటము, నెత్తుని గీరలు గల నేత్రములు, నాయనయౌదార్యమును వెల్లడించుచుండెను. ఆమహాపురుషుఁడు సాధుత్వ కారుణ్యములకుఁ బ్రఖ్యాతి గాంచెను; పరాంగనలందు మాతృభావము, బీదలయందు వాత్సల్యము, పెద్దలయందు గౌరవము గలిగి సంచరించుచుండెను.

ఇతని రెండవ భార్యయుఁ జక్కనిదే. ఆయమ పేరమృతవల్లి. ఆయనకు నమృతవల్లి యెట్లు రెండవభార్యయో యమృతవల్లికి నాయ నయు నట్లు రెండవభర్త. అమృతవల్లి ప్రథమమున నొకవన్నెజాతి ప్రభువును వివాహమాడి ఇరువదిసంవత్సరములకు వితంతువై రెండువర్షముల వయస్సుగలిగిన కొమారుని గలిగియుండి యీతనిని బెండ్లిచేసికొనెను. ఈపచ్చయప్పకు నమృతవల్లియం దొక కొమరిత కలి గెను. మన కథ ప్రారంభించునాఁటి కీబాలికకు నాలేండ్లవయస్సు. ఆపిల్ల పేరు బాలలత. అమృతవల్లి చక్కనిది. తేజోవంతమైన ముఖము, చంచలములైన నేత్రములు, సుందరమైన నాసిక, నల్లని కనుబొ మ్మలు, కుటిలాలకలు, ముత్యపుకాంతిని మించిన శరీరకాంతి మొద లగున వన్నియు నామెసౌందర్యమునకు వన్నె దెచ్చుచుండెను. ఆసాయంకాల మమృతవల్లి కాంచీపురపు పట్టుచీర గట్టుకొని మొకమల్ రవికను ధరించి యాభరణభూషితయై యాప్రాసాదమం దొక గదిలో నొక సోఫామీఁద నుల్లాసముతోఁ గూర్చుండెను. అమృతవల్లి ప్రథమభర్తకుఁ బుట్టిన బాలునిపే రంబికాపతి. ఆ బాలుఁ డొకబొమ్మల పుస్తకమును జూచుకొనుచుండెను. బాల లతయు నక్కడ నవ్వుచు నాడుకొనుచుండెను. వీ రిరువురకును జదువు చెప్పుటకుఁగాను కుంతలమ్మయను పేరుగల స్త్రీ యాచావడిలో నొక కుర్చీమీఁద నాసీనయై యుండెను. కుంతలమ్మ కేవల ముపాధ్యాయు

రాలే కాదు. కొన్ని వత్సరములనుండియు నమృతవల్లికిఁ గూర్చు ప్రియసఖియై యుండెను. గొప్పవంశమునందుఁ బుట్టినవనిత; ఉత్తమ గుణవతి. అమృతవల్లికిని గుంతలమ్మకును నత్యంతస్నేహము.

పిల్లలకుఁ గుంతలమ్మ విద్యగఱపిన వృద్ధికి వచ్చెద రని యమృత వల్లి తలంచి యామెను దనయింటియం దుంచుకొని భేదబుద్ధి లేక వర్తించుచుండెను. దేహలావణ్యమందును, ముఖవికాసమునందును, నమృతమునకన్నఁ గుంతలమే మిన్నయని చెప్పఁదగియుండెను. చూచువార లందఱును నామెచక్కఁదనమున కక్కజపడుచుండిరి. తీర్చిచేసిన ప్రతిమవలె నామె యన్నియవయవములు పొంకము గలిగి, ప్రకాశించుచుండెను. అమృతవల్లివలె నీమెయుఁ బొడుగైనదియే. తటిల్లతపసను నిరసించుచున్నదనుట కెంతయు సందియ ముండదు. ఆమె యమృతవల్లికన్న వయసునఁ జిన్నది, అవివాహిత. ఆమె యెన్నఁడును సొమ్ములను ధరించి యెఱుఁగదు. ఆభరణము లన్నింటిని మించిన విద్య యామెయం దుండ స్వర్ణాభరణము లామెకేమి యంద మొసఁగఁగలవు? స్వభావసౌందర్యలావణ్యము లబ్బిన శరీరమునకు నేయాభరణము కావలయు? ఆమె కాంతికి సాటియగు భూషణ మెయ్యది? కుంతలమ్మ నిర్మలమైన ధౌతవస్త్రమును మాత్రము ధరించి యుండెను. త్రికరణశుద్ధికలిగిన పవిత్రురా లీమె యొక్కతియే యని యంద ఱనుకొనుచుండిరి. కొద్దివిద్య లభించినమాత్రముననే, నేదోయొక్క విశ్వవిద్యాలయఁపు బిరుదుఁ గైకొనిన మాత్రముునను మాయంతటి విద్యావతులు ప్రపంచమునఁ గలరా యని విఱ్ఱవీగు చుండు వెడఁగులవలెఁ గాక కుంతలమ్మ వినయవిధేయతలు గలిగి సన్మార్గమునఁ బ్రవర్తించుచుండెను. ఈయమకును నరుళ్నాథుఁ డను నొక యువకునికిని బ్రేమానుబంధ మేర్పడియుండెను. ఇతఁడు పచ్చ యప్పగారికి ముఖ్యమైన కార్యసాధకుఁడు. ఇతని తాత ముత్తాతలును మొదలియారివంశఁపువారికి సేవకులుగ నుండిరి. పచ్చయప్పగారికి నరుళ్నాథుఁడు ప్రియసచివునిభంగి వర్తించుచుండెను. అరుళ్నా థుఁడు విద్యాసంపన్నుఁడు, నీతిపారంగతుఁడు, సుందరవిగ్రహుఁడు.

ప్రభువున కాతనియందు మిక్కిలి నమ్మకము కలదు. అందఱకును దలలోని నాలుకవలె నణఁకువతో నతఁడు మెలఁగుచుండెను. అతఁ డాదినమున నక్కడకు వచ్చి కుంతలముతో సంతోషముగా సరససల్లాపము లాడుచుండెను.

వన్నెజాతివారలలో సాధారణముగఁ బెద్దపిల్లలకే వివాహము లగుచుండును. స్త్రీ పునరుద్వాహములుగూడ ప్రచారమందుఁ గలవు. బహుకాలమునుండి కుంతలమ్మయు నరుళ్నాథుఁడును నొక యింటిలోనే పెరుఁగుచుండుటచే నొకరికంటె నొకరు బుద్ధికౌశల్యమునందు, విద్యావ్యాసంగమునందు బలవత్తరులుగ నుండుటవలనఁ బ్రేమబంధము వార లిరువురిని గట్టిగ బంధించెను. దినదినాభివృద్ధిం జెందుచుండిన యాప్రేమ శాశ్వతం బగుటకు వివాహమే సదుపాయమని వారు తలంచిరి. రాధ పచ్చయప్పగారి మేడకు వచ్చిననాఁటికి వారివివాహముహూర్తము రెండు మూఁడు దినము లుండెను. పచ్చయప్పగారే ముహూర్తమును బెట్టించి వివాహమును జేయసమకట్టి యుండిరి. ఆ సాయంకాలమునఁ గుంతలమ్మకు నరుళ్నాథునకు నిట్లు ప్రసంగము జరిగెను.

అరుళ్నాథుఁడు:—ప్రేయసీ! ఎల్లుండియే మన వివాహము జరుగును. సుముహూర్తము సమీపించినది.

కుంతలము:—అంతకన్న దగ్గఱగా ముహూర్తములు కుదురలేదఁట. నా కేమో యశుభశకునములు తోఁచుచున్నవి.

అరుళ్నాథుఁడు:—ఈ శకునముల కేమి ? ఇంతలోఁ బ్రాణములకు భయ మేమి కలుగును? ఎల్లుండియే కదా ముహూర్తము!

కుంతలము:—నే నెందుల కవసరపడుచున్నానో నాకే తెలియకున్నది. ఏకారణమువలననో నాహృదయము మిగులఁ దొందరపడుచున్నది. ఏమి కానున్నదో తెలియదు. నాకు భయమును గలుగుచున్నది. నామనోభావ మిట్టిదని తెలియఁబలుకుటకు నాకు శక్యముగాక యున్నది. ఎంతత్వరితముగ నీపరిణయమైన నంత మంచిది. దినములు గడచు కొల్ల శ్రేయస్కరము కాదు.

అమృతవల్లి—(సమీపించి) బండెడు పుస్తకములు చదివినను గుంత లమ్మకు మనోధైర్యము లేదు. ఏల దీనిచదువు? అరుళ్నాధా! నీవు దీనిని బెండ్లియాడినపిదప ప్రథమమున నీ వుపదేశింప వలసిన విషయము ధైర్యమే సుమా! ఇంక రెండునాళ్లే ముహూర్తమున్నది. అదియు నీమెకు సహింప శక్యముకాదఁట. పాపము! భయముఁ జెంది యున్నది. చూచితివా?

వీ రిట్లు మాటలాడుకొనుచుండఁగా బాలలత వారియొద్ద నిలిచి "ఆముహూర్తమునకు మీరు నేర్పినపాటలను నేను పాడెదను." అనగా "చిన్నారీ! అందునకు సందేహమేమి? విడువకుండ నన్నియును పాడుదువులే" అని వా రందఱు నవ్విరి.

అరుళ్నాధుఁడు—ప్రేయసీ! మనము కాపురము చేయుటకుఁ జిన్న యిల్లు కట్టించిరి. ఆ యిల్లీ తోటలోనే యున్నది. అయ్య గారు కావలసినపరికరములు, పాత్రలు మొదలగున వన్నియు నం దేర్పరచియున్నారు. నాతో రమ్ము; ఆయింటిని జూచి వచ్చెదము.

కుంతలము—నా కీపిల్లలతో నింక కొంచెము పనియున్నది. ఇప్పుడు వచ్చుటకుఁ దీరికలేదు. మీరు పోయిరండు. రేపు నేను వచ్చి చూచెదను. అప్పుడు తిరిగి మాటలాడవచ్చును.

అని గౌరవముగా లేచి కొంచెము దూరము మెట్లు దిగి వినయముతో 'నేను నిలిచెద' నని చెప్పి వెనుకకు మరలెను. అరుళ్నాధుఁ డతివేగముగాఁ గొంచెము చీఁకటిలోఁ గ్రొత్తయింటివైపు వెళ్ళెను. అప్పు డతఁడు తాను సంసార మనుభవించుచున్నటులును, దనభార్య తనకు శుశ్రూష చేయుచున్నటులును దాను భుజించుచుఁ గుంతలముతో సరససల్లాపము లాడుచున్నటుల ననుకొనుచు నాకాశహర్మ్యముల నిర్మించుకొనుచు నడుచుచుండెను. అతఁ డిట్లు పోవుచుండగా నాకస్మికముగా రాధ కతఁ డెదురుపడెను. చీఁకటిలో రాధ యతనిని జూచి బిగ్గరగ నేడ్వసాగెను. అరుళ్నాధుఁడు 'కుమారీ! ఏడ్వకుము. నీ కెవ్వరు నపకార మొనరింపరు. భయము చెందకుము. నీ వెవ్వతెవు? ఏల యిక్కడకు వచ్చి దాఁగుకొనియున్నావు?' అని యడిగెను.

రాధ—"నేను రాధను. దారి తప్పితిని. ఇక్కడ చిక్కుకొంటిని" అని వెక్కి వెక్కి ఏడ్చెను.

అరుళ్నాథుఁడు—"ఏడవకమ్మా! రాధ యన్న నాకుఁ దెలియదు. నీ తండ్రిపేరేమి? చెప్పు, భయపడకుము" అని బుజ్జగించెను.

రాధ—మా తాత మమ్మ నీగుడిసెకు నీసాయంకాలమే పిలుచుకొని వచ్చెను.

అరుళ్నాథుఁడు—ఏ గుడిసెకు?

రాధ—వీధిప్రక్కనున్న గుడిసెకు.

అరుళ్నాథుఁడు—మీతాతకు నాగుడిసెకు నేమి సంబంధము? అది యింకొకరిది కదా?

రాధ—నా కేమియుఁ దెలియదు. మాయూరిదికాదు. నేను దారి తప్పితిని. నా తాతదగ్గఱకు నన్నుఁ దీసికొనిపోయి వదలెదరా?

అరుళ్—అట్లే తీసికొనిపోయి వదలెదను. తరువాత నాపని చూచుకొనెదను. నాచేయి పట్టుకొనుము. భయముం జెందకుము. కుమారీ! మీ తాతదగ్గఱకుఁ దీసికొనిపోయెదను. రమ్మ.

అని పిలువ నతనితో రాధ వెళ్ళి కొంతసేపటికి తనగుడిసెను బ్రవేశించెను. అప్పు డాప్రాంతదీపఁపుసెమ్మెలో చము రయిపోయినందున దీపము మిణుకుమిణుకుమనుచుండెను. అలము వెంటనే "అక్కా! వచ్చితివా?" అని పరుగెత్తివచ్చి కౌఁగిలించుకొనెను. అరుళ్నాథుఁడు పిల్లలను విచారింపక బల్లమీఁద పరుండియుండినట్టి పరితాపకరమైన యామునలివానియవస్థం జూచుచుండెను. అణఁగి మణఁగి కృశించియున్నశరీరమును, దెల్లనివెండ్రుకలును గలిగి మరణావస్థయందున్న యా పేదమునలివాఁ డెవ్వఁడై యుండునో యని పరికించిచూచి యేమియుఁ దోఁపక యరుళ్నాథుఁడు నిలువంబడియుండెను. నల్లప్పకుఁ బ్రజ్ఞ కలిగి, కన్నులు తెఱచిచూచి "తండ్రీ! అరుళ్నాథా! నీవేనా?" అని చెప్పి మరల కండ్లుమూసికొనెను. అరుళ్నాథుఁడు దిగ్భ్రమజెంది,యతనిని గుర్తించి "అయ్యా! నల్లప్పా! నేనే" అని కన్నీరు కాలువలైపాఱ చూచుచుండెను. ఒకరి నొకరు గుర్తించుకొని యేమియో మాటలాడుకొనిరి. అరుళ్నాథుఁడు పచ్చయప్పసౌధమునకుఁ దిరిగిపోయెను.

# మూఁడవ ప్రకరణము.

ఎవరిది? ఎవరిది?

ఆరాత్రి యాగుడిసెలోని సంతాపకర మైనస్థితిని వర్ణించిన, వినువారిగుండె పీఁ్రలును. ఆయిద్ద ఱాఁడుపిల్లలు నాకలిబాధచే మల మల మాడి, దిక్కు మొక్కుఁ దెలియక చీఁకటిలో గడ్డిపరుపుమీఁద భయముతోఁ బండుకొనియుండిరి. కడుపు కాలుచుండ నిద్ర యెట్లు పట్టును? కండ్లు తెఱచి చూచుటకుఁ జిమ్మచీఁకటి. గవాక్షమునుండి కనఁబడు నక్షత్రములే వా రిద్దఱు పడునవస్థకు సాక్షులు. ఆపద, దిక్కు లేమి, పేదఱికము నివన్నియు వారిని బాధించుచుండెను. ఒకగబ్బి లము వారి తలలమీఁద ఱెక్కలతోఁ గొట్టెను. ఆపిల్లలు కీచనియఱ చిరి. వీరికి మొదటినుండియు దిక్కుగా నుండిన నల్లప్ప వీరియవస్థను నివారింపలేక దీర్ఘనిద్రం జెందెను. ఒంటరిగా నాపిల్ల లిద్దఱు నారాత్రి చీఁకటింటిలోఁ బడుకొనియుండఁ, దలమొదలు కాళ్ళవఱ కుండినజుట్టు విరియఁబోసికొని పగడఁపుఁ రంగం బోలినశరీరముగల యొక వ్యక్తి పిల్ల లిద్దఱముందఱకు వచ్చి వారిని బరికించిచూచి పండ్లు కొఱికి పచ్చయప్పగారి మేడవైపునకుఁ బోవుదారిని వడివడిగా నడచివెళ్ళెను. "ఎవ రది? కలయో, కల్లయో? ఆమేడప్రాకారమునుండి వచ్చెనా? దయ్యమా? భూతమా? పిశాచమా? కొఱవిదయ్యమా? మనలను మ్రింగవచ్చి మనము భద్రముగా నుండుటం గాంచి పారిపోయెను. మఱల వచ్చి మనలను మ్రింగునేమో?" అని యనుకొనుచు రాధ తన చెల్లెలిని దట్టి నిద్రలేపెను. అలము భయపడి యేడ్వసాగెను.

రాధ—'తాతా! తాతా! కన్ను తెఱచి చూడుము. భయముగా నున్నది. మమ్ముఁ గాపాడుము. ఎవరో మాకు గొప్పహాని చేయఁబోవుచున్నారు. అలమేలు! అలమేలు! భయపడ కమ్మా! ఏడ్వకుము. తాతా! తాతా! కండ్లు తెఱచి చూడు తాతా!' అని పిలువఁజొచ్చెను.

తాత యింకఁ గండ్లు తెఱవనిసంగతి వారి కేమి తెలియును? ఆ రాత్రి నిద్రలేక పరితపించినది రాధయే కాదు - పచ్చయప్పగారు

కూడ నిద్రపోలేదు. అడుగడుగునకు మేల్కొనుచుండెను. అయినను తెల్లవారుజామున నాయన చక్కఁగ నిద్రఁజెందిరి. ఇంకను తెల్లవా రుటకు నొకటి రెండు గంట లున్నదనఁగా శయనగృహముదగ్గఱకు సేవకులు వచ్చి "నిప్పు, నిప్పు"అని యఱచిరి. అప్పు డామేడలోనుండిన సేవకు లందఱకు నధిపతిగా నుండిన సుబ్బన్న "అరే లింగన్న ! నోరు మూయి. ఎక్కడరా నిప్పు ? కలవరపడుచున్నావు. నీబోఁటిమూఢుని నే నెక్కడను జూడలేదు." అనెను. వీఁ డిట్లు కోపగించుకొనుచుండ పచ్చ యప్పగారు తలుపు తెఱచి సన్ననిశాలువ కప్పుకొని, వెలుపలికి వచ్చి, "సుబ్బన్నా ! ఏమిసంగతి? విశేషమేమైన నున్నదా?" అని యడుగ "ఏమి యులేదు స్వామీ! ఎక్కడనో యొకయడవి నిప్పంటుకొనియుండును. పైనున్నగవాక్షమునుండి చూచిన నామంట గన్పడును. మిమ్ముల నెందుకు లేపవలెను ? నేను ముందుగా లేచి దాని నార్పుటకుఁ గొంత మందిని బంపితిని" అని సుబ్బన్న ప్రత్యుత్తర మిచ్చెను. పచ్చయప్ప గారు తనభార్యతోఁగూడ ముంగిట నిలిచి చూచుచుండెను. తోఁటలో నుండినవృక్షములకుఁ బైగా, గుగ్గిలము వేసినఁ బొంగినట్టు లగ్ని జ్వాల లంతకంత కధికమగుచుండెను. ఆకాశ మెఱ్ఱబడెను. అగ్ని ప్రకాశము కడుదూరము గానవచ్చెను. తనభార్యమీఁదికి నావెలుఁగు ప్రసరించినపుడెల్ల నామెముఖము వెలవెల బోవుచుండుటం గాంచి పచ్చ యప్ప "వేకువజాము, చలిగా నున్నది. నీ వెందుల కిక్కడ నిల్చెదవు?" అన నమృతవల్లి "నాథా ! ఇది యేమి ! ఎక్కడ నిప్పంటుకొన్నది ? మన గడ్డివామి నిప్పంటుకొనెనా ? అయ్యో ! నోరులేనిజీవముల యాహార మంతయు నష్టమగునే" అని భయముతోఁ దనభర్త చేయి పట్టుకొనెను. "నీవు భయపడకుము. గడ్డివాముల కేలాంటిభయమును లేదు. వీధికిఁ బ్రక్కనుండిన పాడుగుడిసె నిప్పంటుకొన్నది. అదిగో, చూడుము. అగ్నిజ్వాలలు కనఁబడుటలేదా" అని భర్త చెప్పఁగా భార్య "అయ్యో ! పాపము ! ఎవరైన త్రోవలోఁ బోవుచుండిన వారలు నిప్పంటించినారేమో" యనఁ బచ్చయప్ప 'అం దెవ్వరు లేరు. అది పెక్కేండ్లు మూయఁబడియుండెను. అందు మనుష్యులు లేనప్పు డేమి తొందర ? తనంతట తానే కొంచెము సేపటికి నారిపోవును."

అనుచుండ నతని భార్య "మీ మనస్సులో నాకొట్టమును విప్పింపవల యునని యున్నట్లు తెలిసికొంటిని. మునుపే విప్పియుండవలసినది. అయినను నప్పటినుండి....................."అని తనలోఁ దాను గొణుఁగుకొనుచు వసారాగదిలోనికి వెళ్ళెను.

అప్పుడు గొండఁడు అక్కడికి పరుగెత్తిరాఁగ "ఆ పాడు గుడిసె యంతయు బూడిద యయ్యెనా ? ఎవ్వరికిని నపాయము కలుగ లేదుగదా ? అది యెట్లు నిప్పంటుకొనెను?" అని పచ్చయప్ప యడుగ నా సేవకుఁడు, "అదియే నాకును దెలియలేదు. దానికి దగ్గఱగా శంభులింగఁ డున్నాఁడు. అతఁ డెప్పుడును చుత్తకాల్చి గంజి కాచుకొను చుండును. అతఁడు పొయ్యి రాజపెట్టినప్పు డేమయిన నగ్నికణము లాగుడిసెమీఁద పడినవేమో ? మునిఁగిపోయిన దేదియు లేదు. పాడు గుడిసెకదా, తగులఁబడిపోయినది? లింగన్నకు బుద్ధియే లేదు. చక్కఁగా నిద్రించుచుండిన మిమ్ములను లేపినాఁడు." అనెను.

పచ్చయప్ప "అమృతవల్లీ ! చలిగాలిలో నిలువవలదు"అని కేక వేసి తనగదిలోనికి వెళ్ళెను. అమృతవల్లియుఁ బిల్లలు భయపడి యుందురని వారిని జూచుటకై లోపలికిఁ బోయెను. త్రోవలోఁ గుంత లమ్మను జూచి "కుంతలం ! నిద్రలేచితివా ? అయ్యో ! ఎంతపని ! ఏమో ! పెద్ద కేకలు విని లేచితిని. ఎవ్వరు చేసియుందురు ? ఎట్టి దుష్కృత్యము ! ఇ ట్లెప్పుడును జరిగినదిలేదు. ఎంత ఘోరము !" అని శిరోజములను జక్కపెట్టుకొనుచుండెను.

కుంతలమ్మ—ఏమట్లు వణఁకుచున్నావు ? అల్లదె మంట చూచితివా ? ఎట్లు భగభగ మండుచున్నదో !

అమృతవల్లి—దానిం జూచినతోడనే సూర్యోదయ మనుకొని చాల సేపు నిద్రపోయితి నని గభాలున లేచితిని.

కుంతలమ్మ—నీవు చాల పారమార్థికబుద్ధికలదానవు. నీవు చూచిన దిక్కు పశ్చిమము కాదా ? అచట సూర్యుఁ డెట్లుదయించు నమ్మా ? పశ్చిమబుద్ధి వదలుము.

అమృతవల్లి—అవునమ్మా? నాది పశ్చిమబుద్ధియే. పోనిమ్మా. ఆ మండుచున్న దొకపాడుగుడిసె. అది చాలకాలము మూయఁబడియుండెను. ఇప్పు డసలే వదలిపోయెను. ఆ స్థలమునఁ జక్కని యిల్లు కట్టుకొనవచ్చును. కుంతలం! ఏల వ్యర్థముగా మేలుకొనియుందువు? ఉదయమున నరుశ్నాథుఁడు నీ మొగమును జూచి యే మిట్లు వాడియున్న దని చింతించును.

కుంతలమ్మ—అమృతవల్లీ! (ఆమె రెండుచేతులు పట్టుకొని) నీకుఁ జెప్పవలసిన దొక్కటి యున్నది నే నెప్పుడును దురదృష్టురాలను. ఏదో విపత్తు సంభవించినట్లు కలఁగంటి (అని వణఁకెను.

అమృతవల్లి—(భయపడి వెంటనే ధైర్యము తెచ్చుకొని) అది యేమటుల పలికెదవు? నేనును నాభర్తగారిమాట వినగానే యేమోయని తోఁటలోని కేఁగి చూచివచ్చితిని.

అని చెప్పి పడకమీఁదఁ గూర్చుండి కుంతలమును దన్నానుకొమ్మని శయనించెను. కుంతలమ్మ నేత్రములు మూసికొనఁగానే, యమృతవల్లి యామెను ముద్దుపెట్టుకొని వెళ్ళిపోయెను. ఆహా! ఏమి యభిమానము! ధనము, విద్య, యధికారము మొదలగు సంశములలో నెంత వ్యత్యాస మున్నను, వా రిరువురు మిక్కిలి యన్యోన్యమగు ప్రేమ గలిగి యక్కసెల్లెండ్రవలెను, తల్లిబిడ్డలవలెను గనఁబడిరి.

ఆ ప్రాతఃకాలమున బాలలత లేచి కుంతలమ్మగదికి వచ్చి సంతోషముతో, "అమ్మా! మీరు శీఘ్రముగా లేచి నన్ను మా యన్న నక్కడ మండుచున్నమంటదగ్గఱకుఁ బిలుచుకొనిపోయి యావింత చూపించెదరా? దాసి నాకుఁ గనఁబడి యక్కడ చాల మంది కూడి రనియు నింకను బోవుచున్నా రనియు, నిప్పు చల్లారలే దనియుఁ జెప్పెను. మనము వెళ్ళి చూడఁగూడదా?"

కుంతలమ్మ నిద్రలేచి వస్త్రములను గురులను సవరించుకొని, ప్రాతఃకాలపుగాలి శరీరమునకు మంచి దని తలంచి "అమ్మా! రా! అంబికాపతిని బిలుచుకొనిరమ్మా. నీయిష్టప్రకార మచటికిఁ బోవు

దము." అని పలికి గదివెలుపలికి వచ్చి మెట్లు దిగ నారంభించెను. ఇన్స్పెక్టరు, వేదగిరి యెదురుపడి "నమస్కార మమ్మా" అని చెప్పఁ, గుంతలము "ఆ మండుచున్న యింటినుండి వచ్చితిరా? నేనును బిల్లలు తొందరచేయుటచే నక్కడికిఁ బోవుచున్నాను." అనగా వేదగిరి "మీ రది చూచి సహింపలేరు. పిల్లలే! అక్కడి కెందుకు వెళ్లెదరు? పోవుట మంచిది కాదని నాకుఁ దోఁచుచున్నది. ఆడువా రా కష్టమును, ఘోరమును జూచి సహింపలేరు." అని చెప్పెను. కుంతలమ్మ వణఁకుచు "ఏమి యక్కడ?" అనఁగా, వేదగిరి "నిన్నటిదిన మెవ్వఁడో యిద్దఱు పిల్లలతో నక్కడ నుండెనఁట. అతఁడు నాపిల్లలు నందులోనే కాలిపోయిరఁట!" అని చెప్పఁగాఁ, గుంతలము "పాపము! పిల్ల లిద్దఱు చనిపోయినారా?" అని కన్నీరు విడిచెను.

వేదగిరి—అవునమ్మా! —వచ్చెడిదారిలో నాశంభులింగమును జూచితిని. అతఁ డక్కడ కొట్టములో మంట చూచి ధైర్యముగ బ్రవేశించి యం దొకముసలివాఁడు నిద్దఱు పిల్లలు నొకదీపము నుండఁ జూచితనదగ్గఱ నుండినపండ్లు నాకలిగొనియున్న పిల్లల కిచ్చెనఁట. వా రెక్కడనుండియో వచ్చి యిక్కడ విశ్రమించి వేఱొకస్థలమునకుఁ బోవ నుద్దేశించుకొని రని తెలియవచ్చెడిని. ఆ శంభులింగము చెప్పినది వినినను నా పిల్లలదురవస్థ తలంచినను నెవరి మనస్సు కరఁగకుండును? పాపము! ఎన్నిదినములనుండియో యన్న మెఱుఁగనివారివలె నాపిల్ల లుండిరఁట! ఆ శంభులింగ మేమి చేయఁగలడు? చేతిలో నున్నపండ్లు నిచ్చి యాతని యింటిలో నుండిన యటుకులు కొన్ని తెచ్చియిచ్చి వెళ్లెనఁట! అయ్యో! రాత్రియంతయు బాలిక లటు లుండిరి. తెల్లవారి తిరిగి యెక్కడనైనను నూకలు సంపాదించి గంజికాచి యియ్యవలయునని తలంచి తనయిల్లు వదలి వెలుపలికిరాఁగా నాగుడిసె నిప్పంటుకొన్నదని విన్నాఁడఁట! అక్కడ నందఱును బూడిదను గలియఁ బెట్టుచున్నారు. అం దొక నల్లగాఁగాలిన మొండెము, విఱిగినచేతులు, కాళ్లుమాత్రము కనుఁబడినవి.

వేదగిరి యిట్లు చెప్పుచుండఁ గుంతలమ్మముఖము వెలవెలపోయెను. "చాలు, నిలుపు, పిల్లలు భయపడుదురు" అని కుంతల మనుచుండ, వేదగిరి "అమ్మా! యజమానులవారి కీసంగతి చెప్పుటకుఁ బోవుచుండ మీ రగపడినందున మీకుఁ జెప్పితిని. మన్నింపుఁ" డని వేడుకొని మేడమీఁదికి వెళ్ళెను.

"నాయనుంగుబిడ్డలారా! మన మక్కడికిఁ బోఁగూడదు. మీతండ్రి క్లిష్ట ముండదు." అని కుంతలమ్మ యనుచుండ, బాలలత "అమ్మా! యీవేడుక చూడ నాకు మిగుల నాశ కలదు." అని చెప్పెను. అంబికాపతి "నేను బోయి చూచెదను" అనెను. కుంతలమ్మ "సరే! దూరముగా నుండి చూచి వచ్చెదము" అనుచుండ, "రా! బాలలతా! దగ్గఱమార్గము నాకుఁ దెలియును. నాలుగైదు నిమిషములలో నక్కడకుఁ జేరఁగలము." అని యంబికాపతి తన చెల్లెలిని పట్టుకొని లాగఁగఁ గుంతలమ్మ "తండ్రీ! అవసరపడకుము. నేను మీకు దగ్గఱనుండి దానిని జూపెదను. ఆగుడిసె నాకుఁ దెలియును" అని చెప్పి తోఁటవైపు మఱలెను.

తాను బోవుచుండినదారిని గొంతదూరము పోయినతరువాత 'శివశివా! గురునాథా! నారాయణా!' అనుచుఁ గుంతలమ్మ భూమిమీఁద పడెను. అప్పు డాప్రదేశము నిశ్శబ్దముగా నుండుటచే నాతోఁట యంతయు నామెతోఁ గూడ నేడ్చుచున్నట్లుండెను. ఎందులకా మె యంతగా రోదనము చేయుచుండెను? ఎవ్వనికిఁ దన నిచ్చి వివాహము గావింపఁదలంచిరో, యెవనిని బరిణయమంది యఖండానందమును బొందఁగోరెనో, యట్టి తన జీవితసర్వస్వమగు నరుళ్నాథునిశవమును జూచినప్పుడు కుంతల మె ట్లేడ్వకుండఁ గలదు?



# నాల్గవ ప్రకరణము.

## ఎఱుకసాని.

ఊరాచ్చికోటలోను, దానికి సమీపమున నుండు గ్రామము లందును ముసలివాఁడు నాయఁడుపిల్ల లిద్దఱును జనిపోయి యుండి రని యంద ఱనుకొనుచుండిరి. కాని సర్వభుక్కను పేరు గాంచినను నాయుష్యము, నారోగ్యము, తేజము, తన్నారాధించువారికిఁ గలుగఁ జేయు నగ్నిహోత్రుఁ డాపిల్లల నిద్దఱనుమాత్రము కాపాడెను. నల్లప్ప దిక్కులేనివాఁ డగుటచే నలుగురును చందాలు వేసికొని యతని కపరకర్మముఁ గావింపఁదలంచిరి. సర్వరక్షకుఁ డార్తత్రాణపరాయణుఁడు, వారి నెట్లు రక్షించెనో కనుగొందము. గుడిసె తగులఁబడఁ బోవునాఁటిరాత్రి యలమేలు రాధతో "అది యేమి పిశాచమా?" అని యడిగెను.

రాధ—పిశాచ మనునది లేనేలేదు. ఒకవేళ పిశాచ మనునది యుండినను మన యింటికి వచ్చినదిమాత్రము పిశాచము కాదు. ఆ వచ్చినమనిషి మనలను జంపుటకు వచ్చియుండు ననుట నిశ్చయము.

అలము—అది నీతో మాటలాడినదా?

రాధ—లేదు. నన్నది చాల క్రూరముగాఁ జూచినది. అయినను మన తాతను లేపి చెప్పుదము.

అని యిద్దఱును తాతయొక్క చేతులను బట్టుకొనిరి. అలము "తాతా! తాతా!" అని బిగ్గఱగా నఱచెను. రాధ "లే, తాతా! మాకు భయముగా నున్నది." అనెను. మాటలేదు; శ్వాసము లేదు; కదలుటలేదు; కన్నులు తెఱచుట లేదు. అలము నల్లప్పతల పట్టిచూడ నరఁటిబోదెవలె చల్లఁగా నుండెను. అలము భయపడి బల్ల దిగెను. "ఏమి! ఇంత చల్లఁగా నున్నది. తాతా! ఏల మాట్లాడవు? అక్కా! నాకు భయముగా నున్నది. చూడవే" అన, రాధ తాతతలను బట్టిచూచి చల్లఁగా నుంట కనుఁగొని యేడ్చి,

"అలమ్మా! తాత చచ్చిపోయినాఁడు కాఁబోలు. నీతో మాట్లాడఁడు. నాతోను మాటలాడఁడు." అనెను.

నల్లప్ప కాలగిత్తిపోయెందె. ఇఁక వీరిగతి యేమి? ఎవరు దిక్కు? తాత మృతినొందె నని కనుఁగొని యాయిద్దఱు నాపీనుఁగుపైఁ బడి యేడ్వసాగిరి. అక్కడ నుండిన గబ్బిల మలమునెత్తిమీఁద వ్రాలి నా పిల్ల పిశాచ మని యేడ్వసాగెను. మాయపిశాచము తనకుఁ గనఁబడినది మఱల వచ్చెననియు, నది వా రిద్దఱను జంపుననియు రాధ తలంచెను. 'తాత లేఁడు. ఇఁక నిక్కడుండిన నీమాయ పిశాచము వాతఁ బడుదుము' అని భయపడి రాధ యలముచెయ్యిని గట్టిగాఁ బట్టుకొని మెల్లగా నాచీఁకటిలో నాగుడిసెను వదలి వెలు పలికి వచ్చెను. దుఃఖ మధిక మగుచుండెను. ఎట్టకేలకు ధైర్యముఁ దెచ్చుకొని వార లిరువు రేదోమార్గముంబట్టి మిక్కిలి వడిగ నడచిరి. ఆకు కదలినపు డెల్ల నర్ధరాత్రి మగుటచే, గాఢాంధకార మగుటచేఁ, బసిపిల్ల లగుటచే, నా మాయపిశాచము తమ్ముఁ జంపు టకు వచ్చుచున్న దేమో యని యులికిపడుచుండిరి. రాధ తీసినత్రో వనే అలము సగము నిద్రతో సగము మెలకువతో నడుచుచుండెను. త్వరగ నేదో గ్రామమును జేరి తప్పించుకొనినఁ జాలు నని రాధకుండెను. త్రోవలో ముండ్లు గ్రుచ్చుకొనినను, దేహమునకుఁ గంపలు రాచుకొని నను, గట్టుకొనియున్న పరికిణీలు చినుఁగుచుండినను, కాళ్ళు రాళ్లకుఁ దగిలి గాయము లగుచుండినను నాభయోద్రేకమువలన నేమియు నెఱుం గక పరుగెత్తసాగిరి. ఎంతదూరము పోయినను పాప మొక్కయూరైన వారికిఁ గనఁబడలేదు. అంత నలము "అక్కా! కొంచెము నే పిక్కడ కూర్చొని తరువాత లేచి వెళ్ళుదము. నే నొక్కయడుగైనను నడువ లేను. కాళ్ళు నొప్పులెత్తుచున్నవి. తల చుట్టుచున్నది." అన, రాధ "చెల్లీ! కొంచె మోపికపట్టుము. ఏయూరైనఁ జేరెదము." అని బుజ్జగించెను. అలము బిగ్గఱగా నేడ్వ, రాధ యా దుఃఖమును జూడ లేక తానుగూడఁ బరితపించి ప్రక్కనుండిన యొకచెట్టుక్రిందఁ గూర్చొని తనయొడిలోఁ జెల్లెలినిఁ బరుండఁబెట్టుకొని పెద్దదానివలె "చెల్లీ! అలమూ! నిద్రపో" అని బుజ్జగించుచుండెను. మాయపిశాచము మిమ్ముల

నేమియుఁ జేయదు, భయపడకుఁ డని ధైర్యము చెప్పుటకో యన సూర్యభగవానుఁ డతిత్వరితముగఁ దూర్పుదిక్కున నుదయించెను.

అలము లేచి రాధచెయ్యి పట్టుకొని 'అదిగో! యాపొదచాటు నుండి యెవ్వరో మనవంకఁ జూచుచున్నారు.' అని చెప్ప రాధ లేచి నిలువఁబడి యలము చూపినదిక్కు నవలోకించెను. పిశాచమే వారిని తఱుముకొని వచ్చుచున్న దని రాధ భయపడెను. కాని సూర్యోదయ మగుటచే నాభయమున కాస్పదము లేకపోయెను. ఒక వ్యక్తి సమీపించి వారియెదుట నిలిచెను. డెబ్బదిసంవత్సరముల వయస్సుగల స్త్రీరూప మది. ముసలి దైనను మిక్కిలి సన్నగా, పొడుగుగా నుండి దృఢమైన యంగములు గలిగియుండెను. కన్నులు చిన్నవిగ, ముఖ ము నల్లగా నుండెను. కాషాయవస్త్రమును ధరించి, విభూతిపట్టెలు తీర్చియుండెను. చూపులలోఁ గుటిలత్వము, కపటము గానవచ్చుచుం డెను. ఆమె యొక యెఱుకలసాని. ఇట్టివారి ననేకపర్యాయములు చూచియుండుటచే నామె యెవ్వరైనదియు రాధకుఁ దెలిసి యామెతో "నీ వెవరు? ఏల చెడ్డతలంపుతో మాకడకు వచ్చితివి? దిక్కులేని యమా యికలగు మమ్ముఁ జంపిన లాభమేమి? నీదారిని బొమ్ము" అనుచుండ నామె "మీ రెవరు? తెలియఁబలుకుము. మిమ్ములఁ గాంచ నాకుఁ బరితాపము జనించుచున్నది." అనెను.

రాధ——నీ తలం పేమియో నాకుఁ దెలియకున్నది. నీ వడుగువిధము గాంచ నీవు చెడ్డదాన వని తోఁచుచున్నది. మాపేర్లు రాధ, అలము. మాతాత చనిపోయినాఁడు. ఈ యడవిలోఁ దోవ తప్పి వచ్చుచున్నారము.

ఎఱు——అయ్యో! దారి తప్పితిరా! ముం దెక్కడ నుంటిరి? మీయూ రెయ్యది? ఎక్కడికిఁ బోవుచున్నారు?

రాధ——మేము మాతాతతో మాకు జ్ఞానము తెలిసినప్పటినుండి యుంటిమి. ఆయన పోయినతర్వాత మే మెక్కడ నుండిన నదియే మాయూరు. అన్నియూరులును మావే.

ఎఱు—అయ్యో! మీ రింత చిన్నపిల్లలుగ నున్నారు. ఇ ట్లరణ్యములో నుంట నెవ్వరు చూచి సహింపఁగలరు? మీకు బంధువు లెవ్వరు? ఎక్కడ నున్నారు?

రాధ—మాకుఁ గావలసినవా రెవ్వరును లేరు. ఈ యలము నాకును, నేను దానికిని గావలసినవారము. మే మొకరి కొకరము బంధువులము. తాతమాత్రి మొకఁ డుండెను. అతఁడును లేఁ డిపుడు.

ఎఱు—"మీరు కోయంబుత్తూరునకా ప్రయాణము? ఇదిగో! యీ వైపు."

అని తలతో నుత్తరపుదారిం జూపి, "అయ్యో! మిమ్ములఁ జూచిన నాకు జాలి పుట్టుచున్నది. మీరు చాల యలసిడస్సియున్నారు. ఆచిన్నపిల్లకాలికి గాయ మయిన ట్లున్నది." అనిపలికి ఒక గుడ్డపేలిక చించి యలముకాలికిఁ గట్టుకట్టెను.

అట్లు కట్టుకట్టి "అమ్మా? ఎటు లున్నది?" అని ఎఱుకలసాని ప్రశ్నింప "సౌఖ్యముగా నున్నది" యని యలము బదులుచెప్పెను. రాధ తనచెల్లెలి కామె యటు లొనరించినందులకు సంతోషించి యామెవంకఁ జూచెను. ఆయిద్దఱ దగ్గఱను నామె కొంచెము సేపు కూర్చుండి, యంతఁ జేతులు చాచి యలము నెత్తుకొని "అయ్యో! బెండువలె నున్నది. ఈడునకుఁ దగిన భారము లేదే! ఈయడవిలోనికి నే నీమెను చాల దూర మెత్తుకొని వచ్చెద" నని పలికెను. రాధ "అయ్యో! మేము పోవున దేయూరున కని యెట్లు చెప్పఁగలము? ఈ మార్గముననే మీరుకూడ వచ్చిన మాకుఁ దోడుగా నుండెదరు" అని వేఁడుకొనెను.

ఎఱు—నాకుఁ జాల సంతోష మైనది. కోయంబుత్తూరునకు వెళ్ళి కూలి చేసికొని బ్రతుకవచ్చును. నే నక్కడకే పోవుచున్నాను. మిమ్ములను గూడ పిలుచుకొని పోవుదును; రండి.

రాధ—అలమూ! కోయంబుత్తూరునకుఁ బోవుదమా?

రాధ కెనిమిదవవత్సరము లైనను ప్రథమమునుండి కష్టముల ననుభవించుటచే నెట్లైనను కష్టపడి జీవింపవలయు నను సదుద్దేశ ముండెను.

ఎలు—మీ ముఖవికాసము చూచిన మీరు గొప్పయింటి బిడ్డల వలెఁ గనఁబడుచున్నారు సుఖముగా బ్రదుకవచ్చునే!

రాధ—ఎట్లు?

ఎలుకలసాని యలము నెత్తుకొని నడుచుచు "నాతోఁ గొన్ని దినములు మీ రుండుఁడు? మీకుఁ దినుటకును, గట్టుకొనుటకును గొఱఁత లేకుండునట్లు నేఁ జూచెదను. మీకు మొట్టమొదట వస్త్రములు, అలంకారములు చిక్కును. కష్టపడి పనిచేయ నక్కఱలేదు. సదా సుఖముగా నుండవచ్చును."

రాధ—మీ రింత గొప్పగా మాటలాడు చున్నారు. మీ వస్త్రములు చినిఁగి మాసిపోయి యున్నవే?

ఎలు—(పక్కున నవ్వి, రాధను వీపుమీఁద తట్టి) నీవు మిక్కిలి యసాధ్యురాలవు. నే నడవిగుండ నడచివచ్చు నప్పుడు మంచి వస్త్రములు నాభరణములు ధరించి రాఁగలనా? నే నుండు స్థలమును జూచినను నావస్త్రాద్యలంకారముల వీక్షించి నను నీ వత్యాశ్చర్యము నొందవా? ఎన్నియో ముత్యములు, పగడములు, పతకములు, నానాస్వర్ణాలంకారములు గలవు. మంచిపిల్ల లని నా మనస్సునకుఁ దోఁచినయెడ మీకు వాని నిచ్చెదను.

రాధ—నీ విచ్చిన నలమునకు నలంకరించెదను. దీనికి నగ లనిన నెంతయో యాశ.

ఎలు—నీకుమాత్ర మాశ లేదా?

రాధ—అంతగా లేదు. ఏమి! అలము మాటలాడలేదు. నిద్రపోయి నదా?

ఎలు—గుఱకపెట్టుచు నిద్రపోవుచున్నది. పాపము! మంచినిద్ర. చాల యలసియున్నది. మీ రింకను, నెంతసేపు నడువవలయునో తెలియునా?

రాధ— తెలియదు.

ఎఱు—వదలివచ్చిన యూరైనను దెలియునా?

రాధ—అదియుఁ దెలియదు. వినాయకుని కోవెలమాత్రి మాయూరిలోఁ బ్రసిద్ధదేవాలయము. అక్కడ నొక కోట యున్నది. సాయంత్రి మాయూరు చేరుటచే నంతకన్న నా కేమియుఁ దెలియదు.

ఎఱు—(తనలో) "అయినది కానిమ్ము. మీ రెక్కడనుండి వచ్చినారని యూహించుటకంటె నెక్కడికి వెళ్ళనున్నారో కనుఁగొనెదను. మీ రుండినచోటు నెంత యోచించినను స్ఫురణకు రాలేదు. పోనిమ్ము." అని రాధవైపునకుఁ దిరిగి 'నా కాఁకలి యగుచున్నది. రాధా! మీకును నాఁకల యగుచున్నదికదా?'

రాధ—అవును. నే నెవరితో నా యాకలిని గుఱించి చెప్పెదను. ఉపవాసము లుండి యుండి నా కభ్యాసమాయెను.

ఎఱు—'అదిగో! ఒకగుడిసె కనఁబడుచున్నది. ఆస్థలము చాల మంచిది. అక్కడ మనము భోజనము చేయవచ్చును.'

అని చెప్పి ఎడమభుజముమీఁద నుండిన యలమును కుడిభుజముమీఁదఁ బడుకొనఁబెట్టుకొనెను.

రాధ—వారిని మీ రెఱుంగుదురా?

ఎఱు—వారిముఖము నలుపో తెలుపో నాకుఁ దెలియదు. ఇఁక మీఁదనే వారిని జూచుట. ఆ విచారము నీ కెందులకులే! మీ కాహారము సంపాదింపవలసిన భారము నాదికదా? (అని నవ్వెను.)

రాధ—అయితే మా కాహార మెట్లు సంపాదించెదవు?

ఎఱు—కొంచెము నే పుండుము. నోరుమాత్రము తెఱవకుము.

అనిచెప్పిగడ్డివాములు,ధాన్యపుపాతరులు గల సేద్యగానియింటికి వారితో వెళ్ళి తలుపు తెఱచి లోపలఁ బ్రవేశించెను. అక్కడ నుండిన రెండుకుక్కలు మొఱుగనారంభించెను. ఎఱుకసాని, వాని పేర్లుపెట్టి పిలిచి మొఱుగకుండఁజేసెను. ఆశబ్దము వినఁగానే యల ములికిపడిలేచి

యేడ్చెను. రాధ యెంతధైర్యశాలినియైనను నాసమయమున నామెను గట్టిగాఁ బట్టుకొనెను. లోపలికిఁ బ్రవేశించిన వీరిని జూచి యానేద్యగానికూఁతురు సమీపించి "మీ రెవరు? ఎందులకు వచ్చితిరి?" అని యడిగెను. ఆపిల్లకు పదునాలువర్షము లుండును. ఎఱుకసాని పరితాపముతో "ఈబిడ్డలు నా ప్రాణము తీయుచున్నారు. ఏదైన పెట్టుము." అని ప్రార్థింపఁగ నామెమనస్సు కరఁగి "వీరు నీబిడ్డలా?" యన నెఱుకసాని "అవు నమ్మా! వీరితండ్రి పోయి రెండువర్షము లయ్యెను. నే నొక్క-దానినే యాఁడుదాననై నను నీపిల్లల నిద్దఱను బెంచుచున్నాను." అనఁగా నానేద్యగానికూఁతురు కొంచెము విచారించి "నిలు, నిలు. పెనముమీఁద నట్లు కాల్చుచున్నారు. పోయి చూచివచ్చెదను" అని యింటిలోనికిఁ బోఁగా నెఱుకసానియు నాస్థలము నెఱింగిన దానివలె నాపిల్లలతో నామె వెంటఁ బోయెను.

పోవుదారిలో వడ్లగాదెలు, పెసలమూటలు, కందులబస్తాలు, బిందెలు, గంగాళములు, కుండలు, బానలు, ఎన్నియో వస్తువులం జూచి యలము "ఎంతచక్క-నియిల్లు! ఎట్టిభాగ్యవంతులు! మన కీమాదిరి గృహ ముండఁగూడదా?" అనగా "వచ్చును వచ్చునులే!" అని రాధ పలుకుచుండ నందఱు వంటయింటికి వచ్చిచేరిరి. అక్క-డ వేఁడివేఁడి దోసె లొక్కొ-క్క-రికి రెండేసివంతున వా రిచ్చిరి. రెండేసి యరటిపండ్లనుగూడ నిచ్చిరి. ఎఱుకసాని కాపుపిల్లను జూచి "ఏదీ నీయెడమ చెయ్యి చాపు. నీరేఖలు చూచి చెప్పెదను." అన నామె నవ్వుచుఁ జేతిని జాచెను. ఎఱుకసాని హస్తమును బరిశీలించి కన్నులు మూసి కొంచెము యోజించి "నీకు దక్షిణమునుండి మంచి పురుషుఁడు వచ్చి వరుఁ డగును. అతనికన్నులు నల్లనివి. మిక్కి-లి విశాలములైనవి." అన "నల్లనికన్ను లేనా! ఎఱ్ఱనికన్నులు కావా?" అని ప్రశ్నింపఁగ నెఱుకసాని నవ్వి "ఎఱ్ఱనికండ్లు మంచివి గావమ్మా! నే నీవఱకు నూరుమందికి మంచి మగలు వత్తు రని చెప్పియుంటిని. ఒక్క-టియైనను వ్యర్థము కాలేదు. విను; మంచి పురుషుఁడు, రాజలక్షణములు కలవాఁడు, ఇరువది వర్షముల వయస్సు, మంచి తలకట్టు, నూనూగు మీసములు. రేపో యెల్లుండియో నిన్నుఁ జూడవచ్చును." అని యాస కలుగు

నట్లు వచించుచుండఁగ లోపలినుండి వినిన యింటియజమానుఁ డక్కడకుఁ జిఱచిఱలాడుముఖముతో వచ్చి "ఇదిగో, నీజోస్యము చాలును. నీబోఁటివారు గ్రామము నంతయు నాశము గావించుచున్నారు. అమ్మాయీ! నీవు పోయి నీపని చూచుకొనుము. ఈ పిచ్చికూఁతల కేమిలే? నీపనిని నీవు చక్కఁగాఁ జేయనేర్చుకొనిన నీకు మంచివరుఁడు దొరకును. ఇంతకంటె జోస్య మే మున్న" దని మందలించెను. తన తండ్రికిఁ దెలియకుండ నాకుమారి మఱికొన్ని దోసెలను దెచ్చి యాయెఱుకుసాని కిచ్చి పంపెను. ఆయాహారమును గుడ్డకొంగున మూటగట్టుకొని బిడ్డలఁ దీసికొని యాయిల్లు విడిచి, దారింబట్టి, యొకజాము సేపు నడిచి యొకనదిగట్టున నిలిచి వెండిగిన్నెతో నీరుఁ దెచ్చి త్రాఁగ నిచ్చెను. రాధ దానిని జూచి "ఈ గిన్నె యా సేద్యగాని యింటిలోనిదికాదా? నీ కెట్లు వచ్చినది?" అని ప్రశ్నించెను.

ఎఱు—ఎటుల వచ్చిన దని పలుకుదు వేల? నాకు సొంతమైన దేల యుండగూడదు?

రాధ—నీవు నిజమును మఱుగుపఱుచుచున్నావు. నే నీ గిన్నెను నా సేద్యగానియింటిలోఁ జూచితిని.

ఎఱు—రాధా! నీ వసాధ్యురాలవు. నా కార్యమునకుఁ గావలసిన దానవు. సరి, అదే గిన్నె. ఆ కన్నె నా కిచ్చెను.

రాధ—లేదు. అబద్ధము. ఆమె యియ్యఁగా నేఁ జూడలేదు.

ఎఱు—నీవు చూచుచుండఁగనే యిచ్చునా? ఏమి! నేను సోదె చెప్పినందులకు దాని నిచ్చెను.

రాధ తనవలె నందఱు యోగ్యులని భావించి యా ముసలిదాని పలుకులు నమ్మెను. కాని యొకానొకసమయములో 'నీమె దొంగిలించియుండునేమో! ఇట్టి గుణహీనురాలివశములో మే ముండ వలసివచ్చెఁగదా!' యని రాధ పరితపించుచుండెను. మఱియొక సమయములో "దిక్కులేని మన కీ ముసలిది దేవునివలెఁ దోడ్పడి యాహార మొసంగి మమ్ముఁ గాపాడుచున్నది. ఇది విషమావస్థగా

నున్న దే! ఏమి సేయుదును" అనుకొనెను. రాధ చిన్ననాఁటినుండియు దైవమును నమ్మినవారికిఁ దప్పక కష్టము లీడేరు నను మూఢనమ్మకము గలిగియుండెను. చిట్టచివర కట్టివారికే శాశ్వతమైన యానందము లభించుట యని పురాణగాథ లనేకము లున్నవి. నమ్మకములేని సంశయాత్ములకంటె నట్టివారు ధన్యులే. "సంశయాత్మా వినశ్యతి" అన్నమాట వ్యర్థమగునా? రాధ మాత్రము "ఏ విధముననో మమ్ము నింతవఱకుఁ గాపాడిన భగవంతుఁ డింక ముందును గాపాడు"నను కొనుచుండెను. వారు ముగ్గురును గడు దూర మరిగిరి. పిల్లలకుఁ గోయంబుత్తూరునకు వెళ్లుచున్నారని నిశ్చయముగా విదితమయ్యెను. త్రోవలో నెవరో యొక మనుష్యుఁ డొక శాలువను దెచ్చి యేమో రహస్యముగా నెఱుకుసానితో మాటలాడి యింకొక మాటయు నామె కిచ్చి వెళ్ళెను. సాయంకాల మైదుగంటలకు వారు దగ్గఱగా నుండిన యొక తోపునకు వెళ్ళిరి. రాధయు నలము నలసిన వారై యక్కడి పచ్చికనేలపైఁ బరుండి వెంటనే గాఢనిద్రం జెందిరి. ఆముసలిది, వారు నిద్రఁ జెందుటం గాంచి మెల్లగా నాతోఁపు వదలి వెళ్ళిపోయెను. రాధ మేలుకని "అయ్యో! మమ్ము నీ దిక్కులేనిచోట నొంటరిగా వదలిపెట్టి యెఱుకలసాని పోయిన దే" అని తలంచి శాలువ యచ్చటనే యుంటఁ గాంచి "ఛీ! అన్యాయముగ సంశయించితిని" అని తన మనస్సులో నెంచి, లేచి, నలుగడలం జూచుచుండెను. అలము నిద్రించుచుండెను. అట్లు రహస్యముగాఁ బోయిన యెఱుకలసాని తిరిగి రానేలేదు.

రాధ "ఓహో! మమ్ము మోసపుచ్చి పోయిన ట్లున్నది. రాత్రి యేడెనిమిదిగంటలయ్యెను. ఏమిచేయుదును?" అని తనలోఁ దాను దిగులు జెందుచుండెను. పండువెన్నెల గాయుచుండెను. ఆ తోఁపులో నీ దిక్కుమాలిన పిల్లలకా చందమామయే తోడు. పరుగెత్తి పారిపోవలయునని రాధ యనుకొనియెను గాని 'యా ముదుసలి తిరిగి రాదని యెట్లు నమ్మకము?' అని యూహించి క్షుద్బాధాపీడితలైన యా బాలిక లాహారము లేమిఁ గాలెత్తి కాలుపెట్టలేనందున నక్కడనే పడియుండిరి. కొంత సేపటికి సమీపములో నెవ్వరో మాట

లాడుచున్న శబ్దము వినవచ్చెను. ఎఱుకసాని యొక పురుషునితో మాటలాడుచుంట రాధ కనెను. ఆ మనుష్యుఁడు "మోసము జరుగదు. అయిన మనల నెందఱో వెదకుచున్నారు" అని తెలియఁ బలుక నామె 'యంతపనియు నా నెత్తిన వేసి నీవు తప్పించుకొనుట న్యాయ్యమా?' అన "అవును! నీ వీ యాఱుమాసములు దాఁగి యుంటివి. నిన్ను నేను చూడనేలేదు. ఈ బాలిక లెవరు? నీవు చెప్పిన ప్రకారము నెఱవేర్చెద" నని యతఁ డొప్పుకొనెను.

ఎఱు—"నే నీ యరణ్యములో వీరిని బెట్టుకొని యుందును. నేఁ
జెప్పిన స్థలములో జాగ్రత్తగ నుండుము." అనెను.

వెంటనే యా మనుష్యుఁ డెక్కడికో తిరిగి వెళ్లెను. ఎఱుకుసాని యా పిల్లలు నిద్రించు ప్రదేశమునకుఁ దిరిగి వచ్చెను. దానిం గాంచి రాధ నిద్రపోవుదానివలె నటించెను. పిల్లలు నిద్రించుచున్నారని భావించి తాను దెచ్చిన సామానులను రెండు మూఁడు దిండ్లుగాఁ గట్టి వారి తలక్రిందఁ బెట్టి వారిని లేపి వారి కాహాగము పెట్టి తిరిగి నిద్రపుచ్చెను. రాధయు నింతసేపు మేలుకొని యున్నందున మరింత సుఖముగా నిద్రించెను. మఱునాఁటి యుదయమున కోయంబుత్తూరునకుఁ బోవుటకు నెఱుకుసాని వారిని లేపఁగా రాత్రి జరిగినది కలయో కల్లయో రెండును రాధకుఁ దెలియకుండెను. ఒకటి మాత్రము నిజము. మూట మాత్రము పెద్దదయ్యెను. అలము దానిం జూచి "అవ్వా! ఏమి! మూట పెద్దదిగా నున్నదే?" యన "కొన్ని గుడ్డలు కోయంబుత్తూరులో నిచ్చుటకు మా వదినె యిచ్చినది. ఆమెకుఁ దీసికొనిపోయి యియ్యవలయును. నీకు సంబంధము లేని కార్యములో నీ వేల ప్రవేశించెదవు?" అనుచు జాము సేపులో నందఱును గోయంబుత్తూరు జేరిరి.

---

# అయిదవ ప్రకరణము.

## బాలికలకుఁ గలిగిన యాపద.

ఎప్పుడును పట్టణముల ముఖమే యెఱుఁగని యాపిల్లలు గొప్ప పట్టణమగు కోయంబుత్తూరును గనినప్పుడు వారికిఁ గలిగిన యానందము వర్ణింప నేరితరము? ఆ యానందాతిశయంబునఁ గాళ్ళనొప్పులు, కడుపులోని యాఁకలియుఁ దెలియకపోవుటయేగాక తమ్ముఁదీసికొనిపోవుచున్న దెవ్వరో, యెచటికో, యెందులకో వారి కొక్కటియుఁ దలకుఁ దట్టలేదు. నేత్రములుదప్ప మఱి యే యింద్రియములును బనిచేయలేదు. ఆ పట్టణపరిదర్శనము వారి నానందమగ్నుల నొనరించె. ఆహా! ఏమి వారి సంభ్రమము! ముందుగాఁ బరుగెత్తిరి. కాని కాళ్లు నడువనియ్యక పోయినవి. తెలివి వచ్చెను. "అవ్వా! కాళ్లు నొప్పులెత్తుచున్నవి. కొంచెము సేపు కూర్చొని తరువాత నడువఁగూడదా?" అన నెఱుకు సాని బదులుపలుకక నడుచుచుండెను. కోయంబుత్తూరు ప్రవేశించినది మొద లామెమనస్సు మార్పుఁ జెందెను. వడి వడిగా నడువసాగెను. చూపులు భయోద్రేకమును వెలిబుచ్చుచుండెను. కాళ్లు తడఁబడ మొదలిడెను. దీని నంతయుఁ జూచి యాపిల్ల లిద్దరును గారణ మే మైయుండునా యని యోచింపసాగిరి. ఒక చీకటింటికి వారిని బిలుచు కొనిపోయెను. ఆ గృహంబున వారి నునిచి వెలుపలికి వచ్చి యామె యెవ్వరితోడనో గుసగుసలాడెను. తరువాత వా రిద్దఱిం దోడ్కొని రాజవీధిని వెళ్లక సందుగొందుల గుండఁ బోవు నామెతో నలము "చాల చెడ్డదానవు. నీవు మంచిదానవు కానేకావు. వెండిగిన్నె దొంగిలించినప్పుడే బయటపడెను" అనఁగ రాధ "నోరు మూసికో! ఏమియు మాటాడవలదు" అని చెప్పెను. ఎఱుకుసాని ముందుగాఁ బోవు చుండుటచే నలముమాటలను వినలేదు. తమతో వచ్చిన యెఱుకు సాని యింకొక యామెతో మాటలాడనారంభించెను. దానిం జూచి "అవ్వా! ఆయెఱుకుసాని యెవ్వరు? ఆమెను మీ రెఱుంగుదురా? ఆమెతో రహస్యముగా సంకేతములతో నేమియో మాటలాడితిరే?" అని రాధ యడుగఁగా "రహస్యము లేదు. ఏమి లేదు. నోటికి వచ్చినట్లు తెలిసియుఁ దెలియని మాట లాడకుము. నీదారి నీవు చూచుకో,

ఆ మూట నెత్తుకో—నడు." అని గద్దించి తన శాలువ నామె రాధమీఁదఁ గప్పి "ఈమూట తీసికొని యీ వైపు బజారువీథినిఁ బొమ్ము. ఎవరైన నిది యేమి యని యడిగిన 'మాయమ్మగుడ్డల మూట' అని చెప్పుము. ఆ బజారులో నోరు తెఱవఁబోకుము. ప్రక్కలఁ జూడకుము. చక్కఁగాఁ బో" అని చెప్పి రాధ యామాటల నర్థము చేసికొనకమునుపే యెలుకు పక్షి వలె బహుశీఘ్రముగా నాతావు విడిచి చనెను. ఆమె యెటు బోయెనో యని నాలుగువంకలఁ జూచుచు నడువీథిలో నిలువంబడియుండఁగా నొక రక్షకభటుఁడు రాధను బట్టుకొని "అమ్మాయీ! ఈ మూటయం దేమున్నది? అని యడిగి మూటను లాగికొనెను. బరువుగా నుండుటఁగనిపెట్టి 'ఏమో యనుమానము కలుగుచున్నది. దీనిని బరిశోధింపవలయును. నిన్ను నే విడువఁజాల. ఈ యూరిలో దొంగతనములు కొంతకాలమునుండి మెండుగా నున్నవి.' అని మూట విప్పి పరిశోధింపఁగా నాలుమానసముల క్రిందట కొంతమంది బందిపోటుదొంగలు దొంగిలించుకొనిపోయిన సొమ్ములు కనఁబడెను. "ఓహో! తక్కిన నగ లెక్కడ? ఇంక నిన్ను జేరిన వార లెవ్వ" రని యతఁడు ప్రశ్నించెను. అట్లు గద్దింపఁగా రాధ కేమియు దోఁపక మనంబులోపల వెఱపు, ఖేదము, వెఱఁగు వొడమ గడగడ వణఁకసాగెను. అలము పెద్దపెట్టున నేడ్వఁ బ్రారంభించెను. అయినను గొంతసేపటికి రాధ తేఱుకొని, ధైర్యము నవలంబించి రక్షకభటునివంకఁ బ్రసన్నచిత్తుఁ డగునటులఁ జూచి "అయ్యా! నన్ను కొంచెము వినండి. ఒక ఎఱుకసాని యీ మూట నాచేతి కిచ్చి నన్ను వంచించినది." అనెను. రక్షకభటుఁడు "ఆమె నీతల్లియా!" యని యడుగ, రాధ "కాదు; నిన్నటియుదయ మొక చెట్టు క్రింద నామెను గాంచితిమి. ఆమె యెవ్వరో మాకుఁ దెలియదు."అనెను. "అయిన సరే. ఇప్పు డామె యెక్కడ?" అని రక్షకభటుఁ డడుగ "ఈవైపున నిప్పుడే యామె పారిపోయినది. ఎచ్చటికో మాకును దెలియదు" అని యిద్దరు పిల్లలును జెప్పిరి.

"అయ్యో! ఇప్పు డామె చిక్కదు కాఁబోలు! దైవము నే నామెను బట్టుకొని బహుమతి వడయున ట్లనుగ్రహించుఁగావుత.

ప్రాతఃకాలమున నిద్రలేవఁగానే నే మంచిముఖము చూచితిని. రా. ఇక్కడకు." అని యతఁడు రాధచెయ్యిపట్టుకొని లాగెను. "అయ్యో! న న్నెక్కడకు లాగుకొని వెళ్ళెదరు? అలమూ! ఏడ్వకుము" అని చెల్లెలిని బుజ్జగించిన రాధను జూచి "పిల్ల చిన్న దైనను బాగుగా మాట్లాడుచున్న దే! ఎక్కడికిఁ దీసికొనిపోయెద వని యెంత గుండెనిబ్బరముగా నడుగుచున్నది! పేరూరులో నుండు స్వామిదర్శనము చేయించుటకు నిన్నుఁ దీసికొనిపోదు నని తలంచితివా? లేదు. కారాగృహామునకు" అని యా భటుఁడుచెప్పి యేపాప మెఱుఁగని యాపసిపిల్లల నొక బందిఖానాగదికిఁ దీసికొనిపోయి యందుంచి తలుపు తాళము వేసి "యిక్కడనే యుండుఁడు. మీ కాహారము తెచ్చియిచ్చెదరు" అని చెప్పి వెడలిపోయెను.

అతఁ డొనరించినపనిలో దోష మేమున్నది? రాధచేతిలోని మూటలో దొంగిలింపఁబడిన నగలు చిక్కెను. వానిం గని యతఁడు వారిని బట్టుకొనెను. ఈశ్వరేచ్ఛ. ఏమిచేయఁగలము? దుర్జనసంగతి పరిభవహేతువు, సర్వానర్థదాయకము, సకలదుఃఖసంధాయకము, ఆపదలకు నాలవాలము, కలుషములకు నాకరము, పాపములకు నునికి. కట్టా! ఎట్టి యిక్కట్టు వాటిల్లె?

ఆరక్షకభటుఁడు తిరిగి వెళ్ళఁగా నలము రాధకడకు వచ్చి "అక్కా! అక్కా! మన మిపు డెక్కడ నున్నాము? ఇది యేమి? మనల నెందుల కిందులో నునిచి తలుపు తాళము బిగించినారు?" అని యడుగ రాధ "ఇది పోలీసుగది. మనము పారిపోవుదు మేమో యని మనలను నిందు భద్రముగా నుంచినారు. ఏమి చేయుదురో చూతము. మన మే కర్మ మెఱుఁగము. మనయెడ నే దోషము లేదు. మన మేతప్పిద మొనరింపలేదు. మన కేల నిర్బంధము సంభవించును? మనల నెవ్వరు బంధిఖానాలో నుంచెదరు! అంత యన్యాయమా? వారు తాళము వేసినంత మాత్రమున మనము దోషుల మగుదుమా? విచారింపరా? నిజము తేలదా? మనలను వదలరా?

అలము:—ఏమో నాకు దిగులుగా నున్నది. నన్ను విడిచి నిన్నుఁ గొంపోదురేమో యని భయము కలుగుచున్నది.

రాధ:—ఎన్నటికి నటులు జరుగదు. నిన్నెపుడును నేను విడువను. అనెను. అల మీ మాట లాలకించి ధైర్యము తెచ్చుకొనెను.

అలము:—ఎఱుకులసాని చాలచెడ్డది. ఆమె వెండిగిన్నె దొంగిలించినది కాదా?

రాధ:—ఆ పాప మామె యనుభవించును. నిన్న నెంతయో మనకొఱకామె శ్రమపడినది. తాత చచ్చిపోయి రెండుదినము లైనను ఒక సంవత్సరముగా నాకుఁ దోఁచుచున్నది. నీవలె నేడ్వక పోయినను నాదుఃఖమునకు మేరలేదు.

అని కన్నీరు కార్చుఁదొడఁగెను.

అలము రెండుచేతులతో రాధముఖమును దుడిచెను. "ఎంత యోచించినను మనల నెందుల కిక్కడ నుంచినారో తెలియకున్నది. అక్కా! మన మేవిధమైన తప్పును జేయలేదు? ఎందుల కీ పోలీసులు గదిలో మనలను బెట్టినారు? మనలను విడిపింపుమని యడుగుదమా?" అని యలము ప్రశ్నించెను. ఎవరో వచ్చున ట్లూహించి కాలియడుగులచప్పు డాలకించి "ఎవరో వచ్చుచున్నారు. నేఁ జెప్పినది జ్ఞాపక మున్నదా? నన్ను మాత్రి మనాథను జేసి పోవద్దు. నన్ను వదలి నీ వెక్కడికిని బోఁ గూడదుసుమా!" అని యల మేడ్చెను. రాధ "అయ్యో! చెల్లెలా! వ్యర్థముగా వగవకుము. నేను నిన్ను విడిచి యొంటరిగా వెళ్ళి భరింపఁ గలనా?" అని బదులిడుచుండునంతలోఁ దలుపు తెఱచి యొకఁ డొక తగరఁపుఁ బళ్లెరములోఁ గొంత సంకటిముద్దను, పులుసును దెచ్చిపెట్టి "త్వరితముగా తినుఁడు. అధికారి మిమ్మే ప్రథమమున విచారించెదరు" అనెను. చాల నాకలితో నుండుటచే నాసంకటిని వా రమృతమువలె భావించి భుజించిరి. తినిన కొంతసేపటికే యొకసేవకుఁడు వచ్చి "బాలికలారా! లెండు. నావెంట రండు. అధికారి సభలోఁ గూర్చొనియున్నాఁడు" అనెను. రాధ దానిని విని, యధికారి యెవ రని యడిగెను. సేవకుఁ డాపిల్ల యడిగిన ప్రశ్న కాశ్చర్య మొంది "ఇన్నినాళ్ళవఱకు

నధికారి యెవరో మీకుఁ దెలియదా? మణియూరు కృష్ణయ్యగారు" అనిపలికెను. ఇంకఁ గొన్ని ప్రశ్న లడుగ రాధ తలఁచెను; గాని సేవకుఁ డందులకు సందియ్యక వారినిఁ దోడ్కొని త్వరితముగా కచ్చేరికి వెళ్ళి వారి నధికారియొద్ద నిలిపెను.

న్యాయస్థాన మొకపెద్దచావడి. ద్వారమునకు నెదురు గోడకు దగ్గరగా నిటుకరాళ్ళతోఁ గొంచె మెత్తుగా నొక యరుఁగు వేయఁబడి యుండెను. ఆయరుఁగునకు మూఁడు ప్రక్కల ఁటేకుకఱ్ఱలతోఁ గటకటాలడ్డముగాఁ గట్టఁబడియుండెను. అందు నొక కుర్చీయును, దానిముందఱ నొక బల్లయు, నాబల్లమీఁద పుస్తకములు, కాగితములు, కలములు, సిరాబుడ్లును గలవు. ఆ కుర్చీలో నొకపెద్దబొజ్జ గల యధికారి కూర్చొని యుండెను. ఆతఁడు బంగారు సులోచనములు ధరించి భూలోకములో న్యాయమును బరిపాలింపవచ్చిన ధర్మదేవతవలె నుండెను. వేదికకుఁ గ్రిందుగా ముందుభాగమున నొక పొడుగుబల్ల యుండెను. బల్ల కిరువైపులఁ గుర్చీ లుండెను. కుర్చీలమీఁద న్యాయవాదులు కొంద ఱుద్యోగస్థు లాసీనులయి పుస్తకములను ద్రిప్పుచుండిరి ఇందుఁ జాలమంది యక్కడ జరుగనుండినవిచారణను వినుటకు వచ్చియుండిరి. అధికారి కెదురుగా, న్యాయవాదులు కూర్చొనిన బల్లకు ముందుగా, నొక నలుచదరఁపుబ్రదేశమునకుఁ గొయ్యలతోఁ గటకటాలు కట్టఁబడియుండెను. అందు నొక వైపున తలుపుండెను. దానిని దెఱచుటకు మూయుటకు వీలుండెను. ఇంకొకటి యధికారికిఁ గుడిప్రక్కగా నుండెను. ఇందు సాక్షులను, నందు ముద్దాయిలను విచారించెదరు. ఆ దినము కచ్చేరీ యంతయుఁ గిటకిట లాడుచుండెను. రాధ యాకచ్చేరిలోనికిఁ బోయిన వెంటనే నలుగడలం బరికించి యధికారికి దూరముగా నెఱుకుసాని నిలువఁబడియుండుటయుఁ దనను బట్టుకొన్న రక్షకభటుఁడు కూడ నం దుండుటయు గుర్తించెను. వీరిని జూచి రాధ విస్మయముఁ జెందెను. అలము వణఁకసాగెను.

అధికారి తన బంగారు సులోచనములను జక్కఁగా దుడిచి కన్నులకుఁ బెట్టుకొని యొక వెండి డబ్బీనుండి రెండు వ్రేళ్ళతో నొక

చిటికెడు పొడుమును దీసి బుఱ్ఱని యెగబీల్చి ముక్కులను నింపి తన వస్త్రములమీదఁ బడినపొడిని చేతిగుడ్డతోఁ దుడుచుకొని రక్షకభటుని గాంచి "ఈ పిల్లలేనా యీ నగ లెత్తుకొని పోవుచుండిరి?" అని ప్రశ్నించెను.

రక్షక—చిత్తము మహాప్రభో! అదిగో! ఆ నల్లకన్నుల పిల్లయే, మూటను మోసికొనిపోవుచుండినది.

దానిని విని యధికారి వారిరువురిముఖముల నవలోకించి వారియెడ దోష మున్నదా లేదా యని యాలోచింపఁగడంగెను. దానిం గాంచి రాధ తమమీఁద నధికారికి దయ కలుగునేమో యని తలంచుచుండెను.

అధి—ఈ పిల్లలు చాల చిన్నవారు.

సేవ—అవును మహాప్రభో! వయ సేమో తక్కువగాని దోస మెక్కువగ నున్నది.

అనిచెప్పగా విచారణాధికారి లేచి, "స్వామీ! యిటువంటి చిన్నవారే యీ కాలములోఁ జేయరాని పనులను జేయుచున్నారు. ఇట్టివే యిప్పుడు విశేషముగా జరుగుచున్నవి. కనుఁగొనుట కశక్యముగ నున్నది. చిక్కినవారిని నిర్దోషు లని విడిచిన, నేరస్థులు పట్టువడరు. నేరము లధికము లగును. న్యాయము విచారించి మా కష్టమును, ఒరిపాలనాసౌకర్యమును, సర్వరక్షణభారమును బర్యాలోచించి తమ కిచ్చకు వచ్చినట్లు చేయఁ బ్రార్థించెదను" అనెను.

అతఁడు చెప్పిన దంతయు వినినట్లు నటించి

అధికారి—బాలికలారా! మీ పేరేమి?

రాధ—నా పేరు రాధ.

అధికారి—ఆ చిన్నపిల్ల నీ చెల్లెలేగదా? ఆమె పేరేమి?

రాధ—అవును. దాని పేరు అలమేలు.

ఎఱు—నే నిదివరకే యధికారులతో విన్నవించుకొనినది నిజ మని తేలినది కాదా? ఆ రాధ, అలము—వీరే నామనుమరాండ్రు. వీరే నాకు జీవనాధారము. వా రొకతప్పుఁ జేసియుందురు.

రాధ—అయ్యా! ఆమె వచించున దంతయు నసత్యము. మే మామె బంధువులమే కాము. ఆమెకును మాకును నేలాటిచుట్టరికము లేదు. నిన్న ప్రాతఃకాలమునకుఁ బూర్వ మామెముఖమును మేము చూచియుండలేదు.

అధికారి—(ఎఱుకసానితో) ఏమి? నీవు చెప్పినది, వారు నుడివినది భేదముగా నున్న దే?

ఎఱుక—మహాప్రభూ! వారిమాటలను నమ్మకుఁడు. అస్థిచర్మములు ధారవోసి పెంచిన నన్ను దమ యవ్వకాదని నుడువు వీ రేపాప మును జేయజంకుదురు? ఎంత సాహసము!

అధికారి—(అలమును జూచి) ఈమె నీ యవ్వయేనా?

అలము—మాయవ్వకాదు. మా కవ్వయే లేదు.

అని యూరకుండఁగ నెఱుక నోటికి వచ్చినట్లు వారినిఁ దిట్ట సాగెను. దానిని విని యామెను కచ్చేరిగదిలోనుండి వెలుపలికిఁ గొంపొమ్మని భటుల కాజ్ఞాపింపఁగా వా ర ట్లొనర్చిరి.

అధికారి—కచ్చేరీలో నింద ఉండఁగా మర్యాద లేకుండ నిట్లు ప్రేలుచున్నది. తరువాత దీనికిఁ దగినశిక్ష విధించెదను. రాధా! నీ విటు రమ్ము. అలము! నీ వక్కడనే యుండుము. మరల నిన్నుఁ బిలిచెదను.

(రాధతో) "కుమారీ! నీవు నాకు జరిగినది జరిగినటుల వివరింపుము. ఆమె మిమ్ములను గలిసికొనినది మొదలుగా నన్ని సంగతులు విశదీకరింపుము. నీకు భయము వలదు. ని న్నెవ్వరేమియుం జేయరు. నిజము పల్కుము" అని యడుగఁగా, రాధ పూసగ్రుచ్చినటుల సర్వము నెఱిఁగించె. అంత రాధ నవల కనిపి యలమును జేరదీసి య దేవిధముగ నడుగ నామెయుఁ గథ నంతయు సవిస్తరముగాఁ బలికెను. ఇద్దఱను విని భేదము లేమియు లేకుండుటం గాంచి, 'యెఱుక గోముఖవ్యాఘ్రము. అబద్ధము లాడె ననుటకు సందియము లేదు. ఇటువంటి అమాయికలనా తనకు సాధనముగా నొనరించుకొనుట! ఏమివన్నాగము పన్నిన

దయ్యా! ఎంతమోసకత్తె! నిజము బయలుపడెను. ఇఁక నేమి సందే హము' అనఁగ

(విచారణాధికారి—లేచి) ప్రభూ! అట్లుకాదు. ఈ యిద్దఱు ముద్దియలు సామాన్యులుకారు. తప్పుచేసి దానిని గప్పిపుచ్చుటకై యీపాట సిద్ధముచేసి పెట్టుకొనిరి. దానిని విని మోసపోవుట న్యాయ్యమా! మాకష్టములు వృధాయగుచున్నవి. మేము పనిచేయుటలే దనునపవాదము మాకు మెండుగ గలుగును. స్వామిపతకములు, నగలు పిల్లచేతిలో నుండఁగఁ బట్టుకొంటిమి. ప్రత్యక్షముగఁ జూచితిమి. ఇటువంటిపిల్ల యమాయికయా? నేరములు చేయుట కారితేరినవా రేదోయొక చిత్రమైనకథను గల్పించి చెప్పి మిమ్ము మోసగింప యత్నించినారు. నమ్మవలదు. ముమ్మాటికి వీరి మాటలను నమ్మవలదు. అధికారి స్థలమునకు రాఁగానే సామాన్యబాలికలువణఁకుదురు. వీరో కడ తేఱినవారు. వీరియునికిఁ గాంచిన దోషులని చెప్పుటకు సందేహమే లేదు.

అధికారి—అన్యాయముగా మాటాడవలదు. ఆ పిల్ల లమాయికలే. ఆ ముసలిది దుర్మార్గురాలు. నిజమును గనుఁగొనలేరుగదా మీరు. ప్రపంచానుభవము కావలయు. మీకుఁ బనులు పోవుననుచింతయేగాని నిరపరాధులు పాపము! దండింపఁ బడుదురే యని లేదుగదా. నేరము జరిగిన దనినంతమాత్రమున నెవరినో పట్టి సాక్ష్యముఁగల్పించి దోషులైననునిర్దోషులైనను వారికొంపఁ గూల్ప నెంచుదురు. ఇది సరిగాదు. ఏది యెట్లుండినను వీరివిషయములో మీరు పొరపాటుపడినారు. వీరు నిజముగ నిర్దోషలు.

రాధ—(వీ రిరువురి సంభాషణమును విని) అయ్యా! మా పూర్వవృత్తాంతము మీ కొకింతయుఁ దెలియదు. మీకుఁ బిల్లలు లేరా? తండ్రులకుఁగాని పిల్లలయెడ వాత్సల్య ముండదు. మా తాతయుండెను. మాయం దెట్టి ప్రేమ! మమ్ము విడిచి యొక్క నిమిషమైన నుండెడువాఁడుకాఁడు. కరుణలేదయ్యా మీకు! అక్రమముగా నేరము మోపుచున్నారు. మమ్ములను దొంగ

లనుగా భావించి రని నాకు పట్టరానిదుఃఖము వచ్చుచున్నది."

అని బిగ్గరగా నేడ్చెను. అలముకూడ నేడ్చెను.

ఆ సభయందుండినవా రందఱును గన్నీరు కార్చిరి. వారి యమాయికత్వము, నిర్దోషత్వము నందఱికిని విదిత మయ్యెను. అధికారియు వారిని సమాధానపఱిచి, "పిల్లలారా! విచారణ ముగువఱకు మీ రిద్దఱును వెలుపల నాడుకొనుచుండుఁడు" అనిచెప్పి "భటులారా! వీ రిద్దఱను గనిపెట్టి యుండుఁడు. వారిని వేఁబు సేయకుఁడు. ఇష్టము వచ్చినటు లాడుకొననిండు" అనిచెప్ప, భృత్యులు వారిని వెలుపలికిఁ గొంపోయిరి.

అధికారి—(విచారణాధికారిని గాంచి) అయ్యా! మీయభిప్రాయమును మీరు భద్రముగా నుంచుకొనుఁడు. ఆపిల్ల లెప్పటికిని దోషులు కారు. వా రమూల్యరత్నములు.

అనిచెప్పి సభ చాలించెను. రక్షకభటు లాపిల్లలయెడఁ గనికరముతో నుండిరి. అధికారియిష్టప్రకారముగదా యందఱు ప్రవర్తించుట.



# ఆఱవప్రకరణము.

## అరుళ్‌నాథుని కేసువిచారణము.

ఆగుడిసె పరశురామప్రీతియైన మఱునటిదినము సూర్యుఁడుదయింపఁగా నానావర్ణమణిమరీచిజాలములు హిమబిందువులనుండి ప్రకాశించుచుండెను. చోరులకు, జారులకు, నాతతాయులకు, ఘాతుకులకు, సకలకలుషములకు ననుకూలమైన యంధకారము పటాపంచలయ్యె. అధర్మమును నాశంబొనర్చి ధర్మసంస్థాపనంబును జేయ సమకట్టి వచ్చిన మహాత్మునిభంగి సూర్యుఁ డుదయాద్రిని విడిచి యాకాశమార్గంబున కెగయ నారాత్రి గావింపఁబడిన పాపకార్యఫలితంబులు లోకమునకు వ్యక్తమయ్యె. అరుళ్నాథునిదుర్మరణంబు కుంతలమ్మకు వేద్యమైనది మొదలు పచ్చయప్పగారి సౌధమున జరుగుచుండిన కల్లోలము వచింప నలవికాకుండెను.

సాధారణముగ భాగ్యవంతు లుదయమునఁ జిఱుతిండిఁ దినుట కలదుగదా! పచ్చయప్పగారిసౌధములోఁ గొన్ని పిండివంటలు, పానీయములు, ఫలములు నొకబల్లమీఁద నమర్పఁబడి యుండెను. అమృతవల్లి యచటికి వచ్చెను. ఆమెముఖము రాత్రి నిద్రలేమిచేఁ గొంచెము వాడియుండెను. కాని యామెసౌందర్యమునకుఁ గొఱంత కలుగలేదు. పొగడపువ్వు వాడిపోయినను సౌరభము చెడదుగదా! ఆమె చిఱుతిండిఁ దినఁ బ్రారంభించెను. తన పురుషుని స్వాధీనముఁ జేసికొనుట కెన్ని యుపాయములు గలవో యన్నియు నమృతవల్లి నేర్చియుండెను. సమయానుకూలముగ నీయుపాయములను బ్రయోగించుచు భర్తను వశముఁజేసికొని తనకార్యముల సాధించు కొనుచుండెను. అపు డొకసేవకుఁడు వేగముగాఁ బరుగెత్తికొనివచ్చి "అమ్మా! అమ్మా! దుఃఖవార్తను మెల్లఁగాఁ జెప్పి మీకు ధైర్యమును గలుగఁ జేయఁ బ్రభువుగారు నన్నుఁ బంపెను." అనెను. 'అమృతవల్లి తెప్పటిల్లుకొని, తన వామహస్తమును గుండెమీఁద నిడుకొని "పిల్లల కేమి యాపద! అయ్యో! నా పిల్లల కేమి యాపద? చెప్పుము, నామనస్సున కాందోళనముఁ గలిగింపకుము" అని యుత్తమసాధ్వి పాపభీతి కెట్లు

వెలుచునో యూవిధముగ నటించి, "పిల్లలు దేవునిదయవలన సురక్షితులే కదా ?" అని యడుగ, వాఁడు "అమ్మా! మన కుంతలమ్మ! కుంత లమ్మ! ఆమెకు ముహూర్తము జేపుకదా" అనిపలికి, యూపైనవచించు టకు నోరాడక కన్నీరు గార్పఁదొడంగెను. జాలిగుండెవాఁ డగుటచే దుఃఖాతిశయమున వానికి నోట మాట రాదయ్యె. ఇంతలో నమృత వల్లి "కుంతలమున కేమిరా ? నేను నిన్న నామెను జూచితినే. ఎక్కడ నెవరు చంపిరి ? నోరుతెఱచి చెప్పరా ?" యని పలికెను.

సుబ్బన్న—ఆమెయూయుస్సు గట్టిది. అరుళ్నాథునిమాత్ర మెవరో పొడిచి చంపినారు. దానిని బ్రతమమునఁ గాంచినది కుంత లమ్మయే.

ఆమె గుండెలు దడదడ కొట్టుకొనుచుండ సుబ్బన్నను జూచి "ఎవ రిట్టి దారుణకృత్యము చేసినది? ఎవరిచే జరగినది? నీకుఁ దెలిసిన దంతయు విస్తరింపుము" అనెను. సుబ్బన్న ప్రత్యుత్తర మొసంగుటకుఁ బూర్వమే వెనుకనుండిన తలుపుతెఱవఁబడి, అందుండి తెల్లగుడ్డ కప్పఁ బడిన అరుళ్నాథునిశవ మచటికిఁ దేఁబడెను. దానితోఁబాటు మూ ర్ఛం జెంది శవాకారముగా నుండిన కుంతలమ్మకూడఁ దేఁబడెను. అమృతవల్లి కుంతలమ్మచెంతకు వెళ్ళి యూమెతలను దన యొడిలోఁబెట్టు కొని తడిగుడ్డతో నామెముఖమును దుడిచి, యీ క్రిందివిధంబుగ విల పించెను. "అమ్మా! కుంతలం! మిత్రరత్నమా! విదుషీమణీ! అపరసరస్వతీ! నీకా యిట్టిగతి సంభవించుట! అరుళ్నాథునిఁ జంపు టకు బదులు నన్నే యూపాపి చంపియుండఁగూడదా దైవమా!" అని కుంతలమ్మయొక్క సొంతతల్లిమాడ్కి రోదనము చేసెను. అప్పుడు సుబ్బన్న యమృతవల్లిం గాంచి "అమ్మా! మీ రిట నున్న దామెకుఁ దెలియదు. మీ రామెకుఁ దెలివిరాకముందే లేచిపోయిన మంచిది. నేను కష్టముల ననుభవించినవాఁడను. నేఁ జెప్పినటుల దయచేసి కొం చెము వినుఁడు. మీస్వస్థానమున కేగుఁడు. ఈ ఘోరము మీరు చూడఁదగినదికాదు. అయ్యగారికిని మీ రిక్కడ నుండుట యిష్టములేదు" అనెను. దానిని విని యమృతవల్లి యూ స్థలమునుండి లేచివెళ్ళెను.

శవ మిక్కడికి రాకమునుపే పచ్చయప్పగారు వేదగిరితోఁ జాల సేపు తగులఁబడిన గుడిసెవిషయమై మాటలాడుచుండెను. అక్కడ జరిగిన యన్యాయమునకుఁ గాలిపోయిన శవముతప్ప వేఱేమియు సాక్ష్యములేదు. జను లేమియో చెప్పుకొనుచున్నారుగాని నిజము తేల లేదు. అన్యాయముగా నొకప్రాణి కాలిపోయె నని వేదగిరి విన్నవించు చుండెను. పచ్చయప్ప తన రెండుచేతులను గట్టుకొని తలవంచు కొని ముఖమున విచారము గన్పడఁ గదలనిచెట్టుమాడ్కి వేదగిరి నుడు వున దంతయు శ్రద్ధతో వినుచుండి, "ఇది కాలవైపరీత్యముగాని వేఱు కాదు. యముఁడే యిట్లు కావించెను. ఇంత స్వల్పకాలములోనే యిల్లు తగులఁబడుట సంభవించునే? నా ప్రాణస్నేహితుఁ డరుళ్నా థుఁడు నా తోఁటలోఁ జచ్చి పడియుండెఁగా? నా కుటుంబములోని పిల్లవలెఁ బెరిగిన కుంతలమ్మ పెండ్లికి ముందునాఁడే యిట్టి ఘోర దుఃఖ మనుభవింపవలసివచ్చె. దారినిఁ బోవు బాటసారి తన త్రోవను మాని యీ పాడుగుడిసెలో దూరి పాప మాం పిల్ల లిద్దఱితోఁ దన ప్రాణములను ధారవోసికొనెను? నే నేమి పాపము చేసితిని? దైవమా! ఏల న న్నిట్లు పరీక్షించుచున్నావు? ఏమి నా కర్మము? దేవత లందఱు నా యెడల నిర్దయను జూపుచున్నారు. ఎప్పు డీ యశుభము లడఁగిపోవును? అణఁగనే యణఁగవుకాఁబోలు? అంబు జముతో నాయదృష్టములు గతించినవి?" అని శోకసంతప్తమానసుఁడై యుండ, వేదగిరి "మహాప్రభూ! అరుళ్నాథునిశవ మధికారులు వచ్చి చూచి పరీక్షించిపోవువఱకు మన మేడమీఁద దాని నుంచునటులఁ జెప్పితిని." అని పచ్చయప్ప కది సమ్మత మగునో కాదో యని మిక్కిలి భయపడుచుఁ జెప్పెను. దాని కాయన "నీవు జేసినపని బాగుగ నున్నది. అయ్యో! నా ధన మంతయు నిచ్చెదను. ఎవ రైనను అరుళ్నాథుని జీవింపఁజేయువారు లేరా? ఆశ యేమియు లేదు కాఁబోలు? ఆ గదిలో నాతని శవమును బెట్టుటకు నన్ను వేఱుగ నడుగవలయునా?" అని కన్నీరు నేత్రములనుండి కారుచుండ, నున్న ట్లుండి, 'ఆ గుడిసెలో నిలిచి ముసలివాఁడు ప్రాణములు గోలు పోయెను. ఆ పసికూనలు గూడ మడిసిరిగదా? ఇన్నిమరణముల నేఁ

జూడవలసివచ్చె; ఆ కొట్టములో నిలుచుటకుబదు లరుగునొద్ద నిలువఁ గూడదా ? కుక్కకూడ నా గుడిసెఁజూచి పారిపోవునే. ఆ ముసలివాని కది యెట్లు తోఁపకపోయెను." అని పలువిధములఁ బలవించి బాలుని వలె వెక్కి వెక్కి యేడ్చి యాస్థలమును విడిచి క్రిందికి వచ్చి తన తోఁటఁ బ్రవేశించెను.

ఆయన యిటుల మాటలాడుచుండినపుడు సుబ్బన్న వచ్చి వెనుక నిలుచుండుటచేఁ బచ్చయప్పగారు తోఁటలోనికిఁ బోఁగా నాతఁడు వేదగిరిని జూచి "మన యజమానుఁడు పూర్వమే యధైర్య పడియుండెను. విషయము లన్నియుఁ బూర్తిగా నాయనను మార్చి వేయును. సగము పిచ్చి యెత్తినది. ఇతఁడు చిన్నతనములో నెంత సంతోషముతో నుండెడివాఁడు? ఏ విధమైన చింతయు లేకుండెను. అన్యాయముగా మారిపోయినాఁడు. అయినను కాలమునకు ముందే యిట్లు మారుట కష్టముగదా?

తోఁటకుఁ జేరిన పచ్చయప్పగారెవ రేమి చెప్పినను, వినిపించు కొనక తోఁటయంతయుఁ దిరుగఁజొచ్చెను. నిలుచుచు, నిట్టూర్పుల విడుచుచు దుఃఖమును జెందుచు పచారుచేయుచుఁ గొంతసేపు కాలము గడపి తా దిగివచ్చిన మెట్లువైపునఁగాక మఱియొక మార్గమున వెళ్ళి మేడ నెక్కఁబోఁగా, నాస్థలములోనుండిన సేవకుఁడాతనిఁ జూచి తొలఁగి భయపడి నిలిచెను. "అరుళ్‌నాథుఁ డెక్కడ" అని ఆయన యతని నడుగ "మేడమీఁదిగదిలో నాతని శవ మున్నదఁట" అని చెప్పెను. ఆయనకు నాసంగతి యంతకుముందే తెలిసినను ఉన్మాదావస్థలో నుండు టచే "జమ ఖర్చు లెక్కలను దెమ్మని యరుళ్‌నాథునితోఁ జెప్పుము" అని సేవకుని కాజ్ఞాపించి యతఁడు పోయెను.

మధ్యాహ్న సమయమున నామేడలో నారాత్రి సంభవించిన రెండు దుర్మరణంబులఁ గూర్చి విచారణజరుప నధికారులు వచ్చిరి. పంచాయితీకూడిరి. అరుళ్‌నాథుని శవముచెంతఁ జేరిరి. అక్కడ నొకబల్లపై సగము కాలిన యెముకలు, చర్మముగలయొక యనాథప్రేత ముండెను. అయ్యది నల్లప్ప మొండెము. పంచాయితీదారులు మొదట నా మొం

డెమునే విచారణమునకుఁ దీసికొనిరి. ఏ కారణమున నీ గుడిసెలోఁ బిల్లలతో దాఁగి యకస్మాత్తుగా కాలిపోయెను? పిల్లలును గాలిపోయి యుందురు. చిన్నపిల్లలగుటచేతను, పెద్దమంట యగుటచేతను, నెముకలు కాలి బూడిదె యయియుండును. అతఁడు ముసలివాఁడు; చావునకు సిద్ధముగా నున్నవాఁడు. అతఁడుగాని యతని పిల్లలుగాని యెవరైన దియు నేరికిని దెలియదు; కొంప యెటుల తగులఁబడినదియుఁ దెలియదు. దీనికి దహనమునకు నుత్తరువు నియ్యవచ్చును." అని పంచాయితీదారులు తీర్మానించిన పిదప నాయూరివారు చందాలు వేసికొని దహనసంస్కారముఁ గావించిరి.

ఆ విచారణము ముగియఁగానే అరుళ్ నాథుని మరణమును గుఱించి విచారణ ప్రారంభమయ్యెను. అరుళ్ నాథునియొద్ద లెక్కలు వ్రాయుచుండిన కుప్పుస్వామిని బిలిచిరి. ఇతఁడు చదువుకొనిన వాఁడు, బుద్ధిమంతుడు, గుణవంతుఁడు, ఇరువది వర్షముల ప్రాయఁపు వాఁడు. అతనిని విచారించిరి. కుప్పుస్వామి తాను జూచినంతవఱకు దనకుఁ దెలిసినంతవఱకుఁ, దన కిష్ట మున్నంతవఱకుఁ దగిన సాక్ష్యముతోఁ బలికెను. అరుళ్ నాథునియొద్దఁ దా నెప్పుడును గాచుకొని యుండి యతఁడు చెప్పినపనిఁ జేయుచుండుటచే నతనివిషయ మతనికిఁ దెలియుచుండును. ఆరాత్రి అరుళ్ నాథుఁడు బయలువెడలి, తిరిగి యరగంటసేపటికి రాఁగఁ దా నతని జూచినప్పు డతఁడు మైమఱచియుండెను. కన్నులనీరు దుడుచుకొను చుండెను. "ఏ మిటుల కోపపరవశులుగా నున్నారు మీరు?" అని కుప్పుస్వామి యడుగ, నతఁ డేమియుఁ జెప్పక నిట్టూర్పు విడిచి యూరకుండెను. అరగంట యైనపిమ్మట "నీ కేమియుఁ బనిలేదు. నీవు వెళ్ళవచ్చును." అని యరుళ్ నాథుఁడు చెప్పఁగా కుప్పుస్వామి తన యింటికి వెళ్లెను. ఇంకను నధికారులు బహువిధముల నతని నడిగిరి. కాని యతని కింతకంటె నెక్కువ యేమియుఁ దెలియకుండెను. చక్కఁగా నొక్కటియు బయలుపడలేదు. కత్తితో మర్మస్థానమునఁ గ్రుచ్చుటచే నతని ప్రాణము పోయెను. అట్లు గ్రుచ్చిన పాపికి నిది మర్మస్థానము; ఇటఁ

గుచ్చిన నోరు తెఱవక చచ్చునని తెలిసియుండవచ్చు నని నిశ్చయిం చిరి. కాని, యాపని చేసిన దెవ్వరో తేలలేదు.

విచారణము జరుగునప్పుడు కుంతలమ్మకూడ కూర్చుండి జాగ్రత్తతో నంతయు వినుచుండెను. అరుళ్‌నాథు నెవరు చంపిరి? కారణ మేమి? అను ప్రశ్నలకు జవాబు రాలేదు. ఏమియైయుండునో యెవరికిని దోఁపలేదు. అతఁ డజాతశత్రువు; అతనిముఖమున నెప్పుడును గోప మనునది చూచినవారే లేరు. దానిచేతనే కుప్పుస్వామి యా రాత్రి యతఁడు కోపముతో నుండెనని వచింపఁగ నెవ్వరును నమ్మలేదు. నిజ ముగాఁ గోపించియుండు నేమో! కారణ మేమి యుండఁగలదు? 'పొడిచి చంపినది దొంగకాదు. దొంగయైన నరుళ్‌నాథుని శరీరముమీఁది బంగారునాభరణములను దీసికొనియుండును. చేతికి గట్టిమురుగులు, నడుమునకు బంగారు మొలత్రాఁడు, వ్రేళ్ళకు వజ్రపుటుంగరములు, చెవులకుఁ గమలములయంటుపోగులు, వీని నన్నింటిని విడిచి దొంగ వెళ్ళునా? ఇంతియకాదు; అతని రొండిన రెండువందల రూపాయల పత్రము లుండెను. దేనినిఁ దాఁకక పెద్దమనిషివలె దొంగ యుండునా? ఊరక చంపిన దొంగ కేమి లాభము? ఎవరో యతనితోఁ గలహించి యుందురు. వెనుకనుండి యతనికిఁ దెలియకుండఁ గత్తితోఁ బొడిచి యుండవలయును. కాని యెవ్వరు చేసినది తెలియకున్నది. ఆత్మహత్య కానేరదు.' అని పంచాయతీవారు తీర్మానించిరి.

పంచాయతీ చాలించిన వెంటనే కుంతలమ్మ లేచి గద్గదస్వర ముతోఁ గోప మతిశయింపఁగ నిట్లు మాటలాడఁ దొడంగెను. "ఆహా! యిదియేనా! యధికారులగు మీ రందఱుఁగూడి పంచాయతికి నొప్పు కొని తీర్చినతీర్మానము? మిమ్ముఁ బోలిన నిరపరాధియైన యుత్తముఁ డిట్లు పొడువఁబడి చనిపోయెనే? మీలో నొకరికైన నా దారుణకృత్య మొనరించినపాపిని గనుఁగొన శక్తి లేదు. మీరు భూతదయగల మహానుభావులా? మీ కందఱ కంత ప్రాణమిత్రుఁడుగా నుండినవాఁడు, మీతో నవ్వుచు నిన్నటివఱకు మాటలాడుచుండినవాఁడు, స్నేహ పాత్రుఁడు, సజ్జనుఁడు- అట్టి యరుళ్‌నాథుఁ డస్తమింప మీ కొకింత

మైనఁ గనికరములేక చక్కఁగ విచారింపక మీా రిట్లు వెడలుట న్యాయ్యమా? చంపిన పాపిని గనుఁగొనలేకయున్నారు. ఏల యీా విచారణ? అట్టి సుందరవిగ్రహుని, మదనమోహనుని, స్నేహపాత్రుని, ప్రాణమిత్రుని, విద్వాంసుని, సద్గుణసంపన్నుని నక్రమముగాఁ జంపిన మహాపాపి సముద్రములోఁ దాఁగుకొనిన నతనిఁబట్టి యీడ్చుకొని రాకయుందునా? హిమాలయపర్వతగుహలలోఁ దూరిన నతనిని విడిచెదనా? ఘోరకాంతారంబులఁ జొచ్చినను వెంబడింపకుందునా? అయ్యో! నేను మగవాఁడను గాకపోయితిని. ఇటువంటి ప్రభువులు, నధికారులు కూడి యరుళ్నాధున కగౌరవముఁ గావించిరిగదా?”

విచారణాధికారి, “అమ్మా! సాధ్యమైన మేమును విడిచెదమా? దుఃఖముచేత మీా రిట్లు చెప్పుచున్నారు” అనెను. కుంతలమ్మ కోపముతోఁ “సాధ్యము! అసాధ్యము! ఎవనికి మనోధైర్యము, పట్టుదల, వివేకము నుండునో యతని కన్నియు సాధ్యములే. అసాధ్యములు లేనేలేవు. నా ప్రాణనాధునిఁ జంపినవానిని నేఁ జంపక విడిచెదనా? దైవము మీాఁద నొట్టుపెట్టుకొని యీా సభవారిముందు నే శపథము చేయుచున్నాను. హా! నా మనోనాయకా! మనకు వివాహము కాకున్నను నీవు నా భర్తవు, నేను నీ భార్యను. ఇయ్యది ధర్మశాస్త్రసమ్మతము. మన కిరువురకును శరీరములు భిన్నములు. నిన్ను మోసముఁ జేసి నీ ప్రాణ మపహరించిన పాతకిని వెదకిపట్టి చంపక విడిచెదనా? అతఁ డెక్కడికి పరుగెత్తిపోయినను సరే నేను వెంబడించెదను. ఆకాశమున కెగిరినను, భూమిలోఁ బ్రవేశించినను, పాతాళంబును జొచ్చిన నతని వెన్నంటి ప్రాణములు తీయకుందునా? నా నాధునిఁ బరిభవించిన పరమపాతకినిఁ బరిమార్చెద నని ప్రతిజ్ఞఁ జేయుచున్నాను. ఇదియ నావ్రతము. దానినిఁ దప్ప తక్కిన నోముల నన్నిఁటిని వదలితిని. ఎల్ల బంధముల విడనాడితిని. ఎల్లసుఖంబులు త్యజించితిని. ఆశాపాశమును ద్రెంచితిని. దైవమే యిందులకు సాక్షి. నా ప్రతిజ్ఞ నెఱవేఱి తీరవలయు” నని కన్నులు మూసుకొని మొదలునఱికిన తరువువలె నేలంబడి మూర్ఛనొందెను. అమృతవల్లి తటాలున వచ్చి యామెను

బట్టుకొనెను. ఆ సాయంకాల మరుళ్నాథుని శవమునకు సంస్కారము గావింపఁబడియె.

మహాఖిన్నురాలైన కుంతలమ్మ మఱునాఁడు తన యాభరణములు, చీరలు, కంచుకములు మున్నగు వివిధవస్తువుల నందఱు చూచునటులఁ బాఱవేసి శోకకోపముల రూపముఁ దాల్చినట్లు తన గదిలోఁ బడియుండెను. "ఏమి పిచ్చి కుంతలమ్మకు? సూత్రము గట్టలేదే? అరుళ్నాథుఁడు పోయిననేమి? ఇంతటితో నీమెకు మగఁడైనాఁడా? అంతకన్న సుందరులు, విద్వాంసులు నెందఱో కలరే? ఎవనినైనఁ బెండిలి చేసికొనఁగూడదా? వన్నియజాతిలో వితంతూద్వాహములు కూడఁ గావించుకొనుచున్నారు. ఇది యేటి యన్యాయము." అని కొందఱును; "అయ్యో! పాపము! ఎట్టి సచ్చరిత! ఎట్టి గుణవతి! ఎట్టి విదుషీమణి! ఎట్టి జితేంద్రియురాలు! ఆహా! ఎట్టి పతివ్రత! తాను వరించినవాఁడు తన పతియే యని నిశ్చయించుకొనియె. ఇఁక వివాహ మేల? వర్ణముతోఁ బని యేమి? కాశీరాజు కూతురగు నంబ తిరిగి కుంతలమ్మగా నవతార మెత్తెను గాఁబోలు. వీరి బంధము లెన్ని జన్మము లెత్తినను విడనాడునది కాదు. బుద్ధుఁడు, నతని భార్యయు ననేకజన్మములలో సతీపతుల సంబంధము విడనాడక జన్మము లెత్తుచుండిరి. అట్టి వారినే లోకులు పూజించుచున్నారు. వారికే గౌరవము, యశస్సు, ప్రఖ్యాతి. కుంతలమ్మ చదివిన చదువు వ్యర్థము కాలేదు." అని కొందఱును జెప్పుకొనుచుండిరి. అమృతవల్లి యా రాత్రియంతయుఁ గుంతలమ్మను జూడలేదు. కుంతలమ్మయొక్క కోపము నమృతవల్లి చూచియుండిన నామెప్రాణము లెగిరిపోయియుండు నని యనేకులు తలంచుచుండిరి; గాని నిజము భగవంతునికిని నమృతవల్లికిఁ దప్ప మఱి యెవరికిఁ దెలియఁగలదు?

కుంతలమ్మకు రెండే వ్రతములు. మొదటిది: జన్మాంతబ్రహ్మచర్యము. అరుళ్నాథుని వరించిన కుంతల మింకొకపురుషునిఁ గన్నెత్తి చూచునా? వన్నియజాతి యైన నేమి? స్థైర్యమునకు జాతిమతము లడ్డములా? మానవజన్మమునకుఁ బశుపక్ష్యాదులకుఁ

గల భేద మేమి? యుక్తాయుక్తవివేకమే కదా! విదుషీమణి యగు కుంతలమ్మ త్రికరణశుద్ధిగ బ్రహ్మచర్య మవలంబించుట వింత గాదు. రెండవవ్రత మెద్దియన: నరుల్నాథునిఁ జంపినపాపి నెవ్విధముగ నైనఁ గనుఁగొని చంపుట. ఆమె బుద్ధి నంతయు దీనియందు వినియోగించుచుండెను.



# ఏడవప్రకరణము.

## ధర్మపాఠశాల.

కోయంబుత్తూరు చెఱసాలయందు రాధయు, నలమును విశేష కాలము లేరు. అచట నుండిన స్వల్పకాల మొకయుగముగ వారికిఁ దోఁచెను. అధికారియొక్క యుత్తరువుప్రకార మొక సేవకుఁడు వారిని మణియూరి కృష్ణయ్యర్ కడకుఁ దీసికొనిపోయి విడిచెను. వీరినిఁ జూడఁగనే యా యధికారి "చిన్నతల్లులారా! నేను మీయిద్దఱి నొక మంచిస్థలమునకుఁ బంప నుద్దేశించితిని" అనఁగ, "బంధనాల యమునకే కదా" అని భయముతో రాధ యడిగెను. అల మతి శయవిచారముతో నధికారినిఁ జూచుచు నిలుచుండెను. అధికారి, "లేదు, మిమ్ముఁ జెఱసాలకుఁ బంపను. మీరు మంచిబాలికలు. ఈ యూరిలో నదీతీరమున నన్నదాన మొదలియా రొక సత్రమును నిర్మించి దిక్కులేని పిల్లలకు నన్నవస్త్రము లిచ్చి చదువు చెప్పించు చున్నాఁడు. ఆ పాఠశాలాధికారిణిని నే నెఱుంగుదును. ఆమె కొక జాబు వ్రాసితిని. మిమ్ము నందుఁ జేర్చుకొనుట కామె సమ్మతించెను.

రాధ—అట్లయిన నచటికి నేను తప్పక వెళ్ళుదును.

అల— అక్కా! నన్ను వదలి యొంటరిగా వెళ్లుదువా?

రాధ—ఒంటరిగా నే నెన్నటికి వెళ్ళను. నిన్ను విడిచి నే నెక్కడి కమ్మా కదలుట!

అధికారి వీ రిరువురికిఁ గల యన్యోన్యస్నేహమునకు సంతో షించి "బాలిక లనిన నిట్టులుగదా యుండవలయు" నని భావించి యధికారి యగు నన్నమ్మకు మఱల నొక యుత్తరము వ్రాసి, బాలి కలతో "మీ రద్భుతమైన పిల్లలు. మీ కేలాటి కొఱంతయుఁ గలు గదు. పోయిరండు" అని బుద్ధిచెప్పి వారినిఁ బంపెను.

రక్షకభటుఁడు వారి నిద్దఱి నొక బండిలో నెక్కించుకొని యన్నదానశాలఁ జేరెను. అధికారిణి వీ రిద్దఱిని నాదరముతోఁ గాపాడునటుల నొప్పుకొనెను. ఆయాలయమునం దనాథబాలిక

లిరువదినలుగు రుండిరి. అన్నమ్మ ప్రేమతో వారినిఁ జూచుచుండి నను రాధ కాస్థలము రుచింపలేదు. "ఇది యేమి దరిద్రపాఠశాల! మంచిసహవాసమే లేదు. వారినిఁ జూడఁజాలను. ఇది యెక్కడి యవస్థ !" అని రాధ తలంచుచుండెను. అలము "అక్కా! ఇది మంచి స్థలముకాదు. దీనిని విడిచి వెళ్లుదము" అనెను. అన్నమ్మ వీరిద్దఱనక్కడి పిల్ల లందఱు పండుకొను పెద్దగదికిఁ బిలుచుకొనిపోయి "చదువు చాలించుఁడు. సాయంకాలమైనది. ఆడుకొనుఁడు. వీరిద్దఱిని మీతోఁ జేర్చుకొనుఁడు" అని చెప్పి వారి నక్కడ విడిచి వెళ్ళెను. ఆటలకై నాలుగువైపులను నీడనొసఁగువృక్షములును, మధ్యప్రదేశమున నిసుకయును, నొక విశాలస్థల ముండెను. అన్నమ్మ వీరిద్దఱ నక్కడ వదలి వెళ్ళినతరువాత పదునాలుగువర్షములవయస్సుగల యొక పిల్ల యలమును గట్టిగాఁ బట్టుకొని "ఎందు కిట్లేడ్చుచున్నావు" అని యడుగ, రాధ "ఛీ! నీవు నా చెల్లెలిని దాఁకకుము, నీపని నీవు చూచుకొనుము" అనెను. "అయ్యో! ఏడ్చుచున్నది గదా యా-యని-యా-యా-యా పిల్లను తాఁకితిని." అని నత్తితో నాపిల్ల చెప్పఁగ నెల్లఱు గొల్లున నవ్వసాగిరి. దానిం జూచి రాధ "నేను మీతో మాటలాడను" అనెను. వారిలో దుష్టస్వభావముగల యొకతె వెనుకగా వెళ్ళి రాధ కట్టుకొనియుండిన వస్త్రమును జించి "ఈ చినిగిపోయిన గుడ్డలుగల భాగ్యశాలిని మనతో మాటాడదట" అని వెక్కిరించుచు నలముపైఁ బడగ, నాబిడ్డ క్రిందఁబడి యేడ్వసాగెను. రాధ కమితమగు కోపము గలుగ తన సోదరికిం గలిగిన పరిభవమునకు మండిపడుచుండెను. రోషముతోఁ దనసోదరినిఁ గ్రిందబడఁద్రోసిన పిల్లచేతులను గట్టిగఁ బట్టుకొనఁగా "అయ్యో! నీజోలికిఁగాని, నీచెల్లెలిజోలికిఁగాని రాను, నన్ను విడువుము" అని యాపిల్ల యఱచెను. అన్నమ్మ యాధ్వని విని యక్కడికి వచ్చి యందఱను నిలువఁబెట్టి విచారణమును జేయఁదొడంగెను. రాధ యలములయెడ విశేషముగఁ దప్పులేనట్లు, తక్కినవారియెడలనే తప్పున్నటుల నన్నమ్మ కనిపెట్టి యాపిల్లల నిద్దఱిని తనగదికిఁ దోడ్కొనిపోయి, వారిని శాంతింపఁజేసి క్రొత్తపిల్లలకు నిచ్చెదు తెలఁగున నూతనవస్త్రములను వారికి నిచ్చెను. రాధ తన కిచ్చిన వస్త్రము

లను గట్టుకొని చెల్లెలికిఁ గట్టి మాసినగుడ్డలను విప్పి యావల నునిచి సంతోషముగా నుండెను. బాలికల నడవడి యన్నమ్మ కమితమైన యానందమును గలిగించుచుండెను. ఆమె రాధయొక్క సన్నమైన కుంతలములను, బెడఁగుకన్నులను జూచిచూచి "ఆహా! ఇది దేవకన్యయై యుండ నోపు. దారిద్ర్యమువలన నీ దుర్దశకు వచ్చినది" అని మనస్సులోఁ దలఁచి "కుమారీలారా! మీ రిటకు వచ్చుటచే నేను ధన్యనైతిని. రేపిద్దఱు శ్రీమతులు మన పాఠశాలను జూడ వచ్చెదరఁట. మీ రిద్దఱుమాత్రమే వారు చూచుట కర్హులు. కనక యిట్టి మంచి పిల్లలఁ జూచిన మిక్కిలి సంతోషపడుదురు. ధన్యురాలయి నన్నే. మీ రిరువురు భాగ్యశాలినులు. కోటీశ్వరుల భార్యలు. వారికిఁ జూచుటకు మంచి పిల్లలు లేకపోయినఁ బాఠశాల బాగుగ లేదని వ్రాయుదురు. అందగత్తెలును, సుగుణవతులును నగు మిమ్ము నిద్దఱను జూచిన నా పాఠశాల బాగుగ నున్నదని వచింతురు. ఇంతియకాక పరీక్షాధికారులకును వ్రాయుదురు. దీనిం గట్టించిన యన్నదాన మొదలియారుగారు యూరిలో నెవ్వరు విద్యావతులో, యెవ్వరు ధనవతులో, యట్టివా రిద్దఱిద్దఱి చొప్పున రెండు మూఁడు పర్యాయములు మా పాఠశాలకు వచ్చి యే స్థితియం దున్నదో విచారించి వారికిఁ దెల్పుచుండునట్లు యేర్పాటు గావించిరి. ఆ నియమానుసారముగ నా యిద్దఱును రేపు వచ్చెదరు. దైవాధీనముగ మీ రిద్దఱును సమయమునకు వచ్చి చేరినారు." అని చెప్పి వారిని దనతోఁ గూర్చుండఁ బెట్టుకొని కడుపునిండ నన్నముఁ బెట్టించి తనతో వారిని బండుకొనఁ బెట్టుకొనెను. ఏనాఁడును మంచిమాట యెఱుంగని యీ యనాథబాలిక లన్నమ్మ యాదరణవలనఁ దృప్తిగ భుజించి నిద్రించిరి.

మఱునాఁడు శనివారము కావున వేకువజామున లేచి యన్నమ్మ పిల్లల కండఱకును దలయంట్లుపోయించి, కాటుక, బొట్టు వెట్టించి, శుభ్ర వస్త్రములు ధరింపఁజేసి, పాఠశాలలోఁ గూర్చుండఁబెట్టి, యెప్పు డాసతీ తిలకంబులు వచ్చెదరో యని యెదురుచూచుచుండెను. ఏబండి వచ్చి

నను వారిదేయని తలంచుచుండెను. రాధయు, నలమును బాఠశాలఁ జేరినది మొదలు కొంచెము మనస్సున కూరటగలిగి యాపాఠశాలను గుఱించి మంచియభిప్రాయమును వచ్చువార లిచ్చెద రని యన్నమ్మ నమ్మియుండెను. క్రొత్తవారు రాఁగానే యాసమయమున నొకబాలిక రాధతో "కాశీపట్టుచీర గట్టి, తలమొదలు కాలువఱకు నమూల్యాలంకారములను ధరించి, రమారమి యేబదియేండ్ల వయస్సు స్థూలకాయము గలిగిన వనిత కనకవల్లి"యని చెప్పెను. ఆమెతోఁగూడ వచ్చిన శ్రీమతి సాధారణమైన పట్టుచీరను గట్టుకొని భగవంతుఁ డిచ్చిన స్వభావ సౌందర్యముదప్ప నగలు విశేషముగ ధరింపక మందహాససుందర వదనారవిందముతోఁ బొడుగైన సన్ననిశరీరముతోఁ దొలకరి మెఱుపువలెఁ బ్రకాశించుచుండు నామెయే ధనకోటి. ఆమెకు నలువది వర్షము లుండును" అని మఱియొక బాలిక చెప్పెను.

ఈ యిరువురు నా పాఠశాలఁ బ్రవేశించి యొక్కొక బాలికను బరీక్షించి చూచిరి. విశేష భాగ్యవతు లగుటచే గర్వోన్నతలుగా వారు కన్పడిరి. పిల్ల లందరును బీదవారుగాన వికార స్వరూపములతోఁ జిక్కిన దేహములతో, జీవముతో నున్నారా? యని తోఁచునటు లుండిరి. కనకవల్లికి వయస్సు గడచినను భాగ్య మెక్కువగా నుండినను లోభి. భగవంతుఁ డామెకు సంతాన మీయలేదు.

అన్నమ్మను జూచి "ఏమి! ఇట్లు పిల్లలు చూడరాని ఘోర దశలో నున్నారు." అనఁగ ధనకోటి విని 'అక్కా అట్లనకుము. పిల్లలు దీనిని వినిన విచారపడుదురు' అనెను. అన్నమ్మ భయముఁ జెందెను. కనకవల్లి "వారికి మనము మాటలాడిన పలుకు లర్థము కావు" అని యొకవైపు తిరిగి రాధను జూచి "ఆహా! అదిగదా పిల్ల. ఏమి దాని సౌందర్యము! అట్లుండ బుండినఁగదా యన్నదాన మొదలి యారుసకుఁ బేరువచ్చును" అని యన్నమ్మను గాంచి "ఆపిల్ల యెవరు? దీని నెక్కడినుండి తెచ్చితిరి?" అని యడిగెను. 'నిన్నటి యుదయమున మణియూరు కృష్ణయ్యర్‌గారు పంపిరి' అని యన్నమ్మ బదులు చెప్పి 'సుందరీ! ఇక్కడకు వచ్చి మీాయవ్వ కొకముద్దిమ్మ' అనెను.

తక్కిన పిల్ల లంద అసూయతోఁ దనను జూచుచుండ రాధ కనకవల్లి దగ్గఱకుఁ బోయెను. పాఠశాలాబాలికలలో నొకతె "అయ్యో! నేను రాధగాఁ బుట్టియుండఁగూడదా?" యనెను. ఇం కొకతె "ఆమెనగలు, చీర, రవిక, ఆహా! ఎట్లు ప్రకాశించుచున్నవి!" అనెను. అన్నమ్మయు నా శ్రీమతు లిద్దఱును బిల్లలనుగుఱించి యేమేమి యో సంభాషించుకొనుచుండిరి. తరువాత నన్నమ్మ రాధదగ్గఱకు వచ్చి "కుమారీ! శీఘ్రముగా రమ్మ, నీకు మంచికాలము వచ్చి నది." అని చెప్పి దానిం దోడ్కొనిపోయి కనకవల్లి సముఖమున నిలువఁ బెట్టెను. కనకవల్లికి సంతానప్రాప్తి లేనందున నొక సుం దరమైన పిల్లను బెంచుకొనఁదలఁచి మంచిపిల్లలు లభింపకపోవుటచే వగచుచుండెను. ఈ దినము రాధను జూచి, 'ఇదియే సరియైన పిల్ల. దీనినిఁ బెంచుకొనవలయు' నని నిశ్చయించుకొనెను. ఇంతియ కాక రాధను స్వగృహమునకుఁ బిలుచుకొనిపోయి మంచినగలు, వస్త్రము లిచ్చి చక్కఁగా నలంకరించి తనప్రక్కనఁ గూర్చుండఁబెట్టు కొని యానందింపవలయు నని కనకవల్లి తన మనంబున నూహించు కొనుచుండెను. ఇంతలో రాధను జూచి "సుందరీ! నీవు నాకూఁతురుగ నుండుట కంగీకరించెదవా!" అన, రాధ "మీఁ కుమారిని నేను గానే" యనెను. కనకవల్లి "నిన్ను నాకుమారితగా నొనరించెదను. నీవు నా సౌధమునందు వసించిన, నీ యిష్టానుసార మన్నియును ననుభవింప నగును. నీకు వలయునంత ధన మిచ్చెదను" అనెను. రాధ కొంచె మాలోచించి "తల్లీ! అట్లే యొనరించెదను గాని నాచెల్లెలు..." అని రాధ చెప్పి ముగించుటకు మునుపే కనకవల్లి "కాని, పోని, అను పిల్ల లు నాకు సరిపడరు. రాధా! నీవు నాతో వచ్చెదవా? రావా? అని ప్రశ్నించెను. "అలముకూడ నాతో వచ్చుటకు మీరు సమ్మతించిన మే మిద్దఱము మీతో నేతెంచుట కభ్యంతర మేమియు లేదు" అని రాధ చెప్పెను.

కనకవల్లి—నేను అలమును బిలుచుకొనిపోను.

రాధ "నేను మీతో రాను" అని చెప్పఁ గనకవల్లి యన్న మ్మను జూచి "ఈ బిడ్డకు బుద్ధిలేన ట్లున్నది. తనకు నప్రియత్న

ముగా ఘటిల్లు భాగ్యము నవివేకమువలనఁ బోఁగొట్టుకొనుచున్నది. నీవు చెప్పి యొప్పింపుము" అనెను. అన్నమ్మ "నే నెంత చెప్పిన నాబాలిక వినదు. దానికి చెల్లెలిపిచ్చి యధికముగా నున్నది. చెల్లె లన్న తనప్రాణముతో సమానము. ఎవరు చెప్పినను తనసోదరిని త్యజించి రాదు." అని ప్రత్యుత్తర మిచ్చెను. "దానిని సామాను బండిలో వైచి బలవంతముగాఁ దీసికొని పోయిననో" యని కనకవల్లి పలుకఁగ రాధ యలక్ష్యభావముతో "నేను వచ్చినఁగదా మీరు గొంపోవుట. ఇది యేమి! ఇంతబలాత్కారమా! నే నేమి నేరము సలుపలేదే! నాకు నాచెల్లెలితోనుండుటయే స్వర్గము. అలమే నాకు సకలసంపదలు. అదియే నాప్రాణము. దాని నెప్పుడు నే నెడఁబాసియుండఁజాలను" అనెను.

రాధ యీవిధంబుగఁ బలుకుచుండఁ గనకవల్లికి నెట్లైన రాధను బిలుచుకొనిపోయి స్వీకారము చేసికొనవలయు నని యుండి "నాయనుంగుగుమారీ! నేఁ జెప్పెద వినుము. నీకు బొమ్మ లిచ్చెదను. కావలసినసొమ్ము లిచ్చెదను, చీర లిచ్చెదను, చదువు చెప్పించెదను; నాభాగ్యము సర్వమును నీదేయగును గదా. అంతయు నీస్వాధీనము చేయుదును. నీయిష్టముచొప్పున నుండవచ్చును." అని బుజ్జగించెను. కాని యది యంతయు, బూడిదలోఁ బోసిన నేతిచంద మయ్యె. రాధ కొంత సేపటికి "నీబొమ్మలు, సొమ్ములు, గురుగులు నెవరికిఁ గావలయు? నాకు నలమే పెద్దబొమ్మ, దివ్యమైన యలంకారము, అందమైన లక్కపిడుత. దానిని వదలి యదుగైన నవలఁబెట్టను. మీసొమ్ము మీదగ్గఱనే యుంచుకొనుఁడు. నా కాభాగ్యమేల? అల మనునది యుండఁగా మీడబ్బు నా కేల?" అని రాధ పలికెను. "బీదపిల్ల, తల్లిదండ్రులు లేనిది, ధనమన్న నెఱుఁగనిది, దాని కంత గర్వమా? తా ననుభవించుచుండిన స్వర్గలోకభోగములఁ దలఁచికాఁబోలు నాభాగ్యము వలదనుచున్నది. దౌర్భాగ్యురాలు" అని గొణుఁగుకొనుచుఁ గనకవల్లి స్వగృహమునకుఁ బయనమయ్యెను.

ఆమె వెళ్ళఁగానే యన్నమ్మ రాధను జూచి "అయ్యో! నీ కష్టము నిన్ను విడువకున్నది. ఒక నిమిషమునకు ముందు కుబేర

పదవిని బొందఁదగిన స్థితియం దుంటివి. అది వలదని పలికి యీ ధర్మపాఠశాలలో గంజి కుడిచి బ్రదుకుట చాలునంటివే దురదృష్టురాలా?" అనఁగ రాధ "ఆ భాగ్యశాలిని యెప్పుడైతే నా చెల్లెలు నాతో నుంట కంగీకరింపలేదో యప్పుడే యీమె మంచిది కాదని తెల్లమయ్యె. ఆమెను జూడ నా కిష్టములేదు. నగలుగల కోతి." అని పలికెను. దాని విని "చిన్నదానా! ఇంత ధైర్యము నీ కెక్కడనుండి వచ్చినది? అయ్యో! మూఁడు దినము లుప్పులేకుండ నీకు గంజిఁ బోయు మని కనకవల్లి యాజ్ఞాపించె"నని యన్నమ్మ తెలియంబల్కఁగ రాధ "సంతోషమే! ఉప్పేకాదు, పప్పు, నెయ్యి, పులుసు, కారము లేకుండఁజేసి నా చెల్లెలితో మాత్రము కలిసి యుండనిచ్చినఁ జాలు. ఆ ముసలిదానిచెంతకు మాత్రము నన్నుఁ బంపకుండిన మేలు." అనెను. అన్నమ్మ "ని న్నేమిచేయుటకు నాకుఁ దోఁపలేదు. చిత్రమైన పిల్లవు. ధనమును, వస్త్రములను జూపి నిన్నుఁ బెంచుకోనఁ దలఁచిన ధనికురాలు నీ కిష్టము లేకపోయె. ఆమెను దూషించుచున్నావు. ఉప్పులేని గంజి యనిన పప్పు, పులుసు మొదలైనవి లేకున్నను మఱింత సంతోష మనుచున్నావే. ఇఁక నెట్లు" అనెను.

రాధ నక్కడ నిందింపనివారు లేరు. కొంద ఱామెకుఁ బిచ్చి పట్టిన దనిరి. కొంద రదృష్టము లేదనిరి. మఱికొందఱు దుర్మార్గురాలని ఖండింపఁజొచ్చిరి. ఏమయినను రాధమాత్రము పట్టినపట్టు విడువకుండెను. సర్వేశ్వరుని మాయ! ఇంతకన్న నెవ రేమి చెప్పఁగలరు? కనకవల్లితోఁ గూడ ధనకోటి వచ్చినదని చెప్పియుంటిమిగదా? ఆమె యుత్తమసాధ్వి, శాంతస్వాంతముగల సతీమణి. కనకవల్లికిని రాధకును జరిగిన సంభాషణమును సాంతముగా వినినది మొదలు రాధ యొక్క యూర్జితస్వభావమునకు, నుత్తమగుణమునకు, సోదరీప్రేమకు, నభిమానమునకును ధనకోటి మిగుల సంతసించుచుండెను. "ఏమిదయ! ఎట్టి ప్రవర్తనము! నిజముగా వీరు గొప్ప యింటఁ బుట్టినవారలే. కష్టకాలము! ఊరు పేరు తెలియక యీపిల్ల లనాథలవలె ధర్మపాఠశాలలోఁ జిక్కుకొనియున్నారు. నేను వీరికిఁ దప్పక యుపకారము చేయవలయును, తప్పకూడదు. మంచిపిల్లలు, ముద్దులుగులుకు చు

న్నారు, తెలివిగలవారని యనుకొనుచు ధనకోటి తన యింటికిఁ బోయెను. ఈమె జమిాందారుని భార్య. పతిభక్తిగలది. పతికి నీమెయం దనురక్తి కలదు. వీరిద్దఱదాంపత్యమే దాంపత్యము. నువ్వులునూనెవలె, నస్థిచర్మములవలె నొకరి నొకరు విడువక ప్రేమతోఁ గలిసిమెలసి యుండెడివారు. ధనకోటికి నగలమిాద యాశలేదు. విదుషీమణి. విద్యకై యెంతధనమైన వ్యయము చేయవలయునని కోరిక. అనేకపర్యాయములు భర్త నగలు కొనుటకు ధన మిచ్చుచుండెను. కాని ధనకోటి దానిని నిరాకరించుచుండెను. అది సద్వ్యయము కాదని యామె యభిప్రాయము. నగలకై విస్తారముగ విత్తమును వెచ్చించుట నిష్ప్రయోజనమని యామె తలంచుచుండెను. ఆ దినము పాఠశాలఁ జూచి యింటికి వచ్చినతరువాత భోజనము చేసికొని ధనకోటి తనభర్తయొద్దకుఁ జిరునగవొప్పు మొగముతో నేతెంచెను. జమిాందారున కెప్పు డామెను జూచినను బరమసంతోషము. వ్యర్థాలాపములకుఁ జొచ్చెడు వనిత కాదు. మేడమిాఁదికిఁ బోయి భర్తదగ్గర నిలిచి తములపాకులకు నీనెలను దీసి సున్నము రాచి చుట్టలుచుట్టి కప్పురఁపు విడియము సమకూర్చి భర్త కందిచ్చి యక్కడ నుండిన యాసనముపైఁ గూర్చుండఁగ నా జమిాందారుఁడు "ఏమివిశేషములు ? పాఠశాలకు వెళ్లితివే, చక్కగా జరుగుచున్నదా" అని యడిగెను.

ధనకోటి—కడచిన శనివారము వజ్రములు చెక్కిన యొడ్డాణమునకై యిరువదియైదువేల రూప్యము లిచ్చెదనంటిరే ? జ్ఞాపకమునందున్నదా ?

జమిాందారుడు—ఆ ! ఉన్నది. నే నెంత చెప్పినను వలదని నిరాకరించితివికదా ! తిరిగి యాశపడుదువేమో యని భద్రముగా నుంచితిని. నీకు నగలయం దాశయే లేదు. నీకుఁ గావలయునన్ని యాభరణము లియ్యవలయునని నా కున్నది. నేఁ జెప్పినటుల వినరాదా ?" అని బతిమాలుకొనినటుల పలికెను.

ధన—ఒక చిన్న విన్నపము. ఇప్పుడు నాకుఁ గావలసినది యాధనముగాని యాభరణము గాదు. నిజముగా నగలయం

దత్త్యాశ నాకు లేదు. సత్యము. ఇతరవిధములైన సంపదలు లేనివారికి నగలైన నుండవలయునని జనులు సామాన్యముగా స్త్రీల కలంకారములను బెట్టుదురు. అలంకారార్థమే కదా నగలను ధరించుట. శరీరారోగ్యమునకుఁ గూడ హేమమణి భూషణంబులు తోడ్పడునని శాస్త్రవేత్తలు వచించుచున్నారు. దానివలననే కొన్ని యాభరణములు ధరించితిని. నడుము నకు చీరమీఁద నంత వెలగల భూషణ మనావశ్యకము. ఆ ధనము నిచ్చిన సద్వినియోగము చేయుదును.

జమీం—నీ కా ధన మెందులకు? ఆ సద్వినియోగ మెట్టిది? కొంచెము తెలియఁబల్కుము.

ధన—(రాధ, యలముల విషయము చెప్పి) ఆ పిల్లలు మహావంశ సముద్భూతలు. గ్రహచారవశమున నిట్లున్నారు. మంచి వివేకవతులు. విద్యావ్యాసంగమునం దాసక్తి యధికము. వారిని జదివింపవలయునని నాకుఁ గోరిక. ఆ రూప్యముల నా పిల్లల విద్యాభ్యాసమునకై వినియోగపఱచెదను.

జమీం—రాధ యంత మంచిపిల్లయా? మంచి యాలోచనచేసితివి. దివ్యమైన పని. అన్ని దానములలోను విద్యాదానము ప్రశస్తము కదా? నీ వాంఛయుఁ బ్రశంసనీయము. ఈ క్షణముననే యా ధనము నీ స్వాధీనముచేయుచున్నాను. నీ యిష్టము. వారికేమి యేర్పాటులు కావింతువో!

ధన—వజ్రములు చెక్కిన యొడ్డాణమును బెట్టుకొనుటకు బదు లిద్దరనాథబాలికల నా ధర్మపాఠశాలనుండి విడిపించి యీ కోయంబుత్తూరులోఁ గ్రొత్తగా నిర్మింపఁబడిన సర్వకళాశాలలోఁ బ్రవేశపెట్టి చదివించిన నా పిల్లలు కృతార్థ లగుదురు. ఈ ధనమువలన వచ్చెడి వడ్డీని వీరిద్దఱ విద్యాభ్యాసమునకు నుపయోగించుట ధర్మము కాదా? నే నెన్ని యొడ్డాణములఁ బెట్టుకొనిన నేమి లాభము? పురుషార్థములలో మొదటిది ధర్మముకదా?

ఆ మాటలను విని జమీందారుఁ డానందసముద్రములో మునిఁగి "ఇట్టి యుత్తమసాధ్వి నాకు భార్య యగుట నా భాగ్యము. నా కేమి కొఱఁత?" అని యా క్షణమే రూపాయలను బంపి యా పిల్లల పేరు పెట్టి, వారు సర్వకళాశాలలోఁ బ్రవేశించుటకు వసతు లొనరించెను. ధనకోటి యొక కార్య మారంభించినపుడు మధ్య విడిచిపెట్టదు. ఉత్తముల స్వభావ మట్టిదియేకదా? ధనము పిల్లల పేరఁ బెట్టఁగనే ధర్మశాలకుఁ బోయి యా బిడ్డలను దయతోఁ దన బండిలో నెక్కించుకొని కళాశాలను జేరి ప్రధానోపాధ్యాయ యగు హైమవతిని గాంచి యామెతో సంభాషించి రాధను, నలమును నామెవశముచేసి మిక్కిలి దయతో వారినిఁ జూచునట్లు చెప్పి, వలయు నేర్పాటులను గ్రమముగా నొనరించి, తన సదనమునకు మరలెను.

పిల్లల యదృష్టము తిరిగినది. కష్టము లా దినముతోఁ దీరినవని చెప్పనొప్పును. నేఁటికి వారికిఁ గడుపారఁ దిండియు, మనసార విద్యయు, మేనునిండ వస్త్రమును, స్వేచ్ఛయుఁ గలుగ వారి యుల్లములు పల్ల వించె. ఈశ్వరేచ్ఛ కడ్డు కలదా! ఆతఁడు జగన్నాటకసూత్రధారుఁడు కదా!



# ఎనిమిదవప్రకరణము.

## కోయంబుత్తూరుకళాశాల.

కోయంబుత్తూరు కళాశాల ధనవంతులు, ప్రభువులు, జమీందారులు మొదలగు గొప్పవారి పిల్లలు చదువుకొనుట కేర్పాటు గావింపఁబడిన యుత్తమ పాఠశాల. ఇందు నాన్వీక్షుకి (తగ్గు వేదాంతములఁ దెలుపువిద్య), త్రయి (ధర్మార్థకామముల బోధించు శాస్త్రము, వార్త (అర్థానర్థములఁ దెలుపువిద్య), దండనీతి (నయానయముల బోధించువిద్య), నీతిశాస్త్రము, నర్థశాస్త్రము, నాయుర్వేదము మొదలగు విద్యలు బోధింపఁబడును. స్త్రీలకు మాత్రే మా కళాశాల నిర్మింపఁబడియె. విద్యార్థిను లక్కడనే నివసించుచుండిరి. వారికి భోజన వసతు లచటఁ గలవు. పండుగలకుఁ బర్వములకు వారి వారి గృహములకుఁ బోవచ్చును. పట్టపరీక్షలయం దారితేరినవారే (బి. యే. పరీక్షయయినవారే) యచట నుపాధ్యాయులు. కొన్ని శాస్త్రములు బోధించుటకుమాత్రము కొందఱు పురుషులు నియమితకాలములో వచ్చుచుండిరి. ఆయావర్ణములవారికి గదులు వేఱు వేఱుగా నున్నవి. భోజనశాలలు వేఱు. వంటయిండ్లు వేఱు. అన్ని సౌకర్యములు కలవు. ఇందు వయస్సువచ్చిన యాఁడుపిల్లలుకూడ చదువుకొనుచుండిరి. కట్టుదిట్టములు బాగుగ నుండెను. స్వగృహములకన్న నా కళాశాలయే వారికి నధికగౌరవమును సంపాదించుచుండెను. నియమములు ప్రశంసార్హములుగ నుండెను. మానినులకు వలయు నిర్బంధములు వారి శ్రేయస్సుకొఱకు నియమింపఁబడియుండెను. హైమవతి యను వనితారత్న మా కళాశాలకు నధికారిణి. ఈ కళాశాలోపాధ్యాయలాజన్మబ్రహ్మచర్యవ్రతమును బూనినవారు, త్రికరణశుద్ధి కలవారు, వివిధశాస్త్రములందుఁ బ్రావీణ్యము కలవారు.

ఇంతవఱకు సత్సహవాసము నెఱుంగని యా పసిబాలిక లిరువురును ధనకోటికరుణాప్రభావంబున సర్వకళాశాలఁ జేరినది మొదలు వారి యదృష్టము తిరిగెను. బుద్ధి తెలిసినదిమొదలు నన్నియుఁ గష్టములే. నల్లప్ప కరుణచేఁ గొంతకాలము సుఖపడిరి. చిఱుత

తనంబునఁ జీఁకటిలో నొంటరిగాఁ దిరిగి, యగ్నిభయము నొంది, చోరులసహవాసము చేసి, నేరస్థ లని న్యాయస్థానమున విచారింపఁబడి పడ రాని పాట్లొక్కకొంతయులేక యన్నియు ననుభవించిరిగదా! ఈ కళాశాలను జేరినద్దాదిగ సకలకష్టములు సమసిపోయె. కళాశాల యం దాఁజేడుసంవత్సరము లతిశ్రద్ధతో, విద్యాభ్యాసము వా రిరు వురుఁ గావించిరి. అతిసూక్ష్మబుద్ధి కలవారు. వీరిని స్తుతింపని వా రొక్కరును గానరాకుండిరి. ప్రతితరగతిలోఁ బ్రఖ్యాతిం జెంది యం దఱకు నణఁకువతో మెలఁగి వారియుల్లంబులు పల్లవింపఁజేసి యుత్తమ గుణభూషణలై శుక్లపక్షసుధాంశునిభంగి దినదినప్రవర్ధమానలై విరాజిల్లుచుండిరి. అప్పుడప్పుడు ధనకోటి వీరిక్షేమాభివృద్ధుల నరయు చుండెను. ధనకోటికిని హైమవతికిని దప్ప వీరివృత్తాంత మేరికినిఁ దెలియకుండెను. హైమవతికి వీరి యెడ ననురాగము మెండు. కష్ట దశలో నుండినవారినిఁ దరింపఁజేసి యిట్టి యుత్తమస్థితికిం దెచ్చిన ధనకోటిని రాధయు, నలమును దైవమువలెఁ జూచుచుండిరి. వారి భక్తి, విశ్వాసము, కృతజ్ఞత వేనోళ్ళఁ బొగడఁబడుచుండెను.

కళాశాలయందలి బాలికలకు వీణ నభ్యసింపఁజేయు వైణికుఁ డొకఁడు కలఁడు. రాధ సాహిత్యమం దెంత ప్రవీణురాలో, సంగీతము నందును నంత సామర్థ్యము కలది. వైణికుఁడు సభాపతి మొదలి విద్వాంసుఁడు. జంబూద్వీపములో నతని మించిన సంగీత శాస్త్ర జ్ఞులు లేకుండిరి. సద్గుణసంపన్నుఁడు. పరస్త్రీని కన్నెత్తిచూచువాఁడు కాఁడు. ఎట్టి విద్వాంసులకైనను గుణముకదా ప్రధానము. ఇంద్రియ నిగ్రహవిహీనమైన విద్య పారమార్థికప్రయోజనమును సమకూ ర్పదు. జితేంద్రియత్వమే యార్యుల యౌన్నత్యమునకుఁ గారణము. ఈవైణికుఁడు జితేంద్రియుఁడు, నీతికోవిదుఁడు, యోగ్యుఁడు. ఈకార ణముననే యాకళాశాలలో నీమహనీయుఁ డుపాధ్యాయుఁడుగ నియ మింపఁబడియె. వీణను నేర్చుకొనునపు డందఱు బాలికలును గలిసి నేర్చుకొందురు.

హైమవతి యొకనాఁటిరాత్రి రాధయున్న స్థలమునకు రాఁగా నామె శంకరాభరణమురాగము బహుసారస్యముగ సాధనఁజేయు

చుండెను. హైమవతి చూచి "ఇటులఁ జదివినఁగదా! పేరు వచ్చును" అని యామెను మెచ్చుకొని 'చాలునమ్మా, ఇంక. పండుకొనుము' అని చెప్పివెళ్ళెను. రాధయుఁ దాఁ జదువుచుండిన పొత్తమును మూసి భద్రపఱచి నిద్రపోయెను. రాధయనిన నందఱకు గౌరవము కలిగెను. ఆమె బుద్ధిశాలిని, చాల గొప్పది. ఆమెయెడల నయభయములతో నడుచుకొనవలయును' అని పిల్ల లనుకొనుచుండిరి. అందఱు నీమె స్నేహమును గోరుచుండిరి.



# తొమ్మిదవ ప్రకరణము.

## రాధా బాలలతల స్నేహము.

ఒకనాఁడు తాయి యను నొకదాసి రాధకడకు వచ్చి "అమ్మా! మీ రొక క్షణ మామెతో మాటలాడిన నామెబుద్ధి మారును. మీ కంటె బుద్ధిశాలినురీ కళాశాలలో లేరు. మీరు వెంటనే బయలుదేరి యా బాలలతయొద్దకుఁ బోవునటుల హైమవతి యానతిచ్చెను" అనెను.

రాధ "నా కీసంగతి యిదివఱకే తెలియును. బాలలత భాగ్యవంతుల బాలిక. ఈ కళాశాలలోఁ జదువుటకై వచ్చినదఁట. ఆమె యింతవఱ కెన్నఁడును గృహము వదలి యుండమిచే నీ క్షణమే తిరిగి యూరికిఁ బోవలయు. కళాశాలయును వలదు. చదువును వల దను చున్నదఁట! ఆమె యేగదిలో నున్నది?" అని యడిగెను. తాయి "రెండవయంతస్తు మేడమీఁద పెద్దగదిలో నున్నది. ఎవరు పోయినను మాటలాడదు. ఊరాచ్చికోటలో నన్నుఁ గొంపోయి విడువుఁ డని పలుకుచుండును." అని బదులు చెప్పెను. రాధ "ఆలాగా! అయితే నేను బోయి యామెను జూచెదను." అని బయలుదేరెను.

రాధ కిప్పుడు పదునెనిమిదేండ్లు. ఆమెయొక్క సౌందర్య మమేయము. శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణము, ఊహము, అర్థవిజ్ఞానము, తత్త్వజ్ఞానము నామెయందుఁ బూర్ణమయ్యెను. ఉత్తమ లక్షణములు, నల్లని కలువలం బోలిన కన్నులు, మరుని విండ్లను బోలిన భ్రూలతలు, మేఘములం బోలిన కుంతలములు, నమృతాంశునిఁ బోలిన యాననము, బింబఫలముం బోలిన యధరము, దాడిమీ బీజములం బోలిన దంతములు, దర్పణములం బోలిన కపోలములు, జంబీరఫలముం బోలిన శరీరకాంతి కలిగి రాధ గొనములప్రోగై భాసిల్లుచుండెను. శాంతము, గాంభీర్యము, ప్రసన్నత యామె ముఖంబున నభివ్యక్త మగుచుండెను. "యత్రాకృతి స్తత్ర గుణాః" అన్నమాట వ్యర్థమా? సురలోకసుందరులఁ బోలిన రాధ

యేమో పాడుకొనుచు బాలలత యున్నగదికిఁ బోయెను. బాలలత యా గదిలో నొకమూలఁ బండుకొని, "ఊరాచ్చికోట, ఊరాచ్చికోట" యని గొణుఁగుకొనుచుండెను. ఆమెకు వయస్సు పండ్రెండు సంవత్సరము లుండును. మెఱుపుతీఁగవంటి మేనికాంతి. సౌందర్యవతి, ధనవంతులపిల్ల. రాధ యాగదిఁ బ్రవేశించి బాలలత నిదివఱకుఁ జూచి యుండకపోయినను, విశేషాభిమానముతో నామెపడకమీఁదఁ గూర్చొని యామెతలమీఁదఁ దనచెయ్యి పెట్టి చూడఁగనే "ఎవరు? నీ విక్కడ నుండి వెళ్ళిపొమ్ము. నీతో మాటలాడుటకు నా కిష్టములేదు. మీ రెవ్వరు నా కక్కఱ లేదు. మీ కళాశాలయు వలదు. నే నిక్కడ నుండఁజాలను" అనెను.

రాధ—"నీవే యందఱకన్న నెక్కువఁ జదువఁగలవు. ఇక్కడనే యుండెదవు. ఇల్లు విడిచి వెలుపలికి వెడలనివారికిఁ బ్రథమమున నిట్లే యుండును. రెండుదినములు గడచిన నంతయు సమసిపోవును. ఇట్టివారలే యభివృద్ధిఁ గాంచెదరు."

అని బోధించుచు బాలలతను లేవఁదీసి తనతొడమీఁదఁ బరుండఁబెట్టుకొనెను. బాలలత, "నన్ను విడువుము." అని ధిక్కరింపఁగ రాధపట్టు గట్టిదగుటచే బాలలత విడిపించుకొనలేకపోయెను. బాలలతనేత్రములవెంబడి బాష్పములు స్రవింపఁదొడంగెను. రాధవంక నట్టె చూచి బాలలత "నీవు నీకళాశాలకు వచ్చినప్పుడు నావలె నేడ్చితివా?" యన, రాధ "దాని నడుగవలయునా? అందఱు నట్లే రెండునాళ్లలవాటుపడిన నూరికిఁ బోదము రమ్మనినను బోనొల్లరు. నీ విక్కడ నుంటివా పిల్ల లందఱు నీయెడ విశ్వాసముగా నుందురు. అంతయు నీకుఁ గ్రమముగఁ దెలియును."అనెను.

బాలలత—నీపే రేమి? ఎన్నాళ్ళనుండి యిక్కడ నున్నావు

రాధ—నాపేరు రాధ. నేను వచ్చి తొమ్మిదివర్షము లయ్యెను.

బాలలత—(దానిని విని యాశ్చర్యపడి) "నీకుఁ దల్లిలేదా?"

రాధ—లేదు. చెల్లెలుమాత్ర మున్నది. అదికూడ నిక్కడనే నాతోఁ జదువుచున్నది.

బాలలత—(నిష్కపటబుద్ధితో) నీవు చాల నందముగ నున్నావు.

రాధ—సరిలే! నీవు పండుకొనుము. నీతలనొప్పి కొక మందు రాచెదను. ఇంతసేపు నీవు పడినదుఃఖమునకు నీతల వేఁడిగా నున్నది. ఈ వేఁడిని నది యణఁచును.

అని రాధ యనుచుండ బాలలత పసిబాలికవలె రాధతో "నేను బండుకొనను. మిమ్ముల నానుకొని కూర్చొని కన్నుల మూసికొందును. నాకు నిద్రవచ్చిన నన్నుఁ బరుండఁబెట్టి మీరును నాప్రక్కనఁ బండుకొనుఁడు. నన్నొంటరిగా విడిచి పోవలదు." అని బతిమాలుకొనెను.

ఇట్లు చెప్పి కన్నులు మూసికొని బాలలత నిద్రపోయెను. హైమవతి యడుగులో నడుగువెట్టుకొనుచు వచ్చి యాగదిచేరెను. బాలలత కళాశాలకు వచ్చినదిమొదలు లింతవఱకు నిద్రపోలేదు. ఆమె రాధయొడిలోఁ బండుకొని నిద్రం జెందినసంగతిని విని హైమవతి సంతోషముం జెంది దానిం జూచుటకు నక్కడకు వచ్చెను. హైమవతిని గని రాధ చిఱునవ్వునవ్వెను. 'నిద్రపోవుచున్నదా?' అని హైమవతి యడుగ 'నవు'నని రాధ బదులుచెప్పెను. "సంతోషము, ఊరాచ్చికోటలో శ్రీమంతురాలైన యమృతవల్లిముద్దుకూఁతు రీ బాలలత. పుట్టినదాదిగ తల్లిని వదలి యుండలేదు. భయముఁ జెందినది. ఈమె చక్కనిదికాదా? రాధా! నేను నిజము పలికెదను. నిన్నుఁ జూచిన నీమెను వేఱుగఁ జూడనక్కరలేదు. మీయిద్దఱరూపము లొక్కటియ" అని హైమవతి పలికెను.

ఆమె వెళ్ళినతోడనే తనయొడిలోఁ బండుకొనియుండిన బాలలతముఖము నవలోకించి రాధ యిట్లు చింతింపఁ దొడంగెను. 'ఈ ప్రపంచమే మాయ. ఈమెయు బాల. నేనును బాలను. ఇద్దఱ మందగత్తెల మని యందఱు చెప్పఁగ వినుచున్నాను. ఇంతమాత్రముచే మే మిద్దఱ మొక్కటియా? మా కిద్దఱకును వ్యత్యాస మున్నది. నే నింక మీఁద సంపాదించుకొని యిల్లు, వాకిలి కట్టుకొనవలయును. ఈమె శ్రీమంతురాలు. పువ్వుఁబోలెఁ బుట్టి పువ్వుఁబోలెఁ బెఱిగినది. ఈమెకు

లక్ష్మీకటాక్షము, నాకు నామెయక్క యగు పెద్దమ్మకటాక్షము. నేనో బీదరాలను. ఈమె భాగ్యశాలిని.' ఈవిషయములను విమర్శించునపుడు ధైర్యముగా నుండిన రాధహృదయము కలంగంజొచ్చెను. కన్నీరు కారంజొచ్చెను. ఇట్టిసమయమున రాధకన్నీరు బాలలతపైఁ బడఁగ మేల్కని యామెముఖమును బరికించి చూచెను. "అమ్మా! రాధా! నీవు నేఁడు మొదలు నాతో స్నేహముగా నుండెదవా? నిన్నుఁ జూచినతోడనే నీయం దనురాగ ముదయించినది. నాసోదరి వీ వని నాకుఁ దోఁచుచున్నది. నీవే నా కాపురాలవు, నన్ను విడువకుము." అని బాలలత నుడివెను.

ఈ సంభాషణము జరిగినప్పటినుండియు నిద్దఱకు నన్యోన్య స్నేహము గలిగెను. రాధ పెద్ద దగుటచే బాలలతను మిక్కిలి జాగ్రత్తతోఁ గాపాడుచుండెను. ఆమెకు బాలలతయు నలమును నిరువురు చెల్లెండ్రు. రాధయొక్క శ్రేష్ఠములైన గుణములను గుర్తించి, నయ భయవిశ్వాసములతో బాలలత సంచరించుచుండెను. అది యెట్టియను రాగమో? ఎట్టిసంబంధమో? ఈజన్మమునందలి బంధుత్వమో, లేక పూర్వజన్మమునందలిదియో? బాలలత పలికిన దంతయు రాధకు వేద వాక్యము. రాధ యొకతెయే బాలలతనేత్రములకు సుందరి, విదుషి, పరమపవిత్ర. తక్కినవారు క్రూరలు, విద్యావిహీనలు. రాధ కూర్చుండిన స్థలము బాలలతకు దివ్యక్షేత్రము. ఆమెచిఱునగవే పదివేలు. ఆమెయే యొకమంత్రదేవత. ఇట్లు బాలలత రాధయెడ బద్ధాభిమానురాలై యామెను దైవముపగిదిఁ జూచుచుండెను. ఇట్లు రెండు వర్షములు గడచిన తరువాత రాధయు నలమును బట్టపరీక్షకుఁ గట్ట వలసిన తరుణము సంప్రాప్తమయ్యె. కొంతకాలమునకుఁ బరీక్షా సమయమును సమీపించెను. రాధయు నలము నా పరీక్షలందుఁ బ్రశ్నములకుఁ దగిన ప్రత్యుత్తరములను వ్రాసిరి. జయమును బ్రతీక్షించుచుండిరి.

---

# పదియవ ప్రకరణము.

## హైమవతి.

హైమవతి యుండిన గది యతిరమణీయమై పరమపవిత్రమై మహాహ్లాదకరమై శోభాయమానమై భాసిల్లుచుండెను. ఆ గదినిఁ బ్రవేశించినవారి హృదయము వికసించును. మనస్సు నిర్మలమగును. చెలపనచేటలచేతస్సుపై తము చేతొఁకు విడిచి సన్మార్గముం జేపట్టు. ఆయఱలో నడుగు వెట్టి హైమవతిని సందర్శించినంతమాత్రమున నుల్లము పల్లవించి యానందముం జెందనివా రొక్కరును లేరు. సాంగోపాంగముగ సకలశాస్త్రముల నధ్యయనము గావించి మహోన్నతిం గాంచి బ్రహ్మచర్యవ్రతమునకుఁ, బరోపకారపరాయణత్వమునకు, జితేంద్రియత్వమునకు, స్వార్థపరిత్యాగమునకు, తత్త్వజ్ఞాన సంపన్నతకుఁ బ్రఖ్యాతిఁ జెందిన యోషారత్నముల చిత్తరువు లనేకము లందుఁ గానవచ్చెడిని. అ దేమి చిత్రమో, యా రూపముల ప్రభావ మెట్టిదో చేరువకు వచ్చి దండ మిడనివా రొక్కరును లేరుకదా? అట్టి పవిత్ర చరిత్రలరూపములం గనినవారిచిత్త మేకీడునకుం జే వలంతిగాక యే ప్రొద్దును సత్సాంగత్యమునందుఁ దగుల్కొని యుండును. హైమవతియు నట్టివారలలోఁ జేరఁదగిన యపారజ్ఞానముగల విదుషి. అచట నెలు చూచినను గ్రంథరాజములచే నిండిన బీరువా లుండి యయ్యది సరస్వతీశాల యన నొప్పియుండెను. ఆ గదియందు పేకుబల్లలు, వట్టివేళ్ళ సురటీలు, పైడిపూఁతగల కురిచీలు, నిలువు టద్దములు, నుయ్యేలమంచములు నుండెను. ఆ గదిమధ్యభాగమునం దొక చక్కని చలువఱాయి యమర్పఁబడిన షట్కోణములబల్ల యొకటి కలదు. దానిపై స్ఫటికపు వినాయకవిగ్రహ ముండెను. అయ్యది శాస్త్ర ప్రకారము నిర్మింపఁబడి పూజింపఁబడుచుండెను. పుండరీకములు, కోకనదములు, నీలోత్పలములు, కమలములు, నా విగ్రహాము చుట్టు నున్న శిలాఫలకముమీఁదఁ గన్నుల కింపుగఁ జిత్రింపఁబడియె. ఆగదిలో హైమవతి కూర్చొని యేమో చదువుచుండెను. అట్టి సమయమున రాధయు, నలమును నామెదగ్గఱకు వచ్చిరి. "రండు. నా

యనుంగుబిడ్డలారా! కూర్చొనుఁడు" అని చిఱునగ వొప్పు మొగముతో వారి నుపచరించెను. "రేపు మీకుఁ బరీక్షలోఁ గృతార్థులై నందులకుఁ బట్టము వచ్చును. మీరు నేర్చినవిద్య రేపటినుండి సార్థకమగును. మొన్ననే మీ రీకళాశాలకు వచ్చినటులున్నది. కన్నులుమూసి తెఱచునంతలోఁ బది సంవత్సరములు గడచెను." అనఁగా రాధ "మమ్ముఁ బోలిన వారి నెందఱనో ప్రతిసంవత్సరము మీరు కృతార్థులం జేసి పంపుచుండుటలేదా" యనెను.

హైమవతి—దీనిని గుఱించియే మీతో మాటలాడవలయు నని మిమ్ము రావించితిని. ఈకళాశాలలోఁ జదువు చేడియ లందఱలో మీ రిద్దఱే యుత్తమగుణములు గలవారు. మిమ్ములను బోలిన గుణవతులను, బుద్ధిమతులను నే నిదివఱకుఁ జూచి నదిలేదు. ఇంతవఱకును మిమ్ములఁ బ్రశంసించుట మంచిది కాదని యెంచి యూరకుంటిని. మీ రిప్పు డీ కళాశాలను వదలి వెళ్ళవలసినతరుణము వచ్చెను. కాఁబట్టి మీయోగ్యత మీకే తెలియవలయునని వచించితిని. అన్ని గ్రంథములం జక్కఁగఁ జదివితిరి. సంగీత సాహిత్యము లలవడినవి. పరీక్షలయందుఁ బ్రథమస్థానమును బొంది ప్రఖ్యాతిఁ గాంచితిరి. ధనకోటి యిచ్చిన ద్రవ్యమును వ్యర్థము గావింపక మీరు సార్థక పఱచితిరి. నాశక్తికొలఁది మీకు విద్యాబుద్ధు లలవడఁజేసితిని.

రాధ—తల్లివలె మ మ్మాదరించి మాతప్పుల క్షమించి మ మ్మీస్థితికిం దెచ్చితిరి. ఇది యంతయు మీ యనుగ్రహవిశేషమే కదా? మీ కెంతయు మేము కృతజ్ఞులము.

హైమవతి—బిడ్డలారా! కర్తవ్యమును గావించితిని. విశేష మొక్కటియు లేదు. మీ కృత్యముల మీ రొనరించితిరి. నాకును మీకును సంతోషముగా కాలము గడచెను. యోచింపఁదగినయంశ మొకటి కలదు. అయ్యది యిఁకమీఁద మీరు సౌఖ్యముగ జీవించు నుపాయమే. మిమ్ముల విడనాడుటకు నాకును మనస్సు తల్లడిల్లుచున్నది. మీయం దనురాగ మధికముగ నుండుటకు

మీసత్ప్రవర్తనమే, మీవినయమే, మీ వివేకమే కారణము. ఇదిగో, నా కొక జాబు వచ్చినది. కళ్ళికోటలో కామాక్షి మొదలి యని యొక ప్రభువు గలఁడు. ఆయనకు ముగ్గురు కుమార్తె లఁట. పిల్లలఁ బాఠశాల కనుపుట కాయన కిష్టము లేదఁట. తగిన యుపాధ్యాయకొఱకుఁ బ్రతీక్షించుచున్నా రఁట. ఆయనకు నేబది సంవత్సరములవయ స్సుండును. ఆయన భార్య మీనాక్షి గుణవతి. ఆమెతో గూడ నీ వుండి యాపిల్లలకుఁ బాఠములు చెప్పుచుండనగును. మీనాక్షి నిన్నుఁ దనబిడ్డవలెఁ జూచును. ఇన్నిదినములు నాదగ్గఱ గారాబముగఁ బెఱిఁగి తి రే, రేపటినుండియు నెట్లో కో యని విచారపడుచుంటిని. మంచి సమయములో నీ కమ్మ వచ్చెను. ఇంతకన్న మంచిస్థలము దొరకుట దుర్లభము. భగవంతుఁ డీ సమయములో నుపకార మొనరించె నని తలంచి నిన్నుంగూర్చి యొక పెద్దజాబు వ్రాసితిని. మాసమునకు వేతనము నూరురూప్యములు. ని న్నడిగి నీయంగీకారమును గనుఁగొని జాబు పంపవచ్చు నని తలంచి నిన్నుఁ బిలువనంపితిని; ఏమి చెప్పుదువమ్మా! రాధా! ” అని యడిగెను.

రాధ నోరు తెరవకుండఁ గూర్చుండుటంజేసి, మంచి యుద్యోగము లభించినందులకు సంతోషముగా నున్నదని యెంచి హైమవతి “రాధా! నీ వీ భూమిలో నడుగుపెట్టినది మొదలు నేటివఱకు నితరుల యధీనమున నుంటివి. ఇఁక స్వాతంత్ర్యముగ జీవింపవలసి యున్నది. ప్రపంచానుభవము నీకుఁ జాలదు. అయినను నీవు మిక్కిలి బుద్ధిమంతురాలవు. నీ బుద్ధిచేతను, యుక్తిచేతను, నీవు శీఘ్రముగాఁ బుస్తకజ్ఞానముఁ బడసినటులే లోకజ్ఞానముఁగూడ సంపాదించి ప్రసిద్ధిఁ జెందవలయును సుమా! నీ చెల్లెలిని విచారింపఁ బనిలేదు. ఆమె నిక్కడనే కొద్దికాల ముంచుకొనఁ దలఁచితిని. నీకు మొదటిమాసమునకు వేతనము నూరురూప్యములు పంపినారు. అన్నియు నీకొఱకు వారు సిద్ధముచేసిరఁట. నీవు నాచెంత నెట్లుంటివో యట్లే మీనాక్షి కడ నుండవచ్చును. ఆమె బంగారువంటిది. నీస్వభావమును, గుణమును

విద్దెను, సౌందర్యమును, శాంతమును జూచి యిట్టి యుత్తమురాలు నాకుఁ జిక్కెఁగదా యని యుప్పొంగును. నీవు నోరు తెరచి నీయభీష్ట మెఱింగింపుము. ఈ జాబు వ్రాసి ముగించెదను" అనెను. రాధ వినయముతో గద్గదస్వరముతో "అమ్మా! ఆ కమ్మ ననుపవలదు. నేను దాని నంగీకరింపఁజాలను" అనఁగ హైమవతి యచ్చెరువొంది, 'రాధా! నీవు పలికిన పలుకుల కర్థము నీకుఁ దెలియునా?' అనెను. రాధ "నాకు దానియర్థము చక్కగఁ దెలియును. నే నుపాధ్యాయగాఁ బోఁదలంచు కొనలేదు." అన హైమవతి 'అమ్మా! రాధా! రేపు మొదలుకొని యిక్కడ నీ వుండకూడదే! నిబంధనల ననుసరించి నీవు కళాశాల విడిచి పోవలసియుండును. చూచితివా కళాశాలానియమములు?' అని పుస్తకము నెత్తి యానియమమును జూపించెను. రాధ "నాకీ నియమము విదితమే. నే నెందులకిక్కడ నుండెదను?" అనెను. హైమవతి "అట్లయిన రేపు మొదలు నీ వెక్కడ నుండఁదలఁచితివి? ఎక్కడికిఁ బోఁగలవు!" అని యడుగ, రాధ "బాలలత నన్నుఁ దనతోఁగూడ నూరాచ్చికోటకు రమ్మని వేడుకొనెను. ఆమెతోఁగూడ కొన్నినా ళ్లుండఁదలఁచితిని" అనెను. అలము "అక్కా! నా కేమియుఁ జెప్పలేదేమే!" అని యడిగెను. రాధ, "బాలలత ప్రార్థించినది. పోదునా, పోకుందునా" యని డోలాయమానస్థితియం దుంటిని. ఆమెకు వాగ్దానము చేయలేదు. ఇప్పుడుగదా నిశ్చయించితిని." అనెను.

హైమ—రాధా! నీకు నిరువదేండ్ల ప్రాయము. పెద్దదానవు. నీ యిష్టముచొప్పున నడచుకొనుము. కల్లికోటకుఁ బో నిష్టము లేనిచో నిన్ను బలవంతముచేయనొల్లను.

రాధ—నాకుఁ గల్లికోటకుఁ బోవఁ గొంచెమైనను సమ్మతము లేదు. నా కాపని వలదు. నే నక్కడికిఁ బో నొల్లను. మఱియొకరిని వా రేర్పరచుకొనవచ్చును. నా యభ్యంతర మేమియు లేదు.

హైమ—అయిన నీ జాబు చించి పారవైచెదను.

అని బల్లమీఁదఁ బెట్టియుండిన కమ్మ నెత్తెను. అలము, "అమ్మా! కొంచెము నిదానించుము. రాధ యీపని వల దని చెప్పెను. నేను

బోయి యక్కడ నా యుద్యోగముఁ జేయఁగల నని మీకు నమ్మక ముండిన నన్ను నక్కడికిఁ బంపుదురా?" అని వినయముతో విన్నవించెను. దానిని విని హైమవతి యచ్చెరు వొంది "నా చిన్ని కుమారీ! నే నెంత పొరఁబడితిని. నిన్ను గుఱించి నే నొకనాఁడును దలంపలేదు. మఱచితిని" అనెను. అంత నలము "నే నేవిధముగ నడుచుకొన వలయునో యా ప్రకారము ప్రవర్తించి మీనాక్షిమన స్సునకు సంతోషముఁ గల్పించి యా పిల్లల నాయొద్ద నుంచుకొని పాఠములు చెప్పెదను. నాకును మీ కరుణవలన నన్ని శాస్త్రములు విదితము లయ్యెను. ఆ మువ్వురు బాలికలకు విద్య నేర్పుటకు నేను పట్టపరీక్షయందుఁ గృతార్థురాల నైతినిగదా. నాకును శక్తి గలదు." అనెను. "నీకు శక్తి చాల దని యెవరు నుడివిరి! మీనాక్షికి నీవు తగి యుండు వనుటకు నాక్షేపణ మేమి? నీవు రాధకంటె రెండేండ్లు చిన్న దానవు. కొంచెముకాల మీ పాఠశాలలోనే యొక పని నిచ్చి యిక్కడినుండి తరువాత నిన్నావలకుఁ బంప నుద్యమించితిని. అయినను నిన్ను నిజముగా కల్కికోటకుఁ బంపు విషయము మఱచితిని." అనెను. అలము "అమ్మా! లోకజ్ఞాన మలవడుటకు నేను మాత్ర మెందులకు నిప్పుడే పోరాదు? మాసమునకు నూరు రూప్యములు. ఎన్నాళ్ళు మీ ప్రేమకుఁ బాత్రలమై మా కార్యము తీరిన తఱువాతఁగూడ మీకు భారముగ నుండఁగలము? మీనాక్షమ్మ కోరినపుడు నన్నుఁ బంపకపోయిన మీరు సెలవిచ్చినప్రకార మంతటి యుత్తమురాలు నాకిఁక నెక్కడ దొరకును? అయి నను నన్ను రెండుమాసములు పనిలో నుంచునట్లు లేర్పాటు గావింపుఁడు. నే నా పనిని మనస్సునకుఁ దృప్తికరముగ నెఱవేర్చిన నన్నుంచుకొను మనియు, లేని పక్షమున నన్ను నిలిపి వేయు మనియు వారికి మీరు వ్రాయఁగూడదా?" అని వేడుకొనెను. హైమవతి అలమును కౌఁగిలించుకొని, ముద్దుబెట్టుకొని "కుమారీ! అన్నిన్నటికిని వ్రాయనవసరములేదు. ఆ పనిని నీకు స్థిరముగా నిచ్చునటుల వ్రాసెదను. నేను వ్రాసినజాబులో రాధపేరు కొట్టివైచి యలమేలని మార్చినఁ జాలును. మీనాక్షి నిన్ను సన్మానించును. నీయెడఁ

దల్లివలె నుందును. మంచిస్థలము. నీకు క్షేమము కలుగును" అని చెప్పి జాబును ముగించి పంపెను. రాధ యలమును గౌఁగిలించుకొని "ఇది నీకు ప్రస్తుతము మంచియుద్యోగము. దేవుఁడు మనకు మంచిమార్గము జూపించును. నీకును నాకును మంచిస్థలమును నేను వెదకియుంచెదను. కళ్ళికోటకు వెళ్ళిరమ్మ" అనిచెప్పి హైమవతినిఁ జూచి "నే నీపనికి నొప్పుకొనకపోవుటవలన నామీఁద మీకుఁ గోపము వచ్చినదా?" అని ప్రశ్నించెను. హైమవతి "లేదు. చిన్నారీ! నేను మంచియుద్యోగముఁ జూపించిన నీవు దానిని నిరాకరించితివి. దానియర్థము నాకు గోచరముకాలేదు. మీ రిరువురిలో నీ వైన నేమి? నీ చెల్లె లైన నేమి? ఈశ్వరుఁ డనుగ్రహించుఁగావుత"మని దీవించి వా రిరువురను బంపెను.

వీరిద్దఱును దమస్థానమును జేరిరి. ఆ దినముమాత్రమే యా కళాశాలలో వా రుండఁగలరు. మఱుసటిదిన మొక రూరాచ్చికోటకును మరియొకరు కళ్ళికోటకును వెళ్ళవలయును. వియోగదుఃఖ మారాత్రి యిరువురను బాధించెను. వియోగ మేరికైన విషాదకరము కదా!



# పదునొకండవ ప్రకరణము.



## ఊరాచ్చిపచ్చయప్పగారి భవనము.

ఆ కళాశాలలో బి. యే. పట్టము విద్యార్థినుల కియ్యఁబడఁగ నక్కడ నడుపవలసిన ప్రసంగములు, వాద్యఘోషము, లాటపాటలు మొదలగునవి క్రమముగ జరిగెను. ఉపాధ్యాయ లందఱకు వందనము లర్పించి విద్యార్థినులు స్వస్థానములకుఁ బోవుటకు బయలుదేరిరి. బాలలతతో రాధయు నూరాచ్చికోటకుఁ బయనమయ్యెను. ప్రవేశపరీక్ష ముగియఁగనే బాలలత విద్యఁ జాలించెను. ఆనాఁడు బాలలతతో నొకబండిలోఁ గూర్చుండి రాధ యుల్లాసముగ నాబండిలో నమర్పఁబడి యుండినపఱుపుల నానుకొని బాలలతతో ముచ్చటించుచుండ నాశకటము భవానీపట్టణమునుండి యూరాచ్చికిఁ దిరుగురస్తాలో నతివేగముగఁ బోవుచుండెను. ఆరస్తా కిరుప్రక్కల నుండుపొలములలోఁ గొందఱు సేద్యగాండ్రు వడ్లు నూర్చుచుండిరి. వారిని జూచి "వీరలజీవనమే సుఖమైనది. ఆరోగ్యకర మైన సూర్యప్రకాశము, మలయమారుతము, వా రనుభవించుచుందురు. దేహపరిశ్రమ కేకొఱఁతయు లేదు" అని పలుకుచుండగా విఘ్నేశునికోవెల కనఁబడెను. దానిం గనినతోడనే రాధకుఁ బూర్వఁపువిషయములు జ్ఞప్తికివచ్చెను. ఒకప్పుడు తన చెల్లెలితోను నల్లప్పతోను నా స్థలమునకు వచ్చుట, ఇల్లు కాలిపోవుట, మన మునకుఁదట్టెను. తనకై విశేషముగ శ్రమపడి మృతినొందిన నల్లప్పను దలఁచుకొనినప్పు డామెముఖము వివర్ణమయ్యెను. ముసలితాత తనను నడువలేనప్పు డెత్తుకొని నడచుటయు, నారాత్రి యాయూరి గుడిసెఁ జేరుటయుఁ దన కతఁడు జాబు నిచ్చుటయు నా జాబును దానెవరికో యిచ్చుటకుఁ బోవుచుఁ దోవలో నుండుతోటలోఁ జిక్కుపడుటయును దలంపునకు వచ్చి యామెమనస్సును గలవఱపఱచెను. ఆకోవెల కవల నుండు సమాధు లామె కగపడెను. అమాయిక యగు బాలలత రాధం గని "ఏమమ్మా! దేనినిగూర్చి గాఢముగా యోజించుచున్నావు? నీ చెల్లెలిని విడిచివచ్చితి నని దుఃఖము కలిగెనా?" అని

యడుగ, రాధ "ప్రకృతిసౌందర్యములం గాంచి యానందనిమగ్ననైతి" ననెను. అంతట బాలలత "అదిగో! శరత్కాలమేఘమువలె తెల్లగా నున్న యా భవనమే మా గృహము. శీఘ్రముగా మన మక్కడకుఁ బోఁగలము. అదిగో పెద్ద స్తంభము. నూఱడుగులయెత్తు గలిగి యెఱ్ఱనిపండ్లు గల దొండతీగలచేఁ గప్పఁబడియున్నది. అది యెద్దియో నీకుఁ దెలియునా?" అని యడిగెను. నాకుఁ దెలియదుగాని యదొక స్మారకచిహ్నముగ నిర్మింపఁబడినదని తోఁచెడిని" అని రాధ బదులు పలికెను. "నీవు బుద్ధిమతివి. మా తోఁటమాలిగుడిసె యుండిన స్థలములో నతనిజ్ఞాపకార్థము మా తండ్రి యీ స్తూపమును గట్టించెను." అని బాలలత చెప్ప, రాధ "ఆ గుడిసె యేమయ్యెను? ఆ తోఁటమాలి యేమయ్యెను?" అని విభ్రమముతో నడిగెను. "ఆ గుడిసె ఒకప్పుడు నిప్పంటుకొని కాలిపోయినది. ఎవరో ముసలివాఁడు నిద్దఱు చిన్నియాఁడుపిల్లలతో నక్కడ విశ్రమించి మడిసిరఁట. అగ్నిజ్వాలల కాహుతులైరి. పాపము!" అని బాలలత చెప్ప రాధమొగము వెలవెలఁ బోయెను. "రాధా! అట్లు నీమొగము మార్పుఁజెందుట సహజమే. దానినిఁ దలంచిన నా మన సిప్పుడును బరితపించుచున్నది. అది గడచి పది, పండ్రెండు వత్సరము లయ్యెను. నేఁడు జరిగినటుల నామనస్సునకుఁ దట్టుచున్నది. ఏదియో సగము కాలిన మొండెము మాత్రము మాకుఁ జిక్కెను. ఎంత పరీక్షించిన నెవరైనదియు గుర్తించుటకు వీలు లేకపోయెను. తరువాత మాతండ్రి యాస్థలమున నాముసలిబాటసారి పేరుగా నీస్తూపమును గట్టించిరి. మఱియొక యాశ్చర్యము కలదు. దాని నింటికిఁ బోయి చెప్పెదను. ఆ రాత్రియందే..." అని చెప్పు నంతలో వారిబండి పచ్చయప్పగారి ప్రాసాదముఁ జేరెను. వాకిలి దాఁటఁగనే కొమార్తె వచ్చుట కలరి యమృతవల్లి యెదురుగ వచ్చి "అమ్మా! వచ్చితివా!" అని కౌఁగిలించుకొనెను.

తల్లియుఁ గూఁతురును మాటలాడుకొనుచుఁ గొంచెముదూరము పోయినతరువాత, బాలలత "అమ్మా! ఈ కరుణానిధియే మనరాధ. నా ప్రాణస్నేహితురాలు. ఆమెవలననే నే బ్రతుకఁగలిగితిని. ఈ రాధ నాప్రాణమునకుఁ బ్రాణము. నన్నుఁ జూచువిధంబున నీరాధను

నీవు చూడవలెను. ఆమెను గుడికన్నువలెను, నన్నెడమకన్నువలెను జూడుము. నాకంటె నీమెయందు మిక్కిలి విశ్వాసముగా నుండవలెను జుమా! అమ్మా! నావిషయములో నామె పడినశ్రమ మింతయని చెప్పుటకు సాధ్యముకాదు." అని పలికెను. అమృతవల్లి స్వభావమృదు మధుర స్వరముతో "నా కన్నతల్లికి నంతచేసిన రాధను నాకుమార్తె వలెఁ గాంచనా? ఇంత చెప్పవలెనా?" అని, రాధను గాంచి "అమ్మాయీ! నీకు నేను దల్లిని. నీవు నాకు బిడ్డవు. గృహయజమాను లూర లేరు. ఆయన యిక్కడ నుండిన నెంత సంతోషించియుందురో కదా! వారికి కొద్దికాలమునుండి దేహసౌఖ్యము లేదు. కాన మళయాళములో సుప్రసిద్ధవైద్యుఁ డుండుట విని పాలఘాటునకు వెళ్ళినారు. వారు వచ్చుట కింకను మూడు,నాలుగు మాసములు పట్టును. అన్ని దినములు మందు సేవించినఁగాని వారి కారోగ్యము కలుగదని వైద్యులు చెప్పిరి. ఇక్కడ నెన్ని యౌషధములో సేవించినారు. ఏదియు గుణ మీయకపోయెను." అనెను. బాలలత "తండ్రిగారి కంత జబ్బుగా నున్నదా? నాకుఁ జెప్పి పంపలేదే!" అని, "అమ్మా! మేడమీఁద నొకదాని కొకటి యెదురుగ నున్న రెండుగదులలో నొకటి నాకును, నింకొకటి రాధకు నేర్పాటు చేయవే" యనెను. దానిని విని యమృతవల్లి "సుబ్బన్నబుద్ధియే బుద్ధి. అతఁడు నీ వొక స్నేహితురాలితో వచ్చుట యెఱిఁగి నే నేమియుఁ జెప్ప కుండగనే యెన్ని యేర్పాటులు చేసియుంచినాఁడు! అమ్మా! రాధా! నీగదికి నీవు పొమ్ము. సామానులను సేవకుఁడు తెచ్చిపెట్టును. బాలలతా! నీవును నీగదికివెళ్ళి నీయిష్టప్రకారము సామాను లమర్పఁబడియున్నవో, లేవో చూడుము. చాల దూరప్రయాణము చేసి వచ్చినారు. శీఘ్రముగా భోజనముచేసి శ్రమ తీర్చుకొనుఁడు." అని చెప్ప వా రిద్దఱును మేడ యెక్కిరి.

రాధ తన కళాశాలతప్ప మఱియొక స్థలమునకుఁ బోయి యెఱుంగదు. పుస్తకములయం దనేకదివ్యహర్మ్యంబులపటములఁ జూచి యుండెను. కాని నేఁడు పచ్చయప్పగారిసౌధమును గాంచి పరమానందముఁ జెందెను. ఆగోడల ధావళ్యము, నా చిత్తరువుల సొబఁగు, నాకట్టడములశోభ, యాచలువఱాళ్ళప్రకాశము, నా నిలువుటద్దముల

సొంపు, నా తూగుటుయ్యేలల తీరు, నా శృంగారమును వీక్షింపుచుఁ బోవుచుండినపు డమృతవల్లియు వారివెంబడి వచ్చుచుండెను. వీ రి ట్లొక మూల తిరుగునపుడు రాధ యొక చక్కని పటమును గాంచి "ఆహా! ఎంత సుందర మైనది! నేను దీని నెక్కడనో చూచిన ట్లున్న దే" అనగ నమృతవల్లి "ఇది యంబుజమ్మపటము. మా యజమా నునకు దీనిమీఁద నెంతయో యభిమానము" అన, నందులకు రాధ, "ఆపటమును జూచిన మాయమ్మను జూచిన ట్లున్నది. కారణ మిట్టి దని నాకుఁ దెలియదు." అనెను. అమృతవల్లి రాధపలుకుల నాలించి 'అమ్మా! రాధా! నీకు నీతల్లి జ్ఞాపకమునకు వచ్చినదా? బాలలత చెప్పుటలో నీకుఁ దల్లి లేనటుల చెప్పినదే" అని యడుగుచుండ మర కతమను దాసి తలుపు తెఱవఁగా నక్కడ మామిడాకుల తోరణము గట్టిన యొకగదిలోని కందఱును బ్రవేశించిరి.

"అమ్మా, బాలలతా! ఇదే నీగది. ఆ తలుపు తెఱచుకొని పోయిన నక్కడ నొకగది కలదు. ఈ రెండుగదులకు వేఱువేఱుమా ర్గము లున్నవి. కళాశాలలో మీరు చదువుకొనుచుండిన ట్లే యిక్కడను గాలము గడుపవచ్చును." ఇట్లు నుడువుట బాలలతకుఁ గాదు. ఆ యి ల్లంతయు నామెకుఁ జక్కఁగఁ దెలియును. రాధ క్రొత్తదిగాన నామెకొఱకై యమృతవల్లి చెప్పినది. మరకత మెప్పుడు నీతో నుండు నని వచించి యమృతవల్లి క్రిందికి వెళ్లెను.

రాధకుఁ దన గది గాంచినది మొద లచ్చట నిర్భయముగ సంచరించుటకు బుద్ధి పుట్టలేదు. కమలములు గూర్పఁబడిన పెద్ద యేలూరు రత్నకంబళి నేలపైఁ బఱుపఁబడి యుండెను. ఆ కమల ములశృంగారవిశేషముం బట్టి యా గదికి 'కమలములగది'యని పేరు కలిగెను. నాలుగు చిత్రవిచిత్రము లైన పను లొనరింపఁబడిన పట్టు పరదా లుండెను. అవి రజతంపుఁదాఁడున గుచ్చఁబడిన కనకఁపు టుంగరములకుఁ దగుల్కొని వ్రేలాడుచుండెను. ఆ గదియందు హంసతూలికలచేఁ జేయంబడిన శయ్య లమర్పఁబడినమంచములు, కురిచీలు, నానావిధము లగు పనితనము చేసిన బీరువాలు, నందు భాషా

యోషకు నిర్మింపఁబడిన యమూల్యాభరణములో యనఁదగు గ్రంథ రాజంబులు మొదలగునవి యలంకరింపఁ బడియుండెను. ఇట్టి యలంకరణ మీ గదికి మాత్రమే కాదు. ఆ భవనమునందలి యన్ని గదులు నావిధంబుగనే యుండెను. రాధ యదివఱ కెన్నఁడును నట్టి ప్రాసాదములను వీక్షింపనందున విభ్రమముం జెందెను.

మరకతము, "అమ్మా! మీ పెట్టెతాళముచెవి యిచ్చిన సామానులను దీసి యుచితస్థలములలో నుంచెద" ననెను. రాధ కుండిన దంతయు రెండుపెట్టెలే. రాధ తన రొండిన నుండిన బీగములను దీసియిచ్చి "సామానులఁ దీసి పెట్టుము. ముఖ్యమైన వన్నియు బాలలతయొద్దనే యున్నవి. వానిని దరువాత తీసికొనెదనులే" అనెను. ఆ పెట్టెలో నుండిన కాశీ పట్టుచీరను దెచ్చి మరకతము రాధకు స్నానానంతరము ధరించుకొనుట కిచ్చెను. అది రాధ పట్టభద్రురాలైన సమయంబున హైమవతి యిచ్చినచీర. పిమ్మట మరకతము తల దువ్వుటకు వలయు నుపకరణములతో వచ్చెను. రాధయుఁ దన జడ విప్పుకొని యొక బల్లమీఁదఁ గూరుచుండెను. మరకత మలంకరించుట యందు సమర్థురాలు. సువాసన లీను తైలము రాచి రాధయొక్క కుంతలములను జిక్కుఁదీసి 'జడవేసిన నిటువంటి యుత్తమలకుఁగదా వేయవలయు. నల్లని పొడవైన శిరోజములు జడ కెంతయో బాగుండును' అని చిత్రముగ వేణి నల్లి పూవుల ముడిచెను. శృంగారించినపిదప రాధ తనకై సిద్ధముగ నుంపఁబడిన యుష్ణోదకమునందు స్నానమొనరించి తన పట్టుచీర కట్టుకొని నొసటఁ గుంకుమ పెట్టుకొని తనరూపమును నిలువుటద్దములోఁ జూచి విస్మయముం జెందెను. మరకత మొనరించిన శృంగారము రాధ కెంతయో శోభను గల్పించెను. మరకతము మఱల వచ్చి రాధ కట్టుకొనినచీరయొక్క సరిగంచును సవరించి పయ్యెటఁ జక్కనొత్తి వెళ్లెను. అంతట బాలలత వచ్చి రాధసౌందర్యమున కచ్చెరువొంది "రాధా! భగవంతుఁడొక తప్పొనరించెను. నిన్నుఁ బచ్చయప్పగారి కొమరితగఁ బుట్టించియుండవలసినది. నీ విద్దెకు, బుద్ధికి నీ యందమునకు నెంతశోభ కలిగియుండునోకదా?" యనెను. అంతట నిరువురును భోజన

శాల కరిగిరి. అమృతవల్లి యెదురుగా వచ్చి యిరువురను దీసికొనిపోయి తనప్రక్కనఁ గూర్చుండఁబెట్టుకొనెను. "కుమారీ! అంబికాపతి యయిదారుదినములలోఁ దనస్నేహితులతో వచ్చెదనని వ్రాసెను. ఇప్పు డొక్కరును లేనందున నిల్లు చిన్నపోయియున్నది" యని యమృతవల్లి బాలలతతోఁ జెప్పెను. వీరు ముగ్గురును బీఁటలమీఁదఁ గూర్చొనియుండఁగ వారి కభిముఖంబుగ నుండిన కొట్టుతలుపు నిశ్శబ్దముగఁ దెఱువఁబడెను. అందుండి యొక స్త్రీరూపము వెలుపలికి వచ్చెను. రాధ భయముఁ జెందెను.



# పంచదశప్రకరణము.



## కుంతలమ్మ.

ఆగదినుండి వెలువడిన వ్యక్తిశరీరము మిక్కిలి శుష్కించి యుండెను. తెల్లని పెద్దకన్నులు, జడలు కట్టినతల, నల్లనిచీర, నడుమున నొక వికారమైన కంబళిం గలిగి యతిభయంకరముగ నుండెను. ఆమెవయస్సు ముప్పది సంవత్సరము లుండును. నడచి వచ్చునపుడు వెనుకనుండి యెవరో త్రోసికొని వచ్చుచున్న ట్లుండెను గాని స్వయముగ నందఱవలె నామె నడచిన ట్లుండలేదు. ఆ వ్యక్తినిం జూచిన రాధకు మేను వణంకసాగెను.

బాలలత "రాధా! ఈ రమణీమణియు, నేను మీా కళాశాలకు వచ్చుటకుం బూర్వము నాకు విద్యం గఱపుచుండెను. ఈమె పేరే కుంతలమ్మ. (కుంతలమ్మను జూచి) ఈమెనామము రాధ, నా చెలికత్తె. కళాశాలయందు నాకుం దోడునీడ యై యుండెను. ఈమె నా కొనరించిన సాహాయ్యము నే నెన్నటికిని మఱువఁజాలను. నీకు సంభవించిన దురవస్థవలన నీవు పూనిన యీా యాకారము రాధకు విపరీతముగా నుండుటయ కాక భయముం గొల్పుచున్నది." అనెను.

అందఱును భుజించుటకుం బ్రారంభించిరి. రాధ భోజనానంతరము బాలలతహస్తముం బట్టుకొని మేడమీాఁదికి వెళ్లెను. దారిలో 'బాలలతా! కుంతలమ్మవిషయము నంతయు వివరముగాఁ జెప్పుము. ఏల యీామె యిటుల లోకవిరుద్ధముగా నున్నది? ఏ మట్లు క్షీణించి పిచ్చిదానివలె నున్నది? ఇట్టి మార్పు గలుగుటకుం గారణ మేమైయుండును?" అని రాధ యడిగెను.

బాలలత—లేదు, లేదు. పిచ్చిపట్టుట యొక్కటియే కొఱఁత. ఆమె పడినకష్టము లెవ్వరు ననుభవించియుండరు. వయస్సు వచ్చిన యీాఁడుదానికి మఱునాఁడు వివాహ మనగం, దా వరించినవరుం

డానాఁటి రాత్రియే దుర్మరణంబును జెంది శవమై పడియుంటఁ జూచిన మనస్సు మారకుండునా ? ఈ యవస్థయే కుంతలమ్మకుఁ బదివర్షములకు ముందు సంభవించెను.

రాధ——వినుటకు బహుభయంకరముగ నున్నది. శరీరము గుర్పొడిచెడిని. ఎవ రా పురుషునిఁ జంపినది ? ఏల యట్టి ఘోరకృత్యమొనరింపఁబడియె ?

బాలలత——ఎవ్వరును గనిపెట్టలేకపోయిరి. అతఁ డజాత శత్రువు. ధనాశవలన మృతి కలిగె నని తలంచుటకు వీలులేదు. అతని యొద్ద విలువ గల నగలును, మఱికొంత ధనము నుండెను. కాని యొక చిన్న కాసునుగూడఁ దాకినవారు లేరు. అన్నియు నాశవమునకే యుండెను. కుంతలమ్మ యాతని దేహమును జూచినప్పుడు నేనుగూడ నుంటిని. నా కప్పు డెనిమిది వర్షముల ప్రాయము. కుంతలమ్మ యొక్క కేక వేసి మూర్ఛఁజెంది నేలపైఁబడెను. ఇప్పుడు చూచిన ట్లున్నది. పాపము ! ఆవధూవరుల యన్యోన్యానురాగ మింతింత యని వచించుటకు సాధ్యము కాదు. అంత యనురక్తి కావుననే యింత దుఃఖము కలిగెను. ఎంత దురదృష్టురాలు ? ఎందఱో వచ్చి కుంతలమ్మను వేఱొకరినిఁ బెండ్లియాడుమని బోధించిరికాని, పెండ్లి కాకపోయినను నాతఁడే తనభర్త యని, మన స్సొకవస్తువునందే లగ్న మగునుగాని భిన్నవస్తువులందు లగ్నము కానేర దనియు, నొకచిత్రమొక పటమునం దిముడ్పఁబడిన తరువాత మఱియొక చిత్తరువునకాపటమునఁ దా వెక్కడి దనియు, సమాధానములు చెప్పుచు మానసికవివాహమే ప్రధాన మని యెంచి యాతఁడే తన మనోనాథుఁ డని నమ్మి భజింపుచుండెను. ఆతనిశవము వినాయకుని కోవెలసమీపమునఁ బూడ్పఁబడి యచ్చట నొక సమాధి నిర్మింపఁబడియె. ప్రతిదినమును గుంతలమ్మ వేకువ జామున లేచి స్నానము చేసి, శుచియై పుష్పములం దీసికొని పోయి యాసమాధికిఁ బూజచేసి తిరిగి యింటికి వచ్చుచుండును.

ఎండగాని, గాలిగాని, వర్షముగాని యామెవ్రతమునకు భంగముఁ గలిగింపఁజాలకున్నవి.

రాధ—ఇది యొక కట్టుకథవలె వింతగా నున్నది.

బాలలత—ఇంతియకాదు, మఱియొక వ్రతముం బూనియున్నది. "ఎట్లైన నాభర్తను జంపినఘాతుకుని నేను గనుఁగొని సంహరింతు" నని ప్రతినవట్టియున్నది. ఈ పట్టుదలను విడువు మని మాతల్లి యెంతయో చెప్పెనుగాని యామె వినలేదు. చాల కాలమునుండి మాయింటిలోనే యుండుటం జేసి, యామె నా కొనరించిన విద్యారూపకమైన మహోపకారమును మనమున మఱువక యామెయిష్టప్రకారము నడుపుచు నామెను మాయింటిలోనే నిల్పికొని మర్యాదతోఁ జూచుచున్నారము. తన భర్తను జంపినవారినిఁ జంపినం గాని తాను లోకముతోఁ బాటు ప్రవర్తింపరాదని మొండిపట్టు పట్టినది. ఆ సమాధికి తప్ప వేఱెచటికిఁ బోవుటలేదు. పాప మామెదురవస్థ యేమని చెప్పుదు? అంతయుఁ దనకుఁ దానే తెచ్చిపెట్టుకొనినది!

రాధ—ఆమెను జూచిన నాకు భయమును, జాలియుఁ గలుగుచున్నవి.

బాలలత—భయపడనక్కఱలేదు. ఆమె చాల మంచి స్వభావము గలది, విదుషీమణి. మాతల్లికి మొదటిభర్త చనిపోయి దుఃఖములో నున్నపుడు వీరిద్దఱకును స్నేహము కలిగినదఁట! ఆస్నేహ మింకను జరుగుచున్నది.

రాధ—మీయమ్మ రెండుమారులు పెండ్లిచేసికొనెనా?

బాలలత—అవును. అంబికాపతి నాకు సొంతయన్న కాఁడు. మాతల్లికి మొదటి భర్తవలనఁ గలిగిన కుమారుఁడు. నీకుఁ దెలియనే తెలియదా?

రాధ—నీవు చెప్పకయే నా కెట్లు తెలియఁగలదు? ఇప్పుడుగదా వింటిని?

బాలలత—నీ కిదివఱకే తెలిసియుండు నని తలంచితిని? నీవు సూక్ష్మ బుద్ధి గలదానవుగదా! అంబికాపతి యుద్యోగాభిలాషియై యెచటికో చనెను. అట్లు వెళ్ళకుండిన నీయాస్తి యంతయు నతనిదేకదా!

రాధ—నీవు నుడివినవిషయములనుబట్టి మీావంశమును కొద్దిగా గ్రహించితిని. కుంతలమ్మయేనా నీకుఁ జదువు చెప్పినది?

బాలలత—అవును, నాకును, అంబికాపతికిని జాలదినములు చదువు చెప్పినది కుంతలమ్మయే. మాకు నామెయెడ నమితవిశ్వాసమును, గౌరవమును గలదు. తనభర్త చంపఁబడినది మొదలొక వర్షము పైత్యజ్వరముచే బాధపడి యామె జీవించుటయే దుర్ఘట మనిపించెను. అదిమొద లింతవఱకును నామెకారోగ్యము కలుగనేలేదు. అంతయు మాఱిపోయినది. ఆ శరీరము కాదు, ఆబుద్ధి కాదు. గుర్తించుటకుఁగూడ సాధ్యము కాకయున్నది. నాతల్లి యంత స్నేహాముగా నుండుటచేతను, నామెభర్త యీ తోఁటలోనే చంపఁబడినందునను హ తకునిఁ గనుగొనునట్లు ప్రతిజ్ఞ చేసినందునను, నామె యిక్కడనే యున్నది. ఆమెను బరదేవతవలెఁ జూచి మాతండ్రి యామె కోరికల నన్నిఁటినిఁ గొనసాగించుచుండును. ఈ విషయమును గూర్చినయొకయద్భుతము నిదివఱకే నీకుఁ జెప్పఁదలఁచితిని. ఈ దారుణమరణ మా యనాథబాలికలు, వృద్ధుఁడు నెక్కడ నుండి కాలిపోయిరో యా స్థలమునకు సమీాపమునందే కావింపఁబడినది. ఇది యాశ్చర్యము కాదా!

రాధ—ఆచావునకు, గుడిసె నుండుటకు నేమైన సంబంధ ముండెనేమో?

బాలలత—అప్పుడు జరిగినవిచారణములో రెంటికి నే విధమైన సంబంధము లేదనిరి. కాని యిప్పు డది యాలోచించిన రెండు నొక్కరిపనియే యైయుండవచ్చు నని తోఁచుచున్నది. ఎన్నియో రహస్యము లుండవచ్చునుగాని నిక్క మొక్కరికైనఁ

దెలియుటలేదు. అదిగో! అమ్మ వచ్చుచున్నది. ఆమె రాఁగానే నీవు వీణ వాయింపవలెను. మాతల్లికి వీణ యనినఁ బ్రాణము. ఆమె వీణ వాయించుటయందుఁ గడు సమర్థురాలు.

ఇట్లు వీరిరువురు సంభాషించుచుండఁగ నమృతవల్లి యచ్చటకు వచ్చి 'మీ రిద్దఱును వీణ వాయింపవలెను' అని చెప్పి వారినిఁ బిలుచుకొని పోయెను. అచ్చోట నానావిధములైన వాద్యము లుండెను. వీరు మువ్వురును గూర్చున్నతోడనే కుంతలమ్మకూడ వచ్చిచేరెను. రాధ వీణను మీటి రాగ మాలాపించి చక్కనికృతులను సరసముగ గానముచేసెను. ఆగానసుఖముచే మైమఱచిన యమృతవల్లి బ్రహ్మానందమును జెంది రాధను ముద్దుబెట్టుకొనెను. "విద్యావంతు లనేకులు పాడఁగ వినియుంటినిగాని యీసుఖము నే నెన్నఁడు ననుభవింపలేదు. రాధా! బహుకష్టపడితివి. పాపము! నీగదికిఁ బోయి యలసటఁ దీర్చుకొనుము." అని యమృతవల్లి రాధను బంపెను. రాధ యా శాలను విడిచినంతనే బాలలత తనతల్లిం జూచి "అమ్మా! రాధనుగుఱించి నీ యభిప్రాయ మేమి? నేను చెప్పిన దంతయు నిజమే కదా?" అన నందుల కామె 'కుమారీ! రాధ మంచి చదువరి, బుద్ధిశాలిని, అందకత్తె, నీకు సరియైన చెలి యనుట కేమియు సందేహము లేదు.'

కుంతలమ్మ—రాధను జూచుటకు నాకుఁ గడుంగడు సంతోషముగ నున్నది. ఆమెముఖములో బాలలతలక్షణములు కానవచ్చుచున్నవి. ఇద్దఱిముఖము లొక్కటి.

అమృతవల్లి—దిక్కులేని ధర్మపాఠశాలలోఁ బెఱిగిన రాధ యెక్కడ? పచ్చయప్పగారి కుమార్తె బాలలత యెక్కడ! అందములో నొకటిగ నుండిన నుండవచ్చునుగాని భాగ్యమందుఁ గాదు.

కుంతలమ్మ—వీ రిద్దఱిలక్షణములకు వ్యత్యాసము లేదనుట కే యాక్షేపణము లేదు.

ఈ సంవాదము వినిన బాలలత "రాధసౌందర్యములో సగమైన నాకు లేదే" యనెను. అమృతవల్లి 'ఏమో! కాకిపిల్ల కాకికి ముద్దు. నాకంటికి బాలలతయే మిక్కిలి యందకత్తె.'

బాలలత—అటులఁ దలంచి రాధమీఁద నీ వసూయఁ జెందఁగూడదు. నామీఁదకన్న రాధమీఁద నెక్కువ దయగలిగియుండవలెను సుమా !

అమృతవల్లి—ఏల యటుల పలికెదవు? రాధను నా కుమార్తెగఁ జూచెదనంటినే. ఇఁక నేమి? చాల సేపాయెను. పోయిపరుండుము.'

అనిచెప్పి దాసి నిచ్చి బాలలత నా మొగదికిఁ బంపెను. ఇంతలో రాధ తనగదిఁ జేరి మెల్లగ తన చీరను విడిచి వేఁటువస్త్రమును ధరించి శయనించి గాఢనిద్రం జెందెను.

---

# పదుమూఁడవప్రకరణము.

## భూతగృహము.

'బాలలతా! బాలలతా! నీ వింకను నిద్ర లేవలేదా?' అని యొకనాఁటి యుదయమున రాధ తన గదినుండి వెలుపలికి వచ్చి బాలలతను లేపెను.

బాలలత—నే నిది యుదయ మనియు, లేవవలయు ననియు మఱచితిని. పాఠశాలలో సూర్యోదయమునకుఁ బూర్వమే గంట కొట్టుదురు. చెవులు చిల్లులు పడిపోవును. ఆ యుపద్రవము లేకుండ నిద్రపోవుట యెంత సుఖము? ఇక్కడ మన యిష్టప్రకారము లేవవచ్చును గదా? రాధా! నీ వెందులకే యింత త్వరితముగ కోడి కూయకమునుపే లేచినావు?

అని చెప్పి కన్నులు తెఱచి చక్కఁగా నలుదిక్కులఁ గని యుదయ మయ్యె నని కన్గొని లేచి రాధను కౌఁగిలించుకొనెను. వీరిద్దఱి స్నేహబంధము వర్ణనాతీతము.

రాధ—నా కన్నియు నూతనములుగ నాశ్చర్యముఁ గొల్పుచున్నవి. నానావిధశకుంతంబుల రుతంబులు, శుకపికారావంబులు వీనులకు విం దొనరించుచుండె. నిద్ర మేల్కొంటి. ఈ భవనము, తోఁట నాకు మిక్కిలి సంతసంబును గలుగఁజేయుచున్నవి. నిన్నరాత్రి యీ మేడ నంతయు నాకుఁ జూపుటకు నీ వొప్పుకొనలేదా?

బాలలత—అవును, ఒప్పుకొనినది వాస్తవమే. కోడి కూయుటకుఁ బూర్వమే యని చెప్పలేదు. సూర్యోదయమైనను గానక్కఱ లేదా? మన మేడలో నొక భూతము తిరుగుచున్నటుల చెప్పినారు. అది తిరుగుగది చూపెదను.

రాధ—అవును, నేను చదివినపుస్తకములలో భూతములు నివసించు భవనములగుఱించి వ్రాయఁబడియుండెను. ఏ భవంతిలోఁ

బట్టినను భూతమే. ప్రతిమేడలోను దయ్యములు తిరుగు చుండునఁట. బాలలతా! సోమరితనము వలదు. శీఘ్రముగా వెళ్ళి దంతధావన మొనరించుకొనుము. మేడను జూతము.

బాలలత—సుబ్బన్నను బిలుచుకొని వచ్చి తలుపుల తాళములు దీయు మని చెప్పవలెను.

అని చెప్పుచుండఁగ మరకతము వచ్చి సుబ్బన్నను బిలుచుకొని వచ్చెద నని చెప్పి వెళ్లెను. ఇంతలో వీరిద్దఱును గాల్యకృత్యములను నెఱవేర్చుకొని తిరిగి వచ్చిరి.

సుబ్బన్న రాఁగానే యందఱును మేడను జూడ బయలుదేరిరి. మొదటిగది మిక్కిలి యలంకరింపఁబడి యుండెను. అది చాల కాలము పూజాగృహముగ నుండెను. ఈ గదిలోనే పారంపర్యముగా కులదేవతలఁ బూజించుచుండిరి. ప్రస్తుత మింటియజమానుని పూజ కొఱకు వేఱుగృహమును గట్టించినందున, దీనిలోఁ బటములుమున్నగు వానిని బెట్టి మూసియుంచిరి. నానావిధములైన పటములు, బొమ్మలుననేకము లుండుండెను. అవన్నియు నెంత ప్రాఁతవడినను మంచిపనితనమును జూపుచుండెను. పుస్తకభాండాగారములు, పాత్రసామాను లుంచిన గదులు, వస్త్రములు పెట్టినగదులు, నగలు భద్రపఱచిన పెట్టెలు, మంచము లుంచినయఱలు, నన్నిఁటినిఁ జూచుచుఁ బోవుచుండిరి. "ఇది వఱలో నెన్నియో గదులు చూచితిమిగాని భూత మున్నగది చూడ లేదే" యని రాధ యడుగ, "ముత్తమ్మగదియా" యని భయపడి సుబ్బన్న యడిగెను. దానికి బాలలత "ఛీ! సుబ్బన్నా! నోరు మూయుము. ఊరక నోఁటికి వచ్చినటుల ప్రేలకుము" అనెను. సుబ్బన్న 'ప్రేలుచున్నానా? నాకుఁ బిచ్చియనుకొంటిరా? నేనే మెన్నోమారులు పిశాచమును జూచియున్నానే' యన, రాధ 'నీవు నీకన్నులతోఁ జూచితివా?' అని యడుగ, సుబ్బన్న 'అవును' అని గదితలుపు తెఱచెను. ఆ గది యితరగదులవలెఁ గాక, యేయలంకారమును లేనిదియై యుండెను. "ఈ గదిలోనే యరుళ్నాథుని శవమును దెచ్చి పెట్టిరి" యని యఱచి భయపడి క్రిందఁబడెను. పిశాచమును బోలిన

రూపము వానికిఁ గనఁబడి మెల్లగ నడచి తటాలున మాయమయ్యెను. "అదిగో! పిశాచము పరుగెత్తుచున్న"దని యఱచి 'మీరు దయ్య మనిన నమ్మరు. అదిగో! పరుగెత్తుచున్నది; చూడుఁ'డనెను. రాధ భయపడి నిలిచెను. బాలలత ధైర్యముతో 'సుబ్బన్నా! నోరు మూయుము, వదరకుము. ఆమె మా యుపాధ్యాయ యైన కుంతలమ్మ. తనకు వరునిగా నిశ్చయింపఁబడిన యరుళ్ళానఘునిశవ విగ్రహ గదిలోఁ బెట్టఁ బడినందున నామె యీ గదికిఁ బలుమాఱు వచ్చుచుండునట్లు మాయమ్మ చెప్పఁగా వింటిని." అనెను. దాని కతఁడు 'తాళముచెవి నాయొద్దనేకదా యున్నది. కుంతలమ్మ యీ గది కెట్లు వచ్చినది? తాళముయొక్క రంధ్రముగుండ దూరినదా?' యన బాలలత "ఈ గది కింకొక తలుపు వెనుకభాగమున నున్నది. ఆ తాళపుఁజెవి కుంతలమ్మయొద్ద నుండును. నీకుఁ దెలియదా?" అనెను. "ఆమె కుంతలమ్మ యైన నింతలో మటుమాయ మగునా" అని సుబ్బన్న సందేహించుచుండ, బాలలత 'మన మందఱ మటకు వచ్చుట కామె కిష్ట ముండదు. మన మామెను జూడఁగూడ దని తొలఁగి యుండవచ్చును.' అని వెంటనే సుబ్బన్న నట వదలి కుంతలమ్మ పోయినవైపున కిరువురు బాలికలును వేగముగా నడచి మంచిగాలి వచ్చు నింకొకగది చేరిరి. ఆస్థలమునకు వీరు వచ్చునప్పటికిఁ గుంతలమ్మ చేతులు రెండును జోడించుకొని ధ్యానముజేయుచుండెను. ఆమెను జూచి బాలలత, 'అమ్మా! మేఁ మష్టకోణములగది చూడ వచ్చినపు డా గదిలో గూర్చొని తరువాత మాయమైనది మీరే కదా!'యన నందులకుఁ గుంతలమ్మ 'అవును నేనే' యనెను. 'నే నిదే పోయి సుబ్బన్నను బిలుచుకొని వచ్చెదను. అతఁడు 'ముత్తవ్వ, ముత్తమ్మ, పిశాచ' మని భయపడి పరుగెత్తెను.

అని కుంతలమ్మయొద్ద సెలవు తీసికొని వా రిద్దఱును దిరిగి వచ్చుచుండినపు డక్కడ నుండు పెద్ద చావడిలో నమృతవల్లి వీరి కెదురువచ్చెను. వీరిని గాంచి "నా చిన్నిబిడ్డలారా! ఉదయమంతయు మేడను జూచుటతోఁ బ్రొద్దుపుచ్చితిరా?" యని యమృతవల్లి పలుక రాధ, "అవును, సార్థకము చేసితిని. అన్నిఁటినిఁ జూచితిమి.

వినోదములు, వింతలు, సంతోషదాయకములు కావుగాని యచట నున్న వివిధపటములు, పుస్తకములు, వస్తువులును, మిక్కిలి యంద ముగ నుండి నా మనస్సు నాకర్షించినవి. కొన్ని కొన్ని స్థలముల నేఁ బోవునపు డేవో యద్భుతములైన భావములు నాకుఁ దట్టు చుండెను. ఈ మేడలో విశేష మేమనఁగా "అమ్మా! మీరు నమ్మె దరో లేదో! నే నొకప్పు డిట నివసించిన ట్లున్నది." అనెను. ఇట్లను నప్పు డమృతవల్లి రాధముఖమును దేఱిపాఱఁజూచుచుండెను.

అమృతవల్లి—నా కుమారీ! రాధా! నీ వెఱింగినంతవఱకు నీ జన్మ వృత్తాంతము చెప్పుము. హైమవతీకళాశాలలో మాత్రము నీవు చాలకాల ముండినటుల నా బాలలత చెప్పఁగ వింటిని.

రాధ—అవును, హైమవతియొద్ద పదిసంవత్సరము లుంటిని.

అమృతవల్లి—అక్కడఁ జేరుటకుఁ బూర్వ మెక్కడ నుంటివి?

రాధ—(అధైర్యపడి) కోయంబత్తూరులో నుంటిని.

అమృతవల్లి—నీ తండ్రి కేమిపని?

రాధ—నా తండ్రి యెవరో తెలియదు. నే నెఱుఁగనే యెఱుంగను.

అమృతవల్లి—అయిన నినుఁ బెంచిన దెవరు?

రాధ—మా తాత.

అమృత—అతఁడు బ్రదికియున్నాఁడా?

రాధ—లేదమ్మా, చనిపోయినాఁడు. (అని యేడ్చెను.)

అమృతవల్లి—అయితే మీ చెల్లెలుతప్ప మఱియెవరును నీకు బంధువులు లేరా?

బాలలత అక్కడ లేకుండుటచే నమృతవల్లి రాధ ననేకప్రశ్నముల నడుగుటయు, రాధ యమృతవల్లికిఁ దగినట్లు జవాబు లిచ్చుటయుఁ దటస్థించెను. అంత నమృతవల్లి కొంచెము కినుక వహించి బాలలత యిటువంటి దరిద్రురా లగు రాధను గాకున్న నింకెవరి నైనను దన స్నేహితురాలుగఁ జేసికొనఁగూడదా! యని తనలోఁ దా ననుకొనెను.

# పదునాల్గవప్రకరణము.

## అతిథులు.

పచ్చయప్పగారిమేడను జేరిన మూఁడవదినము సాయంకాలము రాధ తన చెల్లెలైన యలమునకు, జరిగిన సంగతు లన్నియు జాబువ్రాయుచుఁ గూర్చుండెను. అప్పుడు బాలలత యాగదికి వచ్చి "అంబికాపతి నాకొక చక్కని యుత్తరము వ్రాసెను." అని నుడివెను.

రాధ—ఏమి విశేషములు?

బాల—పినాకపాణి, దండపాణి యనువారలతో నంబికాపతి యిక్కడకు వచ్చుచున్నటుల నతఁడు వ్రాసెను.

రాధ—వీరిద్దఱిలో బాలలతను వివాహము చేసికొను వా రెవరు? (అని నవ్వుటాలకు నడిగెను.)

బాల—(సిగ్గుచే తలవంచుకొని, చిఱునగవుతో) ఏమీ! తటాలున ముందువెనుకలు తెలియక యి ట్లడిగితివి!

రాధ—చెలీ! సిగ్గువిడిచి పలుకుము; రాధయొద్ద నీ రహస్యములు దాఁపనగునా? మనస్నేహబంధమునకు రహస్యములు ప్రతిబంధకములు గదా!

బాల—నీ వొక మంత్రవాదిని వే.

రాధ—అవును, నాకు మంత్రములు వచ్చును. దీనిని గుర్తెఱుంగక పోవుట యెవరిలోపము? చెప్పుము, దండపాణియా?

బాల—(మెల్లగ రాధచెవిలో) కాదు; పినాకపాణి.

రాధ—అట్లయిన నీ వివాహము నిశ్చయ మైనదా?

బాల—నేను చిన్నపిల్లగ నున్నప్పుడే మాయమ్మ నన్నుఁ బినాకపాణి కిచ్చునటులఁ జెప్పెను. పినాకపాణితండ్రి వరదరాజుగారు నాబాల్యముననే నన్నుఁ గాంచి, తన కోఁడలుగా గ్రహించుటకు నిశ్చయించెను. అంతమాత్రము నాకుఁ దెలియును.

రాధ—ఓహో! అటులనా? ఈ విషయము ముందే నిశ్చయ మైనదా? ఇదివఱ కెన్నఁడును నాతో దీనిని ప్రస్తావింపలేదుగదా!

బాల—కారణము నిశ్చయము కాకుంటయే. పినాకపాణితండ్రి దీనిని రహస్యముగా నుంపు మని చెప్పిరి.

రాధ—అతఁ డందగాఁడేనా?

బాల—అవును, మన యిద్దఱికన్న వన్నెగలవాఁడు. విశాలములై యందములైన నేత్రములు గలవాఁడు.

రాధ—నీ కతనియెడఁ బ్రేమ కలదుగదా?

బాల—నాప్రాణ మంతయు నతనియందే యున్నది. ఒకవేళ నతఁడు నన్ను వరించునో, వలవఁడో యని సందేహము. రాధా! నీవలె నే నంత చక్కనిదానను గాను. అట్లున్న నా కీ భయమే యుండదుకదా!

రాధ—నీమన స్సంతయు నతనియందే యున్నదనుట నిశ్చయముగదా!

బాల—అందులకు సందేహ మేమి?

రాధ—దండపాణి యెవరు?

బాల—అతఁ డొకక్రొత్తవకీలు. అంబికాపతికి స్నేహితుఁడఁట. అతనిని నే మున్నెన్నఁడు చూచినదిలేదు. అంబికాపతిమీఁద నమ్మ కతిప్రేమ. ఆతనిఁ జూచిన మా యమ్మకు శరీరమే తెలియదు. విందులు, వినోదము లనేకము జరుగును.

ఆ మధ్యాహ్న మమృతవల్లి తనకుమారిని మాత్రము తీసికొని గుఱ్ఱపుబండి నెక్కి యాయూరిలోఁ బెద్దమనుష్యుల యిండ్లకుఁ బోయెను. రాధను బిలుచుకొని పోలేదు. వా రిరువురును బండి నెక్కి పోవుచున్నప్పుడు రాధ చిఱునగవుతో "పోయి ర"మ్మని బాలలతతోఁ జెప్పి వారినిఁ బంపి భవనములోనికిఁ దిరిగివెళ్లెను. రాధ యామేడచుట్టును దిరుగుచుఁ గన్నుల కందముగాఁ గనఁబడు పక్షులను, నాకాశమును, వృక్షములను జూచుచుఁ దోఁటలో విహరించుచుండెను.

“మంచిది. నన్నుఁగూడ వారితోఁ బిలుచుకొని పోవుటకు నమృతవల్లి కిష్టము లేదు. బాలలత నిష్కల్మషస్వభావము గలది. కానిమ్ము. నా కిది మంచికాలముకాదు. వేళకుఁ దగినట్లు నడుచుకొన వలయునుగదా! పూర్వకర్మానురూపముగ నెద్ది భవితవ్యమో యది కలుగును. ఏ త్తొకటి నాఁటిన చెట్టొకటి మొలచునా! ఏది సంభవించి నను మనమేలుకొఱకే. సుఖదుఃఖము లనుభవైకవేద్యములు. బంధ మోక్షములకు మనస్సే కదా కారణము. సర్వప్రయత్నములచేతను మనస్సును నిగ్రహించినఁ గష్టసుఖములు తుల్యప్రభావములు గల వగును. అమృతవల్లి నన్నుఁ బిలుచుకొని పోకపోయినంతమాత్ర మున నాకుఁ గలిగిన లోప మేమియు లేదు. హాయిగా స్వభావచిత్ర ములను గమనించుచు నానందము నొందుచు నీతోఁటలోఁ దిరుగు చుందును.” అని రాధ తనలోఁ దానే యాలోచించుకొనుచుండెను. ఇట్లనుకొనుచు నాయింటితోఁటను దాఁటి కొంచెముదూరము వెళ్లెను. నడిచి నడిచి నలుదిక్కుల నవలోకించి, నిర్జనప్రదేశసౌఖ్యము నను భవింపుచు, నచ్చట పచ్చికనేలమీఁదఁ గూర్చుండెను. అది రత్న కంబళిని మించి ప్రకాశమానముగ నుండి నేత్రముల కానందముఁ గల్పించుటయ కాక, కాలిక్రింద మెత్తని పఱపువలె నుండెను. ఆనంద పారవశ్యమున రాధ తృణముమీఁదఁ నొకపద్యమును జెప్ప నుద్యమించి—

సీ. కాలితోఁ ద్రొక్కంగఁ గారుణ్య మూనవే
సరగునఁ గడు మృదుశయ్య వగుచు
పస చెడ ని న్నోయ నసువు లర్పింపవే
సారమౌ నతులితాహార మగుచు
వెంటిగా బంధించి పేన సహింపవే
దంతావళులఁ గట్టఁ ద్రాఁడు వగుచు
నిర్ఝరనిర్గతుల్ నిలిపి కాపాడవే
ప్రాణప్రదంబగు పట్టు వగుచు

తే. గీ. సరసక్రీడ మెప్పింప సత్ప్రసన మగుదు
శాన్తి బోధింపఁ బరమవేదాన్తి వగుదు
నీతిఁ గఱపంగ నన్నిఁటఁ బ్రీతిఁ దనరు
గురుఁడ వీవు కవినుతసద్గుణము! తృణమ!

అని తృణమును సంబోధించుచుండఁగ నెవరో యొక మనుష్యుఁ డామె యొంటిగా నుంటఁ గనిపెట్టి యామెకడకు వచ్చుచుండెను

అతఁడు స్థూలకాయుఁడు కాకుండినను, బలవంతుఁడుగఁ గనఁబడెను. ఉన్నతభుజములు గలవాఁడు. విశేషమైన యందగాఁడు కాకపోయినను వికారస్వరూపముగలవాఁడుమాత్రము కాఁడు. ఆ నడక చప్పుడు విని యాయువకుని గాంచి భయపడిన రాధను జూచి, "అమ్మా రాధా! నారాకవలన మీకు భయ మక్కఱలేదు." అని మరియాదతోఁ బలుక, రాధ "ఇతఁడు నన్ను పేరుపెట్టి పిలుచుచున్నాఁడు. నా వృత్తాంత మెఱిఁగి యుండవలయు. సరే! అతఁడే యయి యుండవచ్చును" అని తలఁచి చాల ధైర్యముతో నతని నవలోకించి 'మీరేనా అంబికాపతి'అని ప్రశ్నించెను. అంబికాపతి మొదలగువారు మఱునాఁడు వచ్చునటుల బాలలత చెప్పియున్నందున నొకవేళ నొకదినము ముందే వచ్చినారేమో యనియు, నంబికాపతి తోఁటఁ జూఁడ వచ్చియుండు ననియు రాధ యూహించెను. అంత నా యువకుఁడు "అమ్మా! నే నంత గొప్పవాఁడనుగాను. నన్ను కుప్పుస్వామి యందురు. నే నొక వకీలును. నాపేరు మీరు మేడలో వినియుండవచ్చును." అని పలుకఁగ రాధ పూర్వవృత్తాంత మంతయు జ్ఞప్తికిఁ దెచ్చుకొని "అవును, విని యున్నాను. రెండుమూఁడు పర్యాయములు మీపేరు వింటిని." అనెను. 'మేడలో బాలలతయు, నమృతవల్లియు సౌఖ్యముగ నున్నారా?' యని యాతఁడడుగ రాధ "చాల సౌఖ్యముగ నున్నారు, మీరు పోవచ్చును, మఱచితిని. అమృతవల్లియు నామెకొమరితెయు నింటలేరే! ఊరిలోనికిఁ బోయియున్నారు." అనెను. అట్లయిన వారిని జూచుటకు నేను దిరిగి యింకొక దినము రావలసియున్నది. అమ్మా! మీరెంత దూరము త్రోవ తప్పివచ్చితిరో యెఱుఁగుదురా?" అని ప్రశ్నింపఁగా, రాధ

"అవును, కొంచెము దూరము వచ్చినది నిజమే. ఏ మార్గముగాఁ బోయిన నిల్లు చేరుదునో దయచేసి చెప్పుఁడు" అని వేఁడుకొనెను.

కుప్పుస్వామి—మీకు ముం దీసంగతి తెలియనియెడలఁ జాల కష్టము. ఇక్కడ పెక్కు డొంక లున్నవి. ఆ చిక్కుత్రోవలలోఁ జిక్కుకొనిన నింటికిఁ బోవుట దుర్లభము. మీరు సెల విచ్చిన మిమ్ముఁ గొంతదూరమువఱకు వచ్చి సరియైన మార్గమున విడిచెదను.

రాధ—మీకు శ్రమయిచ్చుట నా కిష్టములేదు. మీరు మీత్రోవను బోవచ్చును. నాకు మేడకుఁ బోవు దారి తెలియును.

అని వెడలిపోయెను.

ఆ దిన మట్లు ముగిసెను. మఱునాఁ డుదయమున రాధ మరకత ముచేఁ బ్రబోధింపఁబడెను. తరువాత మరకత మెంతచక్కగా నలంకరించినను రాధ కది తృప్తిగాకుండుటఁజేసి నగలను దీసి, జడ విప్పి, ముడి వేసికొని, గొప్పచీరను విడిచి సాధారణమైన చీరను గట్టుకొనెను.

మరకతము—ఇట్లు మీ రెప్పుడును గావింపలేదే? ఇప్పుడు చేయనగునా?

రాధ—ఇదియే నా కలవాటు.

రాధమనస్సులో సౌందర్యవతుల కలంకార మక్కఱలేదని యుండెను. ఇట్లొనరించుకొని మేడకిటికీదగ్గఱ కూర్చొని యామె యేమేమో తలపోయుచుండెను. ఆ కిటికీద్వారా వీధిలో వచ్చెడివారు, పోవువారు కనఁబడుచుందురు.

వచ్చెద రనుకొనినవారు వచ్చి దిగిరి. అమృతవల్లి పట్టంచుచీర కట్టుకొని, తలమొదలు కాలువఱకును వజ్రవైడూర్యాది నవరత్నములచేఁ జేయఁబడిన యాభరణముల నలంకరించుకొని, యెదురుగా వచ్చి, వారిని సన్మానించి భవనములోనికిఁ బిలుచుకొనిపోయెను. ఆవచ్చినవారికి జరుగవలసిన సపర్య లన్నియుఁ గ్రమముగ జరిగిన పిమ్మట వారు మేడపైకి వచ్చిరి. ఆ విషయము రాధకుఁ దెలియనేలేదు.

అంబికాపతి రాధను జూచి యప్సరస కూర్చున్నదని తలఁచి భ్రమించి బాలలతతో "బాలలతా! మన్నింపుము. ఆగదిలోనెవరో యొక స్త్రీ కూర్చొనియున్నది. తెలియక నేఁ బోయితిని." అనిచెప్పఁగా బాలలత రాధకడ కేతెంచి "రాధా! వీరే నేఁ జెప్పిన యతిథులు. అతఁడు పినాకపాణి, యితఁడు దండపాణి, యిదిగో నాయన్న యంబికాపతి." అని చెప్పి వారి ముగ్గురితో "ఈమె నా ప్రాణస్నేహితురాలు, రాధ" అనెను.

రాధ వారిని నుచితరీతిని సన్మానించి వారితోఁ జాల గంభీరముగ మాటాడసాగెను. అంబికాపతి యామె సౌందర్యమున కచ్చెరువొంది యామెను ఱెప్పవేయక చూడసాగెను. అమృతవల్లి చూచి యధరోష్ఠమును బైదంతములచే నొక్కి, భ్రూలతలు ముడిచి, కనుఱెప్ప లెత్తి "అయ్యో! ఇది యొక నాగుఁబాము. తెలియక దీనికిఁ దా విచ్చితిని. దైవమా! ఈ నిర్భాగ్యురాలు నాకుఁ గోడలు గాకుండుఁగాక! కానిమ్ము. ఎట్లయినను దీని నిల్లు వెడలఁగొట్టవలయు"నని తన మనస్సులో నిశ్చయించుకొనెను.

ఆ యూరిలో భాస్కరయ్య యను కోటీశ్వరుఁ డుండెను. ఆయనభార్యపేరు భామిని. వీ రిరువురును మఱుసటి దినము ప్రాతఃకాలమునఁ బచ్చయప్పగారియింటికి వెళ్లి క్రొత్తగా వచ్చిన యంబికాపతి మొదలగువారినిఁ దమ యింటికి విం దారగింపఁ బిలిచిరి. వారు మఱచిపోకుండ నా విందునకు నమృతవల్లిచుట్ట మగు కుప్పుస్వామినిఁ గూడ నాహ్వానించిరి. అందఱును వారియింటికిఁ బోయి విం దారగించి తాంబూలములను వేసికొనిరి. భాస్కరయ్యగారికి భవాని యను కొమరిత గలదు. అమృతవల్లి యామెనుగూర్చి భామినితో మాటలాడుచుండెను. రాధ యచ్చటఁ గాంచినయద్భుత మేమనఁగా: నందఱో గొప్ప గొప్పవా రుండఁగా కుప్పుస్వామి బాలలతతో మిక్కిలి చనవుగా మాటి మాటికి మాటలాడుచుండుట యను విషయము.

భాస్కరయ్యగారి యింటినుండి యందఱును వారివారి స్వగృహములకు వచ్చి చేరిరి. మరునాఁటి మధ్యాహ్నము భాస్కరయ్యగారి గృహములో హరికథ కావున వీరి నందఱను వారు పిలిచిరి. అక్క-

డకుఁ బోవుటకుఁ బూర్వము బాలలత రాధకడకు వచ్చి "మన మీా దినము హరికథకుఁ బోవుచున్నాము. నీ వే చీరను గట్టుకొనెదవు?" అని యడుగ "నే నక్కడకు రానుగదా!" యని రాధ చెప్పెను. 'నీవు వచ్చుటలేదా?" అని బాలలత యాతురతతో నడిగెను. రాధ యొకనిమిష మూరకుండి, చెలిమనస్సు నొప్పింప నిష్టము లేక "మీా యమ్మ నన్ను రమ్మని పిలువలేదు. అంతియకాదు. అక్కడ నంద అను నాకుఁ గొ్రత్త. నే నెందుల కక్కడకు రావలెను? నీవు నా కొఱకు మీా యమ్మతో వ్యర్థముగా మాటలాడి లేనిపోని సంకటముఁ దెచ్చిపెట్టుకొనకుము" అనెను.

బాలలత——మాటిమాటికిఁ బోవుచుండినఁ గదా కొ్రత్తవారు స్నేహితు లగుదురు? నీ వవశ్యము వచ్చితీరవలయును.

అని రాధతోఁ జెప్పి తన తల్లియొద్దకు వెళ్లి యెన్నియో విధముల రాధవిషయము చెప్పిచూచెను, బతిమాలెను, వేడుకొనెను. ఏమిచేసినను బ్రయోజనము లేకపోయెను. ఆ హరికథకు రాధ వచ్చుట కాటంకము లెన్ని కావింపనగునో యన్నియు నొనరింపఁబడెను. భామినీ భాస్కరులు రాధ యెవ రైనదియు మొదటి దినమునఁ దెలిసికొనలేదు. భామినికిఁ గూడ చాల పని యుండెను. హరికథకు నిద్దఱు తప్ప తక్కిన యందఱును వెళ్లిరి. వా రిరువు రెరనఁః బినాకపాణియు, రాధయు. పినాకపాణికి మొదటిదినఁపువిందు సరిపడనందున నతఁడు కడుపునొప్పితో బాధపడుచుండెను.

అమృతవల్లి యందఱుఁ దోడ్కొని హరికథకుఁ బోవుటకుఁ బూర్వము రాధ యితరవిషయములఁ గాలము వ్యర్థపుచ్చకుండునట్లు చేయుటకై రెండుగంపల జాజిపూవులను, గులాబిపూవులను జిఱునగవుతో రాధకడకుఁ దెచ్చి "అమ్మా! రాధా! నీవు నిన్న బాలలత కొఱ కొక దండ గుచ్చితివే, దానిని నేఁ జూచితిని. దండలు గట్టుటలో సమర్థురాలవు. వినాయకునకుఁ బండ్రెండు పెద్దమాలలు గట్టి సమర్పించెద నని మ్రొక్కుకొంటిని. ఈ రెండుగంపలపూవులను బండ్రెండుమాలలు కట్టుము. ఈ సాయంకాలము తప్పక యవి కోవెలఁ జేరవలయును."

అని నుడువ విని, రాధ యధికసంతోషమునొంది చిఱునగవుతో, నాకెప్పు డును స్వామికార్య మొనరించుటయం దధికోల్లాసము, కుతూహలము కలదు. తప్పక మీ యభీష్టము నెఱవేర్చెదను. ఇట్టిభాగ్యము నాకుఁ గలిగెఁగదా!' అని మాలలు కట్టుట కొప్పుకొనెను. అమృతవల్లి "రాత్రి పదిగంటలవఱకు నెడ తెగని పని కల్పించితి" నని యుప్పొంగెను.

అద్దములోని ప్రతిబింబమును వలె నీమెహృదయమునందలి కోరికను రాధ గ్రహించె నని యమృతవల్లి తలంపలేదు. రాధను మోసపుచ్చితినిగదా యని యుప్పొంగెను. అంబికాపతియును దాను బయటికిఁ బోకమునుపు పినాకపాణికడ కేతెంచి "ఏమోయీ! ఏమి యీ నిర్బంధము? ఈహరికథ యెవరికిఁ గావలెను? నాకును దలనొప్పి యని నేనును నిలిచిపోదునా ? నిన్నిటుల నొంటరిగా విడిచి నేఁ బోవుటకు నాకుఁ గాళ్ళురాకున్నవి. నా కిష్టమే లేదోయి" అని పలుకఁగాఁ బినాకపాణి, 'అట్లు నీవు నిలుచుట యమృతవల్లికి నిష్ట ముండదు. అదిగో! యందఱు నిన్నుఁ బిలుచుచున్నారు, నీవు పోయి త్వరగా ర'మ్మని చెప్పి పంపెను. అందఱును వెళ్ళిరి.

పినాకపాణి తలనొప్పివలన బాధపడుచు మూలుగుచుండెను. రాధ తనగదిలో మాలికలను గట్టుచుండెను. ఈమె స్వామిమాలలు గట్టుటలో నేర్పరి యగుటచే నారెండుగంపల పూవులను మూఁడు గంటలలో నతిమనోహరముగా నితరులకు నలవిగానివిధంబునఁ బండ్రెండు మాలలు గట్టిపెట్టెను. జాజిపుష్పములమాలఁ గట్టుట బహు కష్టము, చిక్కుపని. సామర్థ్యవిశేషంబున నాపని ముగించి భగవంతుని ధ్యానింపఁదొడంగెను.

శా. శ్రీమంతుండయి యాత్మమాయ జగముల్ సృష్టించి తా నన్నిఁటన్
భూమాకారత సంప్రవిష్టుఁడగు నేపుణ్యుండు, భూతంబులం
దేమాన్యుండు వసించు నాత్మమయుఁడై యిచ్ఛాక్రియాజ్ఞానరూ
పామేయప్రభుతాసమేతు నతనిన్ ధ్యానింతు నశ్రాంతమున్.

చ. జప మొనరింప నీదుకృప చయ్యనఁ గల్గు నటంచుఁ జూడఁగా
నపరిమితాఘరాశిమలినాత్మను నాయెడ భస్మమౌ నయా !

తప మది, మె ట్లటన్నఁ బరిత ప్తమహాయసగోళకంబునం
దుపమగ నుంచు నీరువలె నుండును; గావవె యార్తరక్షకా!

క. భంగం బన్నివిధంబుల
సంగం బెడబాపఁజేయ సరసుఁడ వీవే
సంగం బెడబాపుటకై
భంగించెదు నన్ను సకలభంగుల రంగా.

క. సంకల్పజాత మంతయుఁ
బొంకముగా నీదుమూర్తిఁ బొడమెదు నని నా
కింకర్ణ దెలియ దనికదా
సంకటములు? వలదు స్వామి! శంక నశించెన్.

క. నాజననమాదిగా నా
కేజాడం జూడ దైవమే గతి యని నే
నోజ మనంబును నీపద
రాజీవములందు నిల్పి రంజిలుచుందుర్.

క. నీమహిమల వర్ణింపఁగ
నామావళి చాల దన్న నాపలుకులచే
నేమగును? బాలికన్ గద!
నీముద మే పలుకుచుండ నీదయ రామా!

క. త్రికరణశుద్ధికి మించిన
సుకరం బగు మార్గ మున్నె? సూరిజనములే
ప్రకటించిరికద నీ సే
వకు నిది ముఖ్యంబ యనుచు; వనజాక్ష! హరీ!

క. ఆశుద్ధి నాకు ని మ్మిఁక
నాశాహరణంబు సేయు మతిసుకరముగాఁ
బాశము తెగు నీసేవలఁ
గాశీవాసంబొ యింటఁ గల్యాణంబో.

సీ. శ్రీరమారమణాయ శీతాంశువదనాయ
వేణుగోపాలాయ తే నమోస్తు

దరచక్రహస్తాయ దైవప్రశస్తాయ
దీనసంత్రాణాయ తే నమోస్తు
పింఛావతంసాయ పీతాంబరాంసాయ
దానవనాశాయ తే నమోస్తు
మురదైత్యహననాయ మునివర్యమననాయ
గానవిలోలాయ తే నమోస్తు
గీ. ధీరవర! మేరుగంభీర! తే నమోస్తు
దేవదేవాయ కృష్ణాయ తే నమోస్తు
దివ్యమంగళరూపాయ తే నమోస్తు
దీనమందార ! గోవింద ! తే నమోస్తు.

అని ధ్యానంబు సలిపి యొకపుస్తకము నెత్తి చదువనెంచి పుస్తక భాండాగారమునకు వెళ్ల, నక్కడఁ దలనొప్పితో బాధపడుచుండిన పినాకపాణి, రాధ హరికథకుఁ బోలేదనుసంగతి తెలియనివాఁడుగాన, దేవతవలె మందగమనముతో వచ్చినరాధను గని, పడక విడిచి, దిగ్భ్రమఁ జెంది లేచి నిలిచెను. పినాకపాణి హరికథకుఁ బోవని సంగతి తెలియని రాధయు నులికిపడి ధైర్యముఁ దెచ్చుకొని "ఎవరును లేరు, భయపడకుము" అనిచెప్పి తిరిగిపోవుటకై యత్నించుచుండ, మరలఁ బినాకపాణి "నన్నుఁ జూచి భయపడి వెళ్ళనక్కరలేదు. మీరు తిరిగి వెళ్లుటకై నేను లేవలేదు. మీరు హరికథకు వెళ్లనివిషయము నాకుఁ దెలియదు" అన, రాధ, 'నేనైదైనఁ బుస్తకమును దీసికొనిపోవుటకై వచ్చితిని. మీ రిక్కడనున్నది తెలిసిన నే నిక్కడకు వచ్చియుండను.' అనఁ బినాకపాణి 'అమ్మా! ఇటు దయచేయుఁడు. అట్లనకుఁడు' అనెను. వా రిరువురకు కీక్రిందివిధముగా సంభాషణము జరిగెను.

రాధ—మీశరీరస్థితి యెట్లున్నది?

పినా—నాకుఁ దలనొప్పి కొంచెము నెమ్మదిగా నున్నది. మీ రిక్కడకు రాఁగానే మందువేసినట్లు నాబాధ నయమయ్యెను. దయచేసి కొంతవడి యిక్కడ నిలిచి నాతో సావకాశముగా మాటాడఁగూడదా?... మీ రేల హరికథకుఁ బోలేదు?

రాధ—అమృతవల్లి నన్ను రమ్మని పిలువలేదు.

పినా—(ఆశ్చర్యముతో) రమ్మని పిలువనేలేదా!

రాధ—నన్నామె పిలువవలె నని నే నెదురుచూడలేదు. నన్ను బిలుచుట కామెకుఁ దగినచుట్టఱికమును లేదు.

పినా—బాలలతకూడ పిలువలేదా?

రాధ—నన్నుఁ బిలుచుకొనిపోవలెనని యామెకు నాశ మెండుగ నుండెను. ఎంతయోఁ బ్రయత్నించెనుగాని సాధ్యపడలేదు. బాలలత సాధుశీల, కల్ల, కపట మెఱుంగని భాగ్యశాలిని. పుణ్యమే యాకారముగఁ దాల్చినది.

పినా—అమృతవల్లి చేసినకార్యమునకు నాకుఁ గారణము గోచరించుటలేదు. కాని యామె య ట్లొనరించుటచేతనేకదా మీాతో సంభాషించెడి సౌఖ్య మబ్బెను.

తరువాత వీ రిద్దఱును బుస్తకములను గుఱించియు, విద్యను గుఱించియు, సంఘసంస్కరణమును గుఱించియు ముచ్చటించిరి. రాధను జూచినప్పటినుండియుఁ బినాకపాణికిఁ దలనొప్పి నెమ్మదించెను. సాయంకాలము కాఁగానే వా రందఱును దలనొప్పితో నుండిన పినాకపాణి యెట్లున్నాఁడో యని యింటికి వచ్చుటయే తడవుగ నతని కడకు వచ్చి పుస్తకాలయముఁ బ్రవేశించిరి. రాధ యొకపుస్తకమును దనయొడిలోఁ బెట్టుకొని చదువుచు, దానిలోని పటమును బినాకపాణికిఁ జూపించుచు నుండుటయుఁ బినాకపాణి శ్రద్ధతో, భక్తితో వినయముతో వినుచుఁ జూచుచు నుండుటయు నమృతవల్లి చూచి యత్యాగ్రహముతో "మాలలు కట్టుట ముగించితివా?" అని రాధ నడుగఁగ, మూఁడుగంటలలోనే ముగించితినమ్మా! నాగదిలో నున్నవి. వినాయకునికోవెల కనుపవచ్చును." అనెను. మనస్సులో నుండు కోపము పొంగి పొరలి వచ్చుచుండెను. కాని యమృతవల్లి యెట్టివిపరీతదుస్స్వహామనోభావములను గూడఁ దనహృదయపేటికయందు భద్రపఱచి తాళము వేయఁగల శక్తికలదికాన మహాసంతోషమును జెందినదానివలె "రాధా! నీ వెంత గడుసరివి! నీవు చేసిన యుపకారము మఱచిపోలే నమ్మా! స్వామికార్యము నెరవేర్చితివి! నాకు నిన్నుఁ జూచిన బ్రహ్మానందముగా నున్నది!" అని పలికి లోనికిఁ బోయెను.

---

# పదునేనవప్రకరణము.

## కామాక్షయ్యగారు.

పశ్చిమసముద్రతీరమున నొక చిన్నకొండ మీఁదఁ గళ్ళికోటకు రెండుమూఁడు మైళ్ళదూరమునఁ గామాక్షయ్యగారి ప్రాసాద ముండెను. ఆనాఁ డలము హైమవతిదగ్గఱ సెలవు గైకొని రైలు నెక్కి వేపూరులో రైలు దిగి గుఱ్ఱపుబండి నెక్కి కామాక్షయ్య గారి భవనముఁ జేరెను.

హైమవతి యుత్తరము వ్రాసి పంపిన రాత్రియే యలము ప్రయాణ మయినందున జాబు చూచికొని బండి నంపుటకు కామాక్షయ్యగారికి నావకాశము లేకపోయెను. అల మా కొండమీఁది యెండను గాంచి, యెండయు నింత సౌఖ్యకరముగ నుండునా యని తలంచుచు నా భవనములకుఁ బోయెను. త్రోవలో నెక్కడఁ జూచి నను గులాబిచెట్లు పొదలు పొదలుగా నుండెను. ఆమె యక్కడకుఁ బోవునప్పుడు వర్ష మధికముగఁ గురిసినందున భూమిమీఁది పచ్చనిగడ్డి రత్నకంబళము పఱచిన ట్లుండెను. ఏలకిచెట్లు,తోకచెట్లు,ఆకుతోఁటలు, కొబ్బరితోపులు నలమున కానందమును గల్పించెను. భవనమునఁ జుట్టునుండిన పచ్చనివృక్షము లున్నతములై యాకాశమును దాఁకు చుండెను. కొబ్బరిచెట్లు లెక్కకు మిక్కుటమై యుండెను. పనస, మామిడి మొదలగు ఫలవృక్షములు ఫలసంయుతములై యుండెను.

మామిడిచెట్లు పూచి పిందెలతో నిండియుండెను. ఎన్నఁడు నిల్లు విడిచి ప్రయాణము చేసినది కాకపోవుటచేఁ గోయంబుత్తూరు నుండి బహుదూరము వచ్చుటచే నలము మిక్కిలి శ్రమఁ జెంది యుండెను. కామాక్షయ్యగారి సుందరమందిరమును గాంచినప్పు డలమునకుఁ గడుపు నిండిపోయెను. గులాబిపువ్వుల పందిరిలో నా గుఱ్ఱపుబండి నిలిచెను. శకటధ్వని వినఁబడఁగానే యా సౌధమునుండి రమారమి నలువదివర్షముల సతీమణి వెలుపలికి వచ్చెను.

అలమును జూచి యామె 'నేనే మీనాక్షిని, నీవేనా యలము?' అని ప్రశ్నించెను. అలముచిత్తమని బదులుచెప్పెను. 'లోపలికి రమ్మా, నీవు వచ్చుచున్నావని యొకగంటకు ముందే జాబు వచ్చినది. అందు వలననే రైలుకడకు బండినిఁ బంపుటకు వీలు లేకపోయెను. ఇంటి లోనికి రమ్మా. నీవు చదువుచెప్పఁబోవు పిల్లలను జూపించెదను." అని మిక్కిలి దయతో నామె నాదరించెను. ఒక పరిచారిక యలమువస్తువుల నామెంగదిలో నుంచుటకును, స్నానభోజనాదుల నమర్చుటకును నియమింపఁబడియె. ముంగిలి దాఁటి గృహములోనికిఁ బోయినప్పుడొక పెద్ద చావడి యుండెను. ఆ చావడిలో ననేకము లద్దములబీరువా లుండెను. ఒక్కొక్కదానిలో ననేకగ్రంథము లుండెను. ఆ చావడిలో నొకబల్ల యొద్ద నొక దీర్ఘకాయుఁడైన వృద్ధుఁడు కూర్చొనియుండెను. ఆయన కుర్చీలోఁ గూర్చుండి కలము సిరాలో ముంచి యేమియో వ్రాయుటకు యోచించుచుండెను. కన్నులకు బంగారుసులోచనము లుండెను. ధరించినచొక్కాయ ప్రాచీనపద్ధతి ననుసరించి కుచ్చులు పోసియుండెను. నలుప్రక్కలను బుస్తకములు, కాగితములు, కలములు, సిరాబుడ్లు నుండెను. ఆయనవెనుకవైపునకు మీనాక్షి వెళ్లి వినయముతో "ఏమండీ" యనఁగ నాయన తిరిగిచూడకయ "ఏమే, నీకిదివఱకు లక్షపర్యాయములు చెప్పియుంటినిగదే, నేను సారస్యముగా వ్రాసికొనుచుండఁగా నిట్లు నన్నుఁ దొందరచేయుటేల? నాపని యెట్లు ముగియును? అంతయు నిలిచిపోవునుగదా!" అని పలుక మీనాక్షి చిఱునగవుతో "నేను మీకుఁ దొందరకలుగఁజేయరాలేదు. హైమవతి వ్రాసిన దే జాబు..." అని ముగించుటకుఁబూర్వమే యాతఁడు, "నీ కా జాబును నూఱు మాఱులు చదివి వినిపించితినిగదా! ఆమె వచ్చినప్పుడు వచ్చును. నే నేమిచేయఁగలను? నాపని చెడిపోవును. నీదారిని నీవు పొమ్మా. ఇప్పుడిప్పుడే మంచి యభిప్రాయములు నా మనస్సునకుఁ దట్టుచున్నవి. సమయములో వ్రాసినం గాని లాభ ముండదు. తిరిగి యూహాలు కుదురుట కష్టము. రాఁగా రాఁగా నీవు చేయునుపద్రవమునకు మేర లేదు." అని కన్నుల జోడు తీసి బల్లమీఁదఁ బెట్టి తల తడవుకొనెను. ఇట్లు మీనాక్షి తనభర్తకోపమును బలుతడవుల

ననుభవించి యారితేరినదిగాన నూరకుండి యలమువంకఁ జెయి చూపి "ఇదిగో, చూచితిరా!"అనెను. చేయి కన్నుల కడ్డముగాఁ బెట్టుకొని యలమేలును జూచి "ఎవ రది?"యని యాతఁ డడిగెను."పాపము! పుస్తకములు చదివి చదివి, నేత్రముల కవరోధము సంభవించెను. సులోచనములు పెట్టుకొనినంగాని యేదియుఁ జక్కగాఁ గనఁబడదు. మీనాక్షి "ఈమె హైమవతి పంపినపిల్ల - అలమేలు" అనెను. కామాక్షయ్యగారు తలవంచుకొని కన్నులకు సులోచనములం ధరించి పుస్తకములో నేమియో వ్రాసి కలమును బల్లమీఁదనుంచి "ఆలాగా! అలమమ్మా! సౌఖ్యమా? మీరాఁక మిక్కిలి సంతోషదాయకము. ఇక్కడ మీ కిష్టము వచ్చినటుల సౌఖ్యముగా నుండవచ్చును. నాపిల్లలు మంచిపిల్లలు. మీకు విధేయులై యుందురు" అని చెప్పి తనపని తాఁ జూచుకొనుచు వేగముగ వ్రాయనారంభించెను. "ఇంతమాత్రమైన మాటలాడినారే! ఇదే చాలును" అని అలమును మీనాక్షమ్మ తీసికొని యామెకై నిర్ణయింపఁబడినగదిలోనికిఁ బోయి యామెను జూచి "అమ్మా! మీ కీబస సమ్మతమేగదా!"అన,'నా కీస్థలము చాల ననుకూలముగా నున్నది.'అని యల మనెను. వెంటనే మీనాక్షి యలమును జూచి "మంచిబుద్ధిమతులు, సౌందర్యవతులు, నమ్రలు, నాహృదయమును గరఁగించెదరు. వారియెడ నా కత్యంతమైన ప్రేమ"అని పలుకుచుండఁగ "అమ్మా! అమ్మా! నే నక్కడకు రావచ్చునా? అమ్మా!" యని బాలికయొక్క కంఠధ్వని వినవచ్చెను. మీనాక్షి "రా! అమ్మా! నీ వసాధ్యురాలవు!" అని చెప్పుచుండు నంతలో నొకబాలిక పరుగిడి వచ్చెను. ఆపిల్ల నలము చేరఁదీసి యెత్తుకొనెను. ఆబాలిక "శీనమ్మ, నేను, నందకత్తెలము గాము. నాగమణి సౌందర్యవతిగాని, లెక్కలే రావు, చదువలేదు, ఏడుపు మొగము, గయ్యాళి." అని పలికెను. మీనాక్షి, 'అమ్మా! మాటాడకుము, చాలుచాలును. మిమ్ముల నందఱ నలము పరీక్షించి తగినటుల చదువు చెప్పునులే' అనెను. ఆబాలిక కాఱేండ్లుండెను. తక్కినవారు నక్కడకుఁ బరుగిడివచ్చిరి. "ఈమె నాగమణి, ఆమె శోణవతి" అని మీనాక్షి అలమునకుఁ దెలియఁబలికెను. శోణవతి కురూపిణియే. అయినను నామె

ముఖము చుఱుకుఁదనమును వెల్లడించుచుండెను. ఆమె తండ్రిపోలిక, మిగిలినయిద్దఱును దల్లిపోలిక. పెద్దకూఁతురు మిక్కిలి సిగ్గుగలది. అల మున కామె ముఖమునుగూడ చూపింపలేదు. ఆ పిల్లను దల్లి చూచి, "ముద్దుబిడ్డలారా! మీరు వెళ్లియాడుకొనుఁడు అలమే లిప్పుడేకదా వచ్చినది. ఆమె స్నానముచేసి భోజనముచేయవలెను." అనిచెప్పి వారిని బంపి, యలమును జూచి "అమ్మా! మేము పూర్వాచారపరాయణు లము. మాయజమానులవారికిఁ జదువుమాత్రమె ముఖ్యము. ఒకపాఠ శాలను గట్టించిరి. ఈ సాయంకాలమే సభ జరుగునఁట. వీరక్కడ నుప న్యసించెదరఁట. అందులకై యేమియో వ్రాసికొనుచున్నారు. శీఘ్ర ముగా స్నానము చేయుము. భోజనము చేసినతరువాత నన్నివిషయ ములు సావధానముగ మాటాడుదము." అని చెప్పి మీనాక్షి వెడలి పోయెను.

ఆమె యట్లలమును విడిచిపోవునప్పుడు శీనమ్మ వచ్చి యమ్మను కౌఁగిలించుకొని "అమ్మా! ఆమె చాల మంచిదిగా నున్నదే! అణఁకు వగా నుండెదను." అనెను. 'మంచిపేరు తెచ్చికొనుము.' అనిచెప్పి మీనాక్షి వెళ్లెను. అల మా యింటికి వచ్చినదిమొదలు తాఁ జూచు చుండిన వన్నియు నామెమనస్సునకు సమాధానముగానే యుండెను. అరుంధతీవశిష్ఠులవలె నా దంపతు లిరువురును, బాలికలు నలముమన స్సున కాహ్లాదము కలిగించిరి. అలము విదుషీమణి యగుటచేఁ గామా క్షయ్య తా నేమియో వ్రాసికొనుచుఁ దనతో నపుడే మాట్లాడనందు లకు శంకింపలేదు. భోజనశాలలో నాయనను దిరిగి చూచినపుడు వారు తనయెడఁ జూపిన యాదరమునుబట్టి 'నాకుఁ దండ్రివంటివారు వీరు!' అని యలము తలంచెను. అన్నియుఁ దన కనుకూలము లగుటచే నాభవ నమే కైలాసముగ నెంచి, యానందముఁ జెంది యన్నివిషయములు సవిస్తరముగ వివరింపుచు నొక లేఖను రాధకు వ్రాసి కామాక్షయ్య గారిచేతి కిచ్చి తపాలునకుఁ బంపుమని వేఁడుకొనెను. ఆ జాబు నాయన చూచి మిక్కిలి చక్కనియక్షరము లని, "ఊరాచ్చికోటలోఁ బచ్చయ ప్పగారి మేడలో రాధకు" అని చదివి; యేదియో పూర్వవిషయము జ్ఞాపకమునకు రాఁగా 'నూరాచ్చికోట పచ్చయప్పగారు' అని రెండు

మూఁడు పర్యాయములుచ్చరించి యలమువంకఁ జూచి "అమ్మా! మీ యక్క యక్కడ నున్నదా? "ఏమే! మీనాక్షీ! నీ కాస్థలము జ్ఞాపకము సందున్నదా"? అన, నందుల కామె చక్కగా జ్ఞాపక మున్నది. మొట్ట మొదట భవానీకళాశాలలో మీకు నుద్యోగమైనప్పుడు మనమందరము నూరాచ్చికోట మంచి దనుకొనుచుండెడివారముకదా ? జీతము చాల దని యిక్కడకు వచ్చితిమి" అనెను. జీతమువిషయ మటుండనిమ్మా. ఊరాచ్చికోట యజమానులు నీకుఁ దెలియునమ్మా, అలమేలూ!' అని యాతఁ డడుగ, నలము "నా కక్కడ నెవ్వరును దెలిసినవారు లేరండీ. ఆయనకూఁతురు బాలలత నాతోఁగూడ చదివి ప్రవేశపరీక్షలోఁ గడ తేరినది. ఆమెయొద్దకే మాయక్క యూరాచ్చికోటకు వెళ్ళినది. బాలలతనుమాత్రము నే నెఱుంగుదును" అనెను.

'ఆశ్చర్యము! నే నా యూరిమాట నోటఁ బలుకఁదలంపలేదు. నేఁడు తలఁపవలసి వచ్చినది. బాలలతను గుర్తెఱింగిన నామెకు ముందు పుట్టిన యిద్దఱు పిల్లలు చనిపోయినసంగతి యామెవలన మీకుఁ దెలిసియుండవచ్చును.' అని కామాక్షయ్యగారు పలుకునప్పుడు వినాయకునికోవెలయొద్ద కట్టిన యా బాలికలసమాధు లలమునకు జ్ఞప్తికి వచ్చెను. తాను బాల్యదశలో వానినిఁ జూచియుండుటచే నా సమాధులవృత్తాంత మంతయుఁ జక్కగాఁ దెలియనందున నలము "నే నాకథ నెన్నఁడును వినలేదు. అది రహస్యమైన విషయము గాకుండిన దయచేసి చెప్పిన వినఁగుతూహల మయ్యెడిని" అని నుడువఁగా మీనాక్షి 'ఆ కథను నాయజమానులే చెప్పవలెను. పూసగుచ్చి నటుల నుడువఁగలరు. ఆయన యూరాచ్చికోటలో నుండిన దొక్క వర్షమే. అప్పుడే యన్నియిక్కట్టులును బచ్చయప్పగారి యింటిలో సంభవించినవి. అలమూ! ఆకథ కథగా నుండదమ్మా! మీయక్క యక్కడ నిప్పు డుంటచే నామెకుఁగూడ నంతయుఁ దెలిసియుంట యావశ్యకము. ఇప్పు డావిషయ మామెకు వ్రాయుటకుఁ గాలము లేదు. చదువుటకును గాలము లేదు. పిల్లల నిద్రపోనిమ్మా, కథ విందువు" అనెను.

---

# పదునాఱవ ప్రకరణము

## కామాక్షయ్యగారు చెప్పిన కథ.

కామాక్షయ్యగారు కొంచెము సేపాలోచించి, "జ్ఞప్తికివచ్చినది. నే నూరాచ్చికోటలోఁ బదునెనిమిదివర్షములకుఁ బూర్వము వాసము చేయుచుంటిని. పచ్చయప్పగారు, నేను సహపాఠకులము. వారికి నా యెడ మిక్కిలి గౌరవము. ఆయనవలననే భవానీకళాశాలలో నొక వర్షము పని గలిగియుంటిని. వారికి శకటాదిసౌకర్యములు గలవు. కాన నే భవానీపురమున నుండక యూరాచ్చికోటలోనే యుంటిని. అమ్మా! అలమూ! నీవు పచ్చయప్పగారినిఁ జూచినావా?" అని యడుగ నామె లేదనిచెప్పెను. "ఆయనను బోలిన సంతోషి యింకొకఁ డుండఁడు. ఆటలయందాస, విద్యయందాసక్తి, వినోదములయందనురక్తిగలవాఁడు, సత్పురుషుఁడు. ఏరికి నే యపకారము దలంచువాఁడు కాఁడు. అందఱికి నానందముఁ గల్పించువాఁడు. స్నేహితు లనేకులు గలరు. అఖండైశ్వర్యము,నపారవిద్య. అటువంటి ప్రభువును నే నెక్కడను జూడలేదు. ఆయన చిన్నవాఁడుగా నున్నప్పు డొకచక్కనిపిల్లను వివాహమాడెను. నేనూరాచ్చికోటకు వెళ్ళకమునుపే యాయనకి వివాహము జరిగెను. అతనిభార్యపే రంబుజమ్మ. ఆమె భూలోకమున జన్మించిన రతీదేవి. భర్త కనుకూలముగ సంచరించు పతివ్రతాతిలకము. వినయ వివేకములు గల సాధ్వీరత్నము. సంగీతసాహిత్యములందు సరస్వతి. ఆమెముఖవికాసములఁ గనిన ప్రతిమనుజునకును భక్తి, గౌరవములు గలుగుచుండెను. ఆమె కిద్దఱు పిల్లలు గలిగిరి. రెండవమారు ప్రసవించినప్పు డామె కాలగతి నొందెను. నాఁటినుండియు నూరాచ్చికోట కనర్థకములే చుట్టుకొనెను. ఆపిల్లలు మిక్కిలి చక్కనివారు. అలంకారము, రంగము అను పేరులుగలవారు. తండ్రిచే నతిగారాబముగఁ బెంపఁబడుచుండిరి. వా రిరువురి నాతఁడు తన ప్రాణములతోఁ బాటు కాపాడుచుండెను. తన భార్య చనిపోయినతరువాత, వీ రిరువురైన నామెపేరిఁట నుండుటే భాగ్యమని మనస్సును సమాధానపర

చుకొని, జీవించుచుండెను. సాయంకాలము చల్లగాలికిఁ బోవునపుడు సైతము వారిరువురను దాదిచేతి కిచ్చి తనతోఁ దీసికొనివచ్చునట్లేర్పాటు చేయుచుండెను. వారి ముద్దు ముచ్చటలు, ఆట పాటలాయన కానందముఁ గల్పించుచుండెను.

“ఇటు లాబాలిక లిద్దఱు పెరుగుచుండెడుకాలమున నాతఁడమృతవల్లియను కాంతయొక్క ప్రేమపాశములఁ గట్టువడియెను. ఆమె సమర్థురాలు, మాయలాడి, యందకత్తె. కాని హీనకులసంజాత. పిల్లలయెడ నత్యంతమగు ప్రేమ కలిగినట్లు నటించెను. ఆమెహస్తములోని కీలుబొమ్మవలె యాయన యుండెను. ఆమెను నే నొక పర్యాయము చూచితిని. దూషించుచున్నా నని కోపము వలదు. చూచినప్పుడే యామె మాయలమారి యని నే నెఱింగితిని. ఆయనమాత్ర మా మాయలాడి మోసమును గుర్తెఱుంగలేక పోయెను. ప్రియములో నుంటచే నామెను వివాహముచేసుకొనెను. ఆవివాహము జరిగినప్పు డేదో నెపము బూని తాంబూలమునకుఁ గూడ వారి యింటికి నేను వెళ్ళలేదు సుమా! మొదటిభార్యతో సమాన లెవ్వరును గారు. ప్రాణమునకుఁ బ్రాణమై యుండి రెండు కన్నులవంటి యిరువురు బాలికలను విడిచిపెట్టి పోయినపుడు సంవత్సరమైనను జరుగకపూర్వమే పెండ్లిచేసుకొనెను. ఒకనాఁడు నేను బచ్చయప్పను జూచినప్పుడు యథార్థము పలికితిని. నా కేమిభయము? ‘నీ వివాహమునకుఁ బూర్వమే నా యభిప్రాయము నడిగియుండ వలసినది’ యని చెప్పితిని. నే నుద్దేశించిన విధంబున నంతయు జరిగినది. కాని నే నంతటితోఁ గథను ముగింపరాదు.

“అటుల వారి యింటిలో వివాహము ముగిసెను. మొట్టమొదట నామె పన్నిన మాయోపాయము నెఱింగించెద వినుము. ఏదియో పన్నుగడ పన్ని వారికి జబ్బుగా నుండుటచే నైదాఱు మాసములు బిల్వాదిలేహ్యములు సేవింపుచు ‘కొడుముడి’యనుగ్రామమునకుఁ బోయి కావేరిలో స్నానము లాచరింపుచుఁ గొంతకాల మచట నుండఁదలఁచి మందు పుచ్చుకొనుట మంచిదని యామె చెప్పఁదొడంగెను. ఆయనకు దేహవ్యాధి కాదు, మనోవ్యాధి. ఆమె దేనినిఁ దలఁచిన నది కొన

సాగవలెను. ఏమేమో చెప్పి బలవంతపఱచి కట్టకడపట నతఁడు బయలుదేరునప్పుడు 'ఈ చిన్నబిడ్డల నిద్దఱినిఁ దీసికొని పోయిన నక్కడ చక్కఁగ జరుగదు. కనుక నిక్కడనే వారుండుట మంచి' దని యాయనకు నామె బోధించెను. ఆయనయు దానికి సమ్మతించెను. ఆ యిరువురిబిడ్డల వదలిపెట్టి పోవునప్పు డాయన పడినపరితాపమును జూచిన యాతని ముఖ్యసేవకుఁడు గంగాధరుఁడు నాయొద్దకు వచ్చి పలుతడవులు చెప్పి కన్నీరు విడుచుచుండెను. ఆ యిద్దఱు పిల్లలను, తనకు మొదటి భర్తవలనఁ గలిగిన కొడుకు నంబికాపతిని నక్కడ వదలి యమృతవల్లి బండి నెక్కునప్పు డాయన తన ముద్దుబిడ్డలను బలుమా రవలోకించి, కన్నీరు పెట్టుకొనెను. వారా విషయమై నాకు వ్రాసిన జాబు పరితాపమును గల్పించెను. నేనును వారినిఁ జూచుటకై మనఃపూర్వకముగా వెళ్ళితిని. ఈ మువ్వురుబిడ్డలను జక్కఁగఁ జూచుచుండుటకై ఒకదాదిని వారు నియమించిరి. ఆమెకు నలువదిసంవత్సరము లుండెను. ఆమె యమృతవల్లిదగ్గఱఁ బదివర్షములనుండి దాసిగా నుండినదఁట. అమృతవల్లి యేమి చేయుమన్న దాని నామె తప్పక చేయుచుండెను. అగ్నిగుండములో దుముకుమన్న దుముకును. యజమానియెడ భక్తివిశ్వాసములుగలది. చూచుటకు సాధువుగా నుండును. దాది ఏర్పాటుచేసి యాపిల్లల నామెయధీనము చేసి యూరాచ్చిలో వారి నుంచి, యమృతవల్లి భర్తతో బయలుదేరివెళ్ళెను. ఆదాది తోఁటలో నుండిన తోఁటమాలితో స్నేహము చేసి యతనితోఁ గాలము గడుపుచుండెను. నేనుకూడ 'అయ్యో! ఈమె నడవడి చక్కగా లేదే! వేరుదాసిని గుదిర్చిన మంచి'దని వచ్చుయప్పకు జాబువ్రాయ నుంకించితిని. అంతలో నా దాది నా యొద్దకు వచ్చి భోరున నేడ్వసాగెను. ఏదో ప్రమాదము జరిగియుండునని నిశ్చయించితిని. అటులనే జరిగెను. ఆమె యాయిరువురి బిడ్డల నాడుకొనుటకు వచ్చికనేలమీఁద విడిచినటులును, నక్కడ నుండు ప్రవాహములో వారు పడి మునిఁగిపోయినటులును జెప్పెను. అయ్యది ఘోరముగా నుండెను. నా కేమియుఁ దోఁపలేదు. 'అప్పుడు నీ వెక్కడ నుంటి'వని యడుగఁగా, తాను గూఁతవేటుదూరములో నొకరితో మాటలాడు

చుంటిననిని, బదులుచెప్పెను. 'పిల్లలు మునిఁగిపోయినట్లు నీ కెవరు చెప్పిరి?' అని యడుగ 'నా కన్నులార నా పిల్లలు తమ తెల్లనిగుడ్డలతో మునుఁగుచుండఁగ నేఁ జూచితిని. గట్టు దాఁటి కడుదూరము పోయినం దున వారినిఁ దెచ్చుటకు నాకు సాధ్యముకాలేదు.' అనిచెప్పి యేడ్వఁ దొడంగెను. నే నంత యిరుగుపొరుగువారిని బిలిచి తగు మనుష్యులను బిలిపించి యాప్రవాహములో దింపి పిల్లలను వెదకించితిని. కాని వా రగపడలేదు. కావేరిలోఁ బెక్కుసుడిగుండము లున్నవి గాన నే సుడిలోఁ జిక్కుకొనిపోయిరో యని యనుకొంటిమి. శవములుగూడ కనఁ బడలేదు. తహతహపడితిమి. పది దినములకుఁ దరుదాత నాపిల్లలు పెట్టుకొనిన యాభరణములతో రెండుశవము లొక దీవియొద్దఁ గనుఁ గొంటి నని యొక బెస్తవాఁడు వానిని దెచ్చెను. అవయవములు విఱిఁగి దేహములు కుళ్లి గుర్తుతెలియకుండెను. నగలనుబట్టి వా రిరువురును బచ్చయప్పగారి బిడ్డలై యుందురని తలంచితిమి. ఈ సంగతి వెంటనే యాయనకుఁ జెప్పి పంప నానాఁడే యమృతవల్లి ప్రసవించి జబ్బుగ నుండుటచే వెంటనే పచ్చయప్పగారు వచ్చుటకు వీలు లేదయ్యెను. ఆపుట్టినపిల్లయే బాలలత. అమృతవల్లికిఁ గొంచెము దేహము స్వస్థతఁ జెందినతోడనే పచ్చయప్ప బాలలతతోను, నమృతవల్లితోను, నూరాచ్చికోటకు వచ్చి యాయిరువురు పిల్లలకును వినాయకుని కోవెలకడ సమాధులను గట్టించెను. ఆ నాఁడు మొద లాయన పిచ్చివానివలె నుండెను. మంత్రములచేతను, దంత్రములచేతను, మాయలచేతను నమృతవల్లి యాపిచ్చిని గుదుర్పఁజూచెనుగాని, పన్నాగము లన్నియు నిష్ఫలము లయ్యెను. ఆయనకుఁ దిరిగి పూర్వఁపుసుఖము లేకపోయెను. ఆ యుత్సాహ మంతరించెను. బాలలతయు సౌందర్యవతియేకాని పచ్చయప్పకు మొదటినుండియు పసిబిడ్డలన్న ప్రాణ మయినను నాయిద్దఱుబాలికలు చనిపోయినవిచారముచే నా బాలలత నొకనాఁడును జేతులతో నెత్తుకొని ముద్దుబెట్టుకొనలేదు." అలమదివిని 'యాదాది తరువాత నెక్కడికిఁ బోయిన' దనియడిగెను. అందులకుఁ గామాక్షయ్యగారు "ఆహత్య జరిగినపిమ్మట నది తన యజమానునిమోముఁ జూడ లేకపోయెను. నిమిషమైన నక్కడ నుండఁజాల నని మలయాళమునకుఁ

బారిపోయెను. వెళ్లిన సంవత్సరమే నా కాసంగతి తెలియవచ్చెను. ఇప్పు డది యీకళ్ళికోటలో నాకుతోటలో నున్నది. ఆమె కిప్పుడు వయస్సరు వది వర్షములు. న న్నామె గుర్తెఱింగియుండవచ్చును. నన్నుఁ జూచిన గడగడ వణఁకును. చెవులు వినఁబడవు. పక్షపాతముచే నోరు బిగిసికొని పోయినది. ఒక మాసమునుండి చలిజ్వరముతో బాధపడుచున్నది. దానినిఁ జూచినపుడు నా కీసంగతి స్మరణకు వచ్చును. నాకుఁ గంపము పుట్టును. మీనాక్షి యెప్పుడైన నావైపునకుఁ బోయిన ట్లాయెనా యామెను జూచి రెండుమాట లామెతో మాటాడును. 'ఎన్నాళ్లు పాడుప్రాణము నిలుచునో, కష్టము లేకుండ నొక్కసారి తీసికొని పోరాదా?' అని యది విలపించునఁట!" అనెను. "ఆదాది యెక్కడ నివసించుచున్నది? ఎవ రన్నము పెట్టుచున్నారు?" అని యల మడుగఁగా నాయన "ఆమెజన్మస్థాన మీ పట్టణమే. ఎవరో బంధువు లున్నారఁట. అమృతవల్లి యామెకుఁ బ్రతిమాసము కొంతసొమ్ముఁ బంపునఁట" అని ప్రత్యుత్తర మిచ్చెను.

అలము —ఆదాదికి వివాహ మైనదా ?

కామా—అయినదికాని భర్త యెక్కడికో పారిపోయినాఁడు.

అలము—నా కామెను జూడవలె నని యున్నది. ఎప్పుడైన మీ రాప్రక్కకుఁ బోయిన నన్నుఁ బిలుచుకొని పోవలెను. ఆమె యుండు ప్రదేశ మిక్కడి కెంతదూరము?

కామా—రెండుమైళ్లుండును. అయ్యో! ఆమెను జూచిన దుఃఖము కలుగును. 'అక్కటా! యమునికి దయలేదా! ఈ ప్రాణి కిట్టి యవస్థ కలుగఁజేసెను' అని కన్నీరు మున్నీరుగాఁ బ్రవహింప నేడ్చును. అమ్మా! యింతసేపు నేను కథ చెప్పితినే, నీ కేమయిన శ్రమముగా నున్నదా?

అలము—లేదు. ఈచరిత్ర రాధకుఁ దెలియునో లేదో?

కామాక్షయ్య—బాలలత యామెకు స్నేహితురా లంటివే. కావున నామె వినియుండవచ్చును.

అలము—ఇది కుటుంబవిషయమైన రహస్యముగదా! ఏరికిని దెలియ కూడ దని వారియభిప్రాయమేమో?

కామాక్షయ్య—ఏల కుటుంబరహస్యముగా నుండవలయును? ఒకవేళ నిది దుఃఖకరమైన విషయ మని, పచ్చయప్పకు జ్ఞప్తికి రాకుండునటుల నాజ్ఞచేసెను గాఁబోలు? ఆయన పిల్లలు చని పోయిన తరువాత నవ్వియే యెఱుంగఁడు. కావున నీవిషయము రాధకుఁ దెలియకుండ నుండవచ్చును.

కథ ముగిసినపిదప మీనాక్షి భోజనమునకు రమ్మని వారిరువు రను బిలిచెను. భోజనానంతరము అలమేలు తనగదిలో నొంటిగాఁ గూరుచుండి కామాక్షయ్యగారు చెప్పినకథ నంతయుఁ దన యక్కకు శీఘ్రముగ వ్రాసి పంపెను.

---

# పదునేడవప్రకరణము.

రాధవంజకుఁ బోవుట.

ఒకనాఁ డమృతవల్లి బృందావనములో నున్న రాధాబాలలతలఁ గొంతసేపు వీక్షించి రాధయొక్క యాధిక్యమును, బాలలతయొక్క యధమత్వముగా నెంచి, మనసు కలఁతఁజెందఁ, గోప మతిశయింపఁ, గన్ను లెఱ్ఱఁబడఁగ, శరీర మంతయు వణఁకుచుండ నోర్వలేక బాలలతను బిలిచి యామెతో "కుమారీ! రాధయొక్క సహవాసము దుష్టము. ఆమెను జూచి యామెకు లోఁబడనివారు లేరుకదా?" అనెను.

బాల—అమ్మా! అటులఁ జెప్పవలదు. ఆమె దేవాంశోపేత సుమా! ఆమెసుగుణసంపత్తి నీవు చక్కగా నరయలేదు. ఆమె నా కొఱకై జన్మించిన యయోనిజ యని తోఁచుచున్నది.

అమృ—ఇంతకుఁ బూర్వము బృందావనములో జరిగిన విషయము చూచియు నీకు మఱల నేను జెప్పవలెనా? అందఱు నామెనే పరివేష్టించియుండిరి. అందఱు నామెను సంతోషపఱచుటకే ప్రయత్నించుచుండిరి.

బాల— అది యొక తప్పఁటమ్మా! చదువును, దానికి మించిన వినయాదిసద్గుణములు నామెయొద్ద నుండుటచే నంద ఱామెను గౌరవించెదరు. ఆమెజన్మకాలవిశేష మట్టిది. పాఠశాలలోఁ గూడ నామె కట్లే జరిగినది. ఆమెయందు నా కొక్క దోషమును గనఁబడలేదు. ఏతప్పును గంటివో తెలియఁబల్కుము.

అమృ—తప్పుల కేమి? మనసున కెక్కినవారియెడఁ దప్పులు గన్పడునా? నీ కిష్టమైనదికావునఁ దప్పులు గానరావు. సరి! ఆమె చదువు, నామె యందము నామెకే యుండనిమ్మా. ఈలాటి చదువుల కేమి? నా యింటిలో నీమె యుండనక్కఱ లేదు. నీ వెందుల కామె నిక్కడకుఁ దీసికొనివచ్చితివి?

బాల—అమ్మా! నీ కిది న్యాయము కాదు.

అమ్మ—న్యాయమా, గీయమా? నీవు చెప్పిన గడువు దాటినది. ఆమెకే సిగ్గున్న నెక్కడికైనను బోయి యుండును. ఎన్నినాళ్ళుండఁదలచినదో?

బాల—అమ్మా! నీ వామెయెడ నింత కూరముగా నుండుట కామె నీ కేమి యెగ్గొనరించెనే? ఏమి పాపము చేసినది? నేను రమ్మని ప్రార్థించి పిలుచుకొని వచ్చిన చెలిని నీవు పొమ్మనుట ధర్మమా? నా కెంతయో మహోపకార మొనరించిన సాధ్వీమణికి నిదియే మనము చూపు కృతజ్ఞత కాఁబోలు!

అమ్మ—కుమారీ! నీ క్షేమమునకు భంగము కలుగునటు లనేక కార్యములు గావించు నని నామనస్సునకుఁ దట్టుచున్నది. ఆమె యుండుట సర్వథా నీకు హానియే.

బాల—నీవు చెప్పునది నా కేమియు నర్థమగుట లేదు.

అమ్మ—నీవు పరీక్షలోఁ గడతేఱినమాత్రమున నేమి? లోక మిట్టిదని నీకుఁ దెలియలేదే! అంబికాపతి యామెతో విశేషాభిమానముతో నెప్పుడును మాటాడుచుండుట నీవు కాంచితివా?

బాల—పోనిమ్మా, అట్లయిన రాధ నంబికాపతి కిచ్చి వివాహము చేసి యామె నన్ను విడిచిపోకుండునటులును, మే మిద్దఱము కలిసి యుండునటులును జేయరాదా?

అమ్మ—(ఆగ్రహముతో) బాలలతా! బాలలతా! నీవుమాత్రము కొంచె మాలోచించి మాటలాడుము. దరిద్రురాలగు రాధ నంబికాపతి కిచ్చి వివాహముఁ జేసిన నతని కేమిలాభము?

బాల—మన కింత భాగ్య మున్నదికదా! ఇంకను ధన మెందులకు? అమ్మా? నీ యాశకు మేర లేదమ్మా!

అమ్మ—ఔను, భాగ్యవంతులమే. మీ తండ్రి పలికిన మాటలు నే నొకసారి యాలోచించి చూడఁగా నాకు లేశమైన నీ ధనములో నుండి రాఁబోవునది లేదు.

బాల—అట్లు జరుగుట యక్రమము.

అమృ—అంబికాపతి పచ్చయప్పగారికుమారుఁడు కాఁడుగదా? అతని కొక కాసుకుఁగూడ హక్కు లేదు. ఏదో యింతవఱకేకొఱఁతయు లేక యతనికన్నియు మీ తండ్రి జరుపుచున్నారు. అది యంతయు ధర్మము ఈ సొత్తున కంతయు నీవే యధికారిణివి.

బాల—అట్లైన చాలమంచిది. నే నీ దినమే నా సొత్తులో సగము నామనఃపూర్వకముగా నంబికాపతి కిచ్చెదను.

అమృ—(ఆలింగనము చేసికొని) కుమారీ! నీ వట్లొసరింపఁ దలంచినను నంబికాపతి మగవాఁడు. తనకుఁ దానే ధనము సంపాదించుకొనుటకు యోగ్యత కలవాఁడు. అంతియకాక ధనవంతురాలైన యొకభార్యను వెదకితెచ్చి యతనికిఁ బరిణయ మొనరించిన నతనికి క్షేమము.

అని పలుకుచుండఁ బినాకపాణి యచ్చటికి రాఁగా మాటలు చాలించి, యమృతవల్లి తనగదికి వెళ్లెను. ఆమెకు నాఁడు మొదలు విచారము విశేషమయ్యెను. బాలలత నిచ్చి వివాహము చేయవలెనని తలంచిన పినాకపాణిని రాధ తనవశము చేసికొనునేమో యను భయ మమృతవల్లి కధిక మయ్యెను.

ఎల్లకార్యములకును నంత్య మనునది కలదుకదా! అంబికాపతి సెలవు ముగిసినవెంటనే తిరుచునాపల్లికి వెళ్ళెను. దండపాణియుఁ బినాకపాణియుఁ దఱువాతఁ దమ స్వస్థానములఁ జేరిరి. పినాకపాణిమాత్రమప్పుడప్పు డాసౌధమునకు వచ్చుచుఁ బోవుచు నుండెను. ఎవరు వచ్చిననేమి? ఎవరు పోయిననేమి? రాధమాత్ర మచ్చటనే కదలక యుండెను. బాలలతను వదల యుండదు. అమృతవల్లి రాధను వెడలఁగొట్టవలయుననియు, లేనియెడల బాలలతకుఁ గీడువాటిల్లుననియు నెంచియుండెను. ప్రథమవీక్షణమందే రాధయన్న నమృతవల్లికి సరిపడినదికాదు. ఇంతకాల మితరులయింటిలోఁ గూరుచుండి యెట్లు సిగ్గులేక తినుచుండుననియనుకొనెను. ఇట్లుండ నొకనాఁటిసాయంకాల మమృతవల్లి తన

బిడ్డను గాంచి 'అమ్మా! వంజనుండి మీ యవ్వ భాగీరథి యుత్తరము వ్రాసినది. సంక్రాంతియుత్సవమఁట. నిన్నుఁ దప్పక రమ్మని వ్రాసినది.

బాల—నేను భాగీరథమ్మను గుఱించి వినుటయేకాని చూడలేదు. ఈ తడవ తప్పక చూడవలెను. వెళ్లుద మమ్మా.

అమ్మ—అవ్వకు నిన్నుఁ జూడవలెనని కోరిక కలదఁట. మన మీ సంక్రాంతికిఁ దప్పక యచ్చటికిఁ బోవలయును.

బాల—రాధకూడ వచ్చిన సంతోషమే. లేకున్న వలదు.

అమృత—అటులనే కానిమ్ము. అమ్మా! రాధనుగూడఁ బిలుచుకొని రమ్ము.

రాధను వంజకుఁ దీసికొనిపోవుటకుఁ దల్లి యడుగఁగనే యొప్పు కొన్నందులకు మిక్కిలి సంతోషముఁ జెందెను.

కొన్నిదినములు గడచినపిమ్మట వీ రందఱును 'వంజ'యను పట్టణమునకుఁ బోయిరి. ఆ పట్టణము పచ్చయప్పగారి మేడనుండి పది క్రోశముల దూరమున నమరావతీతీరమున గట్టఁబడి యున్నది. ఆ పట్టణసౌఖ్యమును, నమరావతీనదివిశేషమును వివరింపుచు రాధ యలమునకు జాబు వ్రాసి పంపెను.

భాగీరథిభర్త హైదరాబాదులో బహుకాలమునుండి విశేష ధనమును సంపాదించి తెచ్చెను. ఆయన యాదేశము వదలి వచ్చు నప్పు డాయూరినవాబు పదిలక్షలరూపాయ లీనా మిచ్చిరి. అంత ధన ముతో నాపెభర్త వంజకు వచ్చిచేరెను. వంజలోఁ బశుపతీశ్వరుని కోవెలకు నర్ధక్రోశములో 'తంజావూరురాజనగరు' అని చెప్పఁబడు నట్టి యొక సౌధమును వారు కట్టించుకొనిరి.

భాగీరథమ్మ కొక్కఁడే కుమారుఁడు. అతనిపేరు పశుపతి. అతఁడు విశేషధనవంతుఁ డగుటచే సాధారణముగ నందఱనుఁ జూచిన విధంబుగ నతనిని దర్శించుటకు వీలులేదు. నియమితకాలమునందు మాత్రమే చూడనగును. ఆమె పచ్చయప్పగారికిఁ దల్లివైపుచుట్టము.

సంక్రాంతి కొకవారమునకు ముందుగా నమృతవల్లి మొదలగు వారు వంజనగరము వచ్చిచేరిరి. అమరావతీస్నానముచేసికొనుచు సంక్రాంతి కెదురుచూచుచుండిరి. "తా నొకటి తలంప దైవ మొకటి తలఁచె" నన్న తెఱఁగున నమృతవల్లి పశుపతిని వశపఱచుకొని తన కూఁతు నిచ్చి వివాహముచేయఁదలఁచెను. కాని యంతలో బాలలతకు శరీరము జబ్బుచేసెను. ఈశ్వరేచ్ఛ! పేరాసగల యమృతవల్లికి సర్వ శక్తియుతుఁడగు న్యాయైకదృష్టి గల భగవంతుఁ డొకఁ డున్నాఁడని తెలియకపోలేదు. కాని తనభావములు నిర్దుష్టములని తలంచుచుం డెను. బాలలతకు వ్యాధి యతిశయించెను. వారి కుటుంబవైద్యుఁడగు మాంధాతను బిలువనంప నాభిషగ్వరుఁడు వచ్చి మందిచ్చి యూరాచ్చి కోటకు బాలలతను బిలుచుకొనిపోవలసిన దనియు నెమ్మదియైన పిమ్మటఁ దిరిగిరావచ్చుననియుఁ జెప్పెను. మాంధాత గొప్పవైద్యుఁడు. ఆయన చెప్పినప్రకారము తప్పక జరిగి తీరును. కావున భయపడి యమృతవల్లి బాలలత నూరాచ్చికోటకుఁ గొంపోవ నుద్యమించెను. కొంచెము నెమ్మది గన్పడినవెంటనే సంక్రాంతికిఁ దిరిగిరావచ్చు నని యామెయభిప్రాయము. మాంధాత యాజ్ఞకు వ్యతిరేకముగా నడుచు కొనుటకు ధైర్యము చాలక యమృతవల్లి బాలలతను దీసికొని యూ రాచ్చికోటకుఁ బోవ నిశ్చయించుకొనెను. వంజను వదలుటకుఁ బూర్వ మంబికాపతి కొకయుత్తరము వ్రాసెను. ఆతఁడు సంక్రాంతినాఁటికి సెలవుఁగైకొని వంజకు రావలయు నని యమృతవల్లికోరిక.

వంజలో రాధ నొంటరిగా నుంచి, బాలలతను వేఱుపఱచి, రాధయెడ ద్వేషము పుట్టునటుల బోధించిన, నామెమీఁది యభిమా నము బాలలతకుఁ దగ్గునని యమృతవల్లి తలఁచి చావడిలోనికి వచ్చి బాలలతను జూచి "అమ్మా! మాంధాత చెప్పినమాటలు వింటివా? మాటిమాటికి వచ్చుజ్వరమునకు దగ్గునకును నాలుగుదినములైన నూరాచ్చికోటకు వెళ్ళి యక్కడనుండి తిరిగి నెమ్మదిచూచుకొని రావలె నఁట. ఇక్కడ మంచు విశేషము." అనెను.

బాలలత—సంక్రాంతి పండుగకు భాగీరథినిఁ జూడనిశ్చయించితిమే.

అమృ—అది నాకుఁ దెలియును. ఆనాఁడు తప్పననేల? తరువాత రెండుమూఁడు దినములలోపలఁ జూడవచ్చును. నీ దేహస్థితినిఁబట్టి మనము తత్క్షణము బయలుదేరవలెను. మాంధాతయుత్తరువునకు వ్యతిరేకముగా నడిచిన మీ తండ్రి కోపపడును.

బాల—మన మాదినము భాగీరథిని జూడవలయును. తరువాత క్రొత్త వారినిఁజూచుట మంచిదికాదు. ఆలోచింపకయే ప్రయాణము చేయుచున్నావే?

అమృ—తరువాత ఉత్తరాయణప్రవేశము మంచిదే. నీ శరీరము నెమ్మదిచూచుకొని తిరిగిరావచ్చునులే.

బాల—ఎవరికైన దగ్గు, పడిసెము పట్టదుకాబోలు! సరే, ప్రయాణము చేయుము.

అమృ—(రాధను జూచి) మన మిక్కడ కొంతకాల ముండుటకుఁ దగిన సామానులతో వచ్చితిమికదా! వచ్చినవెంటనే తిరిగి పోవలసి వచ్చెను. మనసామానులను జూచుకొనుటకుఁ దగినవా రెవ్వరును లేరు. మే మూరాచ్చికోటకు వెళ్ళి తిరిగి వచ్చువరకు నీ విక్కడనే యుండిన బాగుండును. వంటకు, పనిపాటలకుఁ బనివాం డ్రున్నారు. తోఁటపనికి తోఁటకూలీలు గలరు. ఎన్ని దినములుగనుక, నాలుగుదినములలో తిరిగి వచ్చుచున్నారము. ఇంతమాత్ర ముపకారము చేయుదువా?

రాధ—ఇట్టి తరుణ మెప్పుడు తటస్థించునా యని కాచికొనియున్నాను. ఎట్లయిన నావలన మీకుఁ బ్రయోజన మొుండిన నదియె నాకు భాగ్యము. (బాలలతను జూచి) సఖి! 'నన్ను నీతోఁ గూడ పిలుచుకొని పోవుటలేదే' యని చింతిల్లకుము. నే నేదైన నుపకార మమ్మకుఁ జేయుటయే నాకోరిక. మీసామానులను భద్రపఱచి మేడ నద్దమువలె శుభ్రపఱచి యుంచెదను.

దీనిని విని యమృతవల్లి యానంద పరవశురా లయ్యెను. "రాధా! నీవంటిమంచిపిల్లను నేను జూడలేదు" అని యమృతవల్లి సేవకురాండ్ర నందఱను రాధవశముఁ జేసి యిల్లంతయు నామె

కొప్పగించి బాలలతతో నూరాచ్చికోటకు బయలుదేరెను. బాలలత బండి నెక్కుటకుఁ బూర్వము రాధను గాఁగిలించుకొని "రాధా! నేను తిరిగి వచ్చుట కాలస్యమైన నీవు నాయొద్దకు వచ్చెద వని నమ్ముచున్నానుజుమా" అనెను.

రాధ—అమ్మా! బాలలతా! నాయిష్టప్రకారము నడచుకొనుటకు నాకు స్వాధీనమా? ఒక్కటిమాత్రము నిశ్చయము. నీ కెక్కడ వివాహము జరిగినను బాటలు పాడుటకుమాత్రము తప్పక వచ్చెదను.

బాల—రాధా! ఏమి నిశ్చయమే? పినాకపాణి నా యం దంత ప్రేమతో నుండినటులఁ గన్పట్టఁడు.

అని ముఖము చిన్నపుచ్చుకొని రాధను గాఁగిలించుకొని కన్నీరు విడువసాగెను. ఇట్టి స్థితిలో నమృతవల్లి వచ్చి "రాధా! నీ కిది న్యాయముకాదు. మునుపే బాలలత బలహీనురాలు. ఆమె యేడ్చిన జ్వర మధికమగును. ఇప్పుడు నీ విట్లుచేయుట యక్రమము" అనెను. ఈ మాటలు విని రాధ మనోధైర్యము చెడ నేలఁ గూలఁబడెను. బాలలత కన్నీరు తుడుచుకొని తల్లితో "అయ్యో! రాధ యేమియుఁ దప్పు చేయలేదే! నేఁ జేసిన నేరమున కామెను నిందించుట యన్యాయ" మని కోపముతో మాటాడఁగ నమృతవల్లి "ఏదో! అయినది కానిమ్ము. తెలియక పలికితిని. నీ ముఖమును మూరెడు చేసికొని కూరుచుండకుము." అనిచెప్పి రాధను జూచి "తే పెవరయినను భాగీరధి యింటినుండి వచ్చిన, వారిచేతి కీజాబు నిమ్ము." అని యిచ్చి బాలలతతోఁ బయనమై పోయెను.

---

# పదునెనిమిదవ ప్రకరణము.

## భాగీరథి.

వారు వెళ్ళినదిమొదలు రాధ కేమియుఁ దోఁచుటలేదు. అదియ బాలలతను వదలియుండుట మొదటిసారి. కనుక దుఃఖమును బట్టలేక రాధ మేడమీఁదికిఁ బోయి యేడ్వసాగెను. బాలలతను దలంచుచు నామె సద్గుణములను స్మరించుచు భవిష్యద్విషయములను యోజించుచుండఁగ నొకదాసి వచ్చి "చెన్నపట్టణమునుండి కుశాల్‌దాసు తన సేవకునిద్వారా యొక కాశీపట్టుచీర బాలలత సంక్రాంతికిఁ గట్టుకొనుటకుఁ బంపించెను. అమ్మగా రూరికి వెళ్ళిరి. నే నిప్పుడేమి చేయుదును?" అనఁగ రాధ తనగదిలో దాని నుంచుట కనుజ్ఞ నిచ్చెను. దాసి యట్లొనర్చెను. ఆ పీతాంబరము మైసూరుమహారాజుగారు వివాహమునకై నేయించిన పదునైదుచీరలలో నొకటి. మూఁడువేలరూప్యముల వెల గలిగియుండును. ఆచీరఁ గట్టుకొని పశుపతిని బాలలత చూడవలెనని యమృతవల్లికోరిక. పశుపతి కోటీశ్వరుఁడు. సూర్యోదయసమయమందలి సముద్రమువలె నాచీరయుఁ దళతళమని మెఱయుచుండెను. సరిగతోఁ బువ్వు లల్లఁబడియుండెను. ముంగొంగున నొక చెఱువులో, హంస లాడుచున్నటుల సరిగతోఁ జిత్రముగఁ గుట్టఁబడియుండెను. ఆ చీరను రాధ చూచి "ఆహా! ఈచీర రాజకుమార్తెలు ధరింపఁదగినది. నేనీచీరను గట్టుకొనిన నెట్లుండెదనో! చూచెదను." అనియనుకొని యాచీర విప్పి కట్టుకొని నిలువుటద్దములోఁ జూచుకొని తన సౌందర్యమునకుఁ దానే యాశ్చర్యపడెను. "అయ్యో! నా కిట్టిచీరలను ధరించునంతటి భాగ్యము కలదా! అదృష్ట మెట్లున్నదో!" అని తలంచి యాచీరను విడిచి యథాపూర్వముగ మడతవేసి బల్లపైన నునిచి "కానిమ్ము! నేనొకటి చేసెదను; తప్పులేదు; బాధలేదు; బాలలత మెప్పుడును నామీఁదఁ గోపగించుకొనదు. అమృతవల్లి యెంతకుత్సితముతోఁ బ్రవర్తించుచున్నదో యంతకుఁ బదియంత లామెకు గర్వభంగము చేసెదను. ఆమెగర్వ మణఁగవలయును." అని తనలోఁ దాఁ దలచు

కొనుచుండఁగ నొక దాసి వచ్చి తలుపుతట్టెను. రాధ తలుపు తెఱచి యేమని యడుగ "ఆ చీర నిక్కడనే యుంపవచ్చునా? లేక మఱి యెక్కడనైనఁ బెట్టవలయునా?" అని ప్రశ్నింప, 'నిక్కడనే యుండ నిమ్ము' అని చెప్పి యా దాసినిఁ బంపెను.

అటుతరువాత భాగీరథి కిమ్మని యమృతవల్లి యిచ్చిన జాబును విప్పి చదివిచూచి, కొంచె మాలోచించి దానిని జింపి పార వైచెను. "ఈజాబు పోయినదిగదా? నే ననుకొన్న కార్యమునకు బాలలత భాగీరథిని జూడకుంట మిక్కిలి యనుకూలము. ఆమె బాల లత నిదివఱకుఁ జూడలేదు. అనేకులు బాలలతయు నేనును నొక్కటే పోలిక నున్నామని పలుతడవలు చెప్పియుండిరి. ఇప్పుడు నన్నుఁ జూచిన బాలలత వచ్చినతరువాత నామెను నన్నుఁగానే యేల తలంప రాదు?" అని యనుకొనెను.

ఇంతటితో రాధసంగతి చాలించి భాగీరథివిషయము కొంత విచారింతము. ఆమె పెద్దది. పూర్వకాలఁపు మనిషి. లక్ష్మీదేవి యన నామెకే తగును. ఆమెకు సకలసంపదలు కలవు. అఖండైశ్వర్యము తోను, భర్తతోను, నేకపుత్రుఁడగు పశుపతితోను వంజలో సౌఖ్య ముగ నుండెను. భాగీరథి యందగత్తెయే. ఎత్తైన నాసిక, సన్నని శరీ రము, నెఱసిన శిరోజములు, మనోహరములైన నేత్రములు. మొఱుపు తీఁగెవలె నుండును; సద్భావములు గలది; దైవభక్తికలది; సద్గుణ సంపన్నురాలు. ఒకతడవ నేరినైనఁ జూచిన వారి స్వభావాదు లామెకుఁ గరతలామలకములు. పశుపతి యొక్కఁడే కుమారుఁ డగుటంజేసి యతనియందుఁ బంచప్రాణములు. అతఁడు తల్లిదండ్రుల యెడ వినయము, భక్తి, గౌరవము, విశ్వాసము గలిగియుండెను.

ఒకనాఁడు భాగీరథి పశుపతితో "మాకుఁ బచ్చయ్యప్పగారు సమీపబంధువు. అతఁడు నాకు మేనత్తకొడుకు. ఆయనకూఁతు రిక్కడ నున్నప్పు డామెను వెళ్ళి చూడనక్కరలేదా! ఉత్తరాయణము వచ్చిన తరువాతఁ జూచిన లోకులు పలువిధములఁ బలుకుదురు. ధనమదముచేఁ దన చుట్టములను మఱచిన దను నపవాదము వచ్చును.

నే నెప్పుడు నా పిల్లను జూచినదిలేదు. ఈదిన మెంతమాత్రి మాల స్యము చేయక వెళ్లి యా పిల్లను జూడవలయును. అదియే నా మనస్సు నకుఁ గుదిరిన మంచి యుత్తమసంబంధము. బండి సిద్ధముచేయు మని సేవకునితోఁ జెప్పుము. పోయి నీ భార్యను జూచి వచ్చెదను” అనెను.

వెంటనే రెండుగుఱ్ఱములబండి వచ్చెను. అందు వా రిరువురుఁ గూర్చుండి పచ్చయప్పమేడకు వెళ్లిరి. వారిరాకను ముందుగాఁ గనుఁ గొనిన రాధ, బాలలతచీరను ధరించి సిద్ధముగా నుండెను ఇట్లు రాధ సిద్ధముగా నున్నప్పుడు, భాగీరథి బండిదిగి యొకదాసితోను, దన కుమారునితోను వచ్చుచుంట చూచి రాధయొక్కదాసి మర్యాదతో ద్వారముకడకుఁ బోయి యీ దారిని రం డని రాధ యున్నగదికిఁ బిలుచుకొని వెళ్లెను.

భాగీరథిని రాధ చూచి లేచి సపర్య లొనరించెను. “ఈమె దేవ తయో, మనుష్యకన్యయో, మెఱుపుతీఁగెయో ! రంభకైన నింత సౌం దర్య ముండునా? ఆహా! ఏమిచక్కఁదనము! ఈ పిల్ల యింతటి సౌం దర్యవతియని నే నెన్నఁడును దలంపలేదే” అని భాగీరథి యనుకొనెను. పూర్వము లక్షమంది పిల్లల నిచ్చెదమని వచ్చినను నాపిల్లలం దిట్టి సౌందర్య మొక్కరికిని లేదని పశుపతికిఁ దోఁచెను. భాగీరథి తాను బెట్టుకొనిన సులోచనములను మాటిమాటికిఁ దుడిచి రాధసౌందర్య మును జూచి యానందించుచుండెను. రాధ తనయొద్దకు రాఁగానే ప్రేమతో నాలింగనము జేసికొని “అమ్మా! నీవు పచ్చయప్పయప రావతారముగా జన్మించితివి. అమృతవల్లి యెక్కడ? మీతల్లి నీవంటివారి నిరువదిమంది నేల కనియుండఁగూడదు. నా కొకఁడే కొడు కైనట్లు మీయమ్మకు నీ వొక్కదానవే కూఁతురవు.” అని భాగీరథి పలుక, రాధ “అమ్మ నేఁడే యూరాచ్చికోటకు వెళ్లెను.” అని తల వంచుకొనెను. వినోదార్థ మిట్లు చేసినను తాను దోషముచేయుచున్నా నేమో యని సిగ్గుపడెను.

భాగీరథి“నీ వొక్కదాన విక్కడ నుండినఁ జాలదఁటమ్మా! ఈ యింటికంతయు లక్ష్మివలె నున్నావు. ఇదిగో! ఇతఁడే నాపుత్రుఁడైన

పశుపతి”యని చెప్పెను. “బాలలత యనుటకన్న విద్యుల్లతయని పేరిడిన దగియుండును. అమృతవల్లితో మాటాడవలెను. ని న్నొంటిరిగా నిట నుంచి తానుమాత్రి మాయూరాచ్చి కెటులఁ జనియె? మనస్సెటుల కలిగె? పోనిమ్ము, అట్లు పోవునప్పుడు నిన్ను నాయొద్ద దిగవిడచి పోరాదా? కాని నే నూరలేను. సమీపమున నున్న కొండకుఁ బోయియుం టిని. మంచిది. నీవు నాతోఁ గూడ రమ్ము” అని రాధచెయ్యిబట్టుకొని పిలువ నామెయు “నే నిప్పుడు రా ననుట భావ్యముకాదు” అని తలంచి వారిబండిలోనే పోవుట సదుపాయ మని నిశ్చయించి బయలుదేరెను.

ముగ్గు రా బండి నెక్కినవెంటనే “పశుపతీ! ఈమె తండ్రియొక్క యచ్చుగా నున్నది. కుమారా! నీ కటులఁ దోఁచుటలేదా? పాప మెన్నియో కష్టములు కలిగినటుల వింటిమి. అమ్మా, బాలలతా! నీ కా కష్టములన్నియుఁ దెలిసియుండునుగదా! అయినను గుటుంబ కష్టములు - చిన్నపిల్లవు-నీముందఱ మాటాడుట న్యాయముగాదు” అనిచెప్పి ముసలిదగుటచే మఱచినట్లు తటాలున నా సంగతిఁ జాలించి యూరకుండెను. ఇంతలోఁ బశుపతిమందిరమును వారు చేరిరి. ఆ దినము వారింట నొక గొప్పవిందు సిద్ధముగావింపఁబడెను. ఇతరప్రదేశముల నుండి యనేకులు వచ్చియుండిరి. అందఱిలో రాధ చుక్కలలోఁ జంద్రునివలె నుండెను. ఆ మరునాఁడు పశుపతి, రాధను బండిలో నెక్కించుకొని యామెయింటికిఁ గొంపోయి యక్కడ నామెను దిగవిడిచి తిరిగి వచ్చెను.

భాగీరథి పశుపతిని గాంచి “కుమారా! నే నిదివఱకుఁ జూచిన స్త్రీలలో నమృతవల్లికూఁతురు చక్కనిది. నామనస్సునకు నచ్చినది. ఏమి సౌందర్యము! ఎట్టి చదువు! ఏమి సంగీతజ్ఞానము! ఎంత వినయ వతి! పతివ్రతాలక్షణము లామెయం దమరియున్నవి. నీ యభిప్రాయ మేమి?” అనఁగఁ బశుపతి ‘నీవు చెప్పిన దంతయు వాస్తవమే. ఉత్తము రాలు, సౌందర్యవతి, విద్యావతి. ఇట్టివనిత నేలాకో యామెతల్లి యొం టరిగా నింట నుంచి యూరాచ్చికి వెళ్ళెను? బాలలత యింటియందలి పనినంతయుఁ జూడవలెనఁట. ఈమెతల్లి తిరిగి వచ్చువఱకు మన

యింటిలోనే యుండఁగూడదా? నేను పోయి తిరిగి యామెను బిలుచుకొని వచ్చెదను.' అన, భాగీరథి "కుమారా! తొందరపడకుము. శీఘ్రకాలములోనే నీ కామె నిచ్చి వివాహము చేసెదను. ఆమెను బంపుట నాకు మాత్రము సమ్మతమా?" అనెను. ఊరాచ్చిలో బాలలతకుఁ గొంచెము స్వస్థత కలిగెను. సంక్రాంతిపండుగ కడచి పోయెను. అవసరముగా భాగీరథి మొచటికో పోవలసివచ్చెను. తాను తిరిగి వచ్చునప్పటికి నమృతవల్లి వచ్చునుగాన నప్పు డామెను జూడ వచ్చునని తలంచి బయలుదేరిపోయెను.

---

# పందొమ్మిదవప్రకరణము.

## రాధకొంటెతనము బయలుపడుట.

రెండుమూఁడు దినములలో రావలె ననుకొన్న యమృతవల్లి యూరాచ్చికోటనుండి తిరిగివచ్చుటకుఁ బదిపండ్రెండుదినము లయ్యెను. అట్లే భాగీరథియు వెళ్ళినయూరినుండి తిరిగి వంజకు వచ్చిచేరలేదు. రాధ కొకదిన మొక యుగముగ నుండెను. రాధ తన గదిలో నొక నాఁ డేదియో చదువుకొనుచుండ నప్పు డాగదితలు పెవరో తట్టినట్లు వినఁబడెను. తటాలున లేచి తలుపు తెఱవ నమృతవల్లి ప్రత్యక్ష మయ్యెను.

అమృ—నీవు రాధవేనా? నీ వింక నిక్కడనే యున్నావా?

రాధ—మీ యాజ్ఞాప్రకారము నే నిక్కడనే యున్నాను.

అని పలుకుచుండు నంతలో బాలలత వచ్చి రాధను గౌఁగిలించుకొనెను.

బాల—ఎన్నినాళ్ళకు నిన్నుఁ జూచితినే రాధా?

రాధ—బాలలతా! వచ్చితివా! (అని యత్యాదరముతోఁ గౌఁగిలించుకొని) నీకు జబ్బు నెమ్మదియైనదా? మునుపటికంటె నీ వారోగ్యముగ నున్నటులఁ గనఁబడుచున్నావు.

బాల—అవును, త్వరలో నెమ్మదిఁ గంటిని. ఎన్ని యున్న నేమి, నీవు లేనప్పుడు! నీకుఁ గ్రొత్తదగు ముక్తాహారముఁ దెచ్చితిని. మన గదికిఁ బోవుదము రమ్మా.

అని నుడువుచు రాధచేయి పట్టుకొని బాలలత లోపలికిఁ దీసికొనిపోయెను. అమృతవల్లి బాలలతను, రాధను వేఱుపఱచినను వారి స్నేహము తగ్గక యధిక మగుటం గాంచి నివ్వెఱపడెను.

మఱుసటిదినఁపుమధ్యాహ్నము సేవకుఁ డొకఁడు జాబును దెచ్చి బాలలత కని యిచ్చెను. ఎవరు వ్రాసియుందురో యని విచారింపఁగ బశుపతి యని తెలియవచ్చెను. వీణ వాయించుచుండిన బాలలత యాజాబును సాంతముగాఁ జదివెను.

అమృ—(ఉప్పొంగి) ఏమి వ్రాసియున్న దా జాబులో ?

బాల—శీఘ్రముగా మనలను జూచుటకు వారు వచ్చుచున్నటుల వ్రాసిరి.

అమృ—ఆహా ! ఎంతమంచివారు ! ఎంతగొప్పబుద్ధి ! మనము వారిని జూడవలె నని యెంచియుండ వారే మనలను జూడవచ్చుచున్నారు.

అనుకొనుచుండఁగ రెండుగుఱ్ఱములబండి ద్వారమున నిలిచెను. పశుపతిరాక రాధ నుత్సాహహీనగ నొనర్చెను. పశుపతి రాధను సమీపించి "బాలలతా ! సౌఖ్యమా ? అమ్మ నిన్నుఁ జాల యడిగినది. ఎప్పుడును నీదే లోకము. నిన్నే తలంచుచుండును" అనెను. దానిని విని రాధ సిగ్గుతో, వినయముతోఁ బశుపతివంక నొక్కపర్యాయము జూచి యూరకుండెను. ఏమియుఁ బ్రత్యుత్తర మియ్యలేదు. అమృతవల్లి, "పశుపతీ ! ఏ మిటుల మాటాడుచున్నారు. ఇదిగో ! యిది నాకూఁతురు, బాలలత. మీరు బాలలత యని సంబోధించినది రాధ; నాకుమార్తెచెలికత్తె" అని తెలియఁబల్కెను.

పశు—(ఆశ్చర్యముతో) ఈమె రాధయా ? మన్నింపుము. ఈమెయే కదా మీకుమార్తె బాలలత ? ఈమెయే మా యింటికి వచ్చి మాయమ్మతో మాటాడినది. ఈమెను మాయమ్మ సదా తలంచుచుండును.

అమృ—పశుపతికి మతిభ్రమ కలిగినది.

రాధ—లేదు, వారు చెప్పిన దంతయు వాస్తవమే. నన్ను గుఱించి మీ రేమనుకొన్నను సరే. నేను భాగీరథియింటికి వెళ్ళితిని. నన్నే యామె బాలలతగా భావించుచున్నది.

అమృతవల్లి కీపలుకులు ములుకు లయ్యెను. ఆమె రోషకషాయితనేత్రయై ఘోరాకారముం దాల్చెను. రాధ నిర్జీవప్రతిమవలె నిలువఁబడియుండెను.

అమృ—ఏమే రాధా! నుడివిన సంగతులు వాస్తవమేనా? నా కుమార్తె పేరుబెట్టుకొని భాగీరథిని జూచివచ్చుట ధర్మమౌనా? నీ వింత మోసముఁ జేయుదు వని కలలోనైనఁ దలంపలేదు.

రాధ—అమ్మా! సర్వము నిజమే. మీరు చెప్పిన దంతయు యథార్థమే. నేను వినోదార్థము చేసిననేరమును మన్నింపుఁడు.

పశుపతి—దీనికై యింతగా విచారింపనేల? బాలా! నీ వెంతమాత్రము భయముం జెందకుము. నీపక్షమున నే నుండెదను. ఇందేమి తప్పుగలదు? నీ వవివాహితవు.

అమృతవల్లి—రాధా! నీవు నిజముగా నటు లొనరించితివా?

రాధ—నిజమే; ముమ్మాటికి నిజము. అంతయు వాస్తవమే. అయినను బాలలత యనుకొనునట్లు నటించినను మీయాజ్ఞను మీరితినా?

బాలలత—(చిఱునగవుతో) ఏమియుఁ దప్పులేదు. దివ్యమైన పని చేసితివి. రాధా! నీసాహసమే సాహసము. నేనే నీవుకదా.

అమృత—ఇది సరియైన వంశమునఁ బుట్టినది కాదు. నా కుమార్తెకుఁ జెలికత్తెగా నుండు యోగ్యత దీనికి లేదు.

పశుపతి—అమ్మా! బాలిక కావున వినోదార్థ మిటులఁ జేసినది. దీనికై యింత యేల? ఊరక నిందింపకుఁడు. ఆగ్రహ మనర్థదాయకము.

అని చెప్పి రాధవైపునకుఁదిరిగి చిఱునగవుతో "నీవు భయముఁ జెందకుము. నీ కెట్టి యాపదయు సంభవింపదు. నీ పక్షమున నే నుండెదను." అని రాధకు ధైర్యముచెప్పి యందఱియొక్క సెలవుఁ గైకొని పశుపతి స్వగృహమునకు వెళ్లెను.

బాలలత—అమ్మా! నాచెలి యొంటరిగా నుంటచే వినోదార్థము చేసినవింత నింత పట్టి పల్లార్పవలెనా? ఇఁక శాంతింపుము.

అమృ—రాధా! నీవు మన్నింపరానితప్పు నొనరించితివి. ఇఁక మీఁద నిక్కడ నుండుటకు నీకు యోగ్యత లేదు. ఈ క్షణమే

నా గృహము విడిచి పొమ్ము. నేను సహించిన ట్లెవరు నిన్ను సహింపఁగలరు? ఈ తప్పు మిక్కిలిగొప్పది. మాఱువేషము వేసికొనినది, మఱి యేమి చేయనోపదు? నీ కింత ధైర్య మున్న సంగతి నాకుఁ దెలియకపోయె. ఈ దినముమాత్రము నీ విక్కడ నుండవచ్చును. సూర్యోదయము కాకపూర్వమే నీ వీ స్థలము విడిచిపోవలయును.

బాల—అమ్మా! నీవు రాధను వెడలఁగొట్టిన నే నామెతో నదే బండిలోఁ బోవుదును. ఆమె యెన్నఁడు నొంటరిగాఁ బోవునని తలంపకుము. మా యిరువురికిఁ గల స్నేహము దేవునికే యెఱుక.

అమృ—తల్లీ! ఇంకను బుద్ధి రాలేదా? నిన్ను మోసముచేసి నీనోటి మన్నుఁగొట్టినది. సిగ్గువిడిచియే కదా యందఱను వంచించుచున్నది.

బాల—దీనికి నాకుఁ గోపమే లేదు. నా స్వభావ మామె యెఱుంగును. కాఁబట్టి య ట్లొనరించెను. పశుపతి చెప్పినదానిని వింటివి గదా? అతని యభిప్రాయమే నాయభిప్రాయమును. రాధ యిప్పు డేమి తప్పుచేసినదమ్మా! ఎందుల కిట్లు నోటికివచ్చినట్లు తిట్టెదవు? నాప్రాణ మడిగినను రాధ కిచ్చుటకు సిద్ధముగా నున్నాను.—రాధా? నీ వెచటికిని బోవలదే. అమ్మ సమ్మతించును లెమ్ము. నాకుఁ గల స్వాతంత్ర్యము నీకును గలదు.

రాధ—అమ్మా! దయచేసి చెప్పుము. నే నుండుటయా, పోవుటయా? మీరుగదా యింటి కధికారిణులు? మీనోటినుండియే యుత్తరువు రావలెను.

“పోవనక్కరలేదు. ఇక్కడనే యుండు” మని విధిలేక యమృతవల్లి బదులుపలికెను.

---

# ఇరువదవప్రకరణము.

రాధజవాబు.

బాలలతాదు లూరాచ్చికోటకుఁ బోయిన కొన్నిదినములకుఁ బశుపతి యొక గొప్పయశ్వము నెక్కి బహువేగముతోఁ బచ్చయప్ప గారి భవనమువైపు వచ్చుచుండెను. ఆ తరుణమున రాధ తోఁటలోఁ గూరుచుండి, యేదో చదువుకొనుచుండెను. ఆయనను జూడఁగనే రాధ పట్టరాని యానందమున లేచి నిలువఁబడెను. ఆమెను జూచి పశుపతి తన యశ్వమును డిగ్గి గుఱ్ఱమును దన కాసావాని కిచ్చి చిఱునగవుతో 'నీవు న న్నెదురుచూచియుండవు.' అన రాధ "అవును. తిరిగి మిమ్ములఁ జూచెదననియే తలంపలేదు. అమృతవల్లియు బాలలతయు లోపల నున్నారు.

అనఁ బశుపతి "మంచిది. వారినిఁ దరువాతఁ జూడవచ్చును. అదిగో బృందావనము బహుసుందరముగ నున్నది. నీతోఁ గొంత మాటలాడవలయును. అచటికిఁ బోవుదమా!" యన రాధయు నాతనివెంటఁ బోయెను. పోవునపుడు "అమ్మ సౌఖ్యముగ నున్నారా?" అని రాధ యడుగ, "ఆమె బాగుగనే యున్నా"రని పశుపతి చెప్పెను.

రాధ——నేఁ జేసిన నేరమును మన్నించినారా?

పశుపతి——ఆ విచార మేల? నేను వచ్చుటకుఁ గారణము మా యమ్మ నిన్ను తత్క్షణమే వెళ్లిచూచి తన యాశీర్వాచనములు నీకుఁ జెప్పి రమ్మనినది. దీనిని విన్నతరువాతనైన నామెయొక్క సంతోషసౌజన్యములను దెలిసికొనఁజాలవా?

అనుచుండ రాధ యింటిలోనికిఁ బోవుటకుఁ దిరిగెను. పశుపతికిమాత్ర మింకను గొంచెముసేపు తోఁటలో నుండి యామెతో నుల్లాసముగా మాట్లాడుచుండుటయే యిష్టముగాని అందులకు రాధ యెడమీయలేదు. ఆమె నతఁ డొకయమానుషకన్య యని యెంచెనే కాని సాధారణమైన బాలికగాఁ దలఁపలేదు. భవానిలో నేదో పని యుండి పశుపతి వచ్చెను. తా నెన్నిదినము లుండవలెనని తలంచెనో యన్నిదినము లచట నుండెను. ఏదైనఁ గొంచెము సాకు చిక్కినఁ జాలును. ఊరాచ్చికోటకు వచ్చును. రాధ కోరునదియు నదియే.

ఒకనాఁడు రాధ తోఁటమాలికుమార్తె కనారోగ్యముగ నున్నటుల విని పోయి చూచివచ్చెను. "పశుపతి వచ్చి చాలదినములాయెను. ఒకవేళ నాయూరు విడిచినారేమో? అట్లయినఁ జెప్పకుండ వెళ్లెదరా ?" అని యనుకొనుచుఁ బోవుచుండునప్పుడు "రాధా! రాధా!" యను శబ్దమా తోఁటలో నెవరో తన్నుఁ బిలిచినట్లు విననయ్యెను. పశుపతియే మాట్లాడవచ్చెనని పరికించుచుండ నామె నిలుచున్న దిక్కునకు దీర్ఘకాయుఁ డొకఁడు వచ్చెను. వెంటనే యతఁడు 'మీతోఁ గొన్ని రహస్యములు మాట్లాడవలెనని యిక్కడ నొదిగి నిలుచుంటిని' యనెను. దానిని విని రాధ యాశ్చర్యముతో 'పినాకపాణిగారా? ఏమి విశేషములు?' అనెను. పినాకపాణి 'లేదు' అనెను. అంతట రాధ 'మీముఖము విచారగ్రస్తమై యుంటఁ గాంచి యెవరి కేమి జబ్బు వచ్చినదో యని భయపడితిని.' అనుచుండ,

పినాకపాణి—నేను మీతోడ రహస్యము మాట్లాడ నెంచియుంటిని. మీకుఁ దెలియునో తెలియదో ?

రాధ— నాకుఁ దెలియవలసినకారణ మే మున్నది ?

పినాకపాణి—నే నిపుడు చెప్పినవెనుక మీకుఁ దెలియఁగలదు.

అనెను. రాధ మిగుల కోపముతో మీ రట్లు రహస్యముగా మాట్లాడునది మీ రిచట చెప్పుటకు నా కిష్టములేదు. మీరు నాతోఁ జెప్పఁదలఁచుకొన్నది బాలలతముందైనఁ జెప్పవలెను. మీకును నాకును రహస్యము లేమున్నవి?' అనఁ బినాకపాణి 'అందఱముందు మాటాడుటకు జంకియేకదా యిట్లు మీతోఁ జెప్పనెంచితిని. మీది ఋజుస్వభావము.' అనెను. రాధ "అదియే నాస్వభావము. మనస్సులో నొకటియుఁ బైటికి మఱియొకటియు మాట్లాడుట నా స్వభావముకాదు. అట్లు మాట్లాడినందునఁ బగయు - స్పర్థయుఁ గఱుగును. మీరు చెప్పఁదలఁచుకొనినది చెప్పుఁడు. మన మిన్నాళ్ళు సోదరీసోదరులవలెఁగదా యుంటిమి. అట్లుండియు నిప్పు డీ యనుమానమేల ?" యన, పినాకపాణి "మన మిదివరకు సోదరీసోదరులవలెనా యుంటిమి? వేఱువిధమైన బాంధవ్యము కలుగఁగల దని భావింపలేదా?" యని

నవ్వుచు నడుగఁ బరేంగితజ్ఞానముగల రాధ "అయ్యా! నేను మీకుఁ జెల్లెలిని, మీరు నాకు నన్న యను భావము తప్ప వేఱులేదు. అట్టి భావము మీ హృదయమునఁగూడ మారకుండ నుండనిండు. మీ కొక నమస్కారము." అని చెప్పి వెళ్ళిపోయెను.

ఇట్లు పినాకపాణి నోరుతెఱచి తన యభిప్రాయమును జెప్పుటకుముందే యాతని నోరెత్తకుండునట్లు చేసి రాధ యంతఃపురముఁ బ్రవేశించెను. రాధ తన గదిలోనికి రాఁగానే బాలలత యచటికి వచ్చెను. ఆమెను జూడగానే రాధ "చెలీ! బాలలతా! నీ వీ సాయంకాల మెట్లు ప్రొద్దుపుచ్చితివే?" యన బాలలత, 'ఉత్సాహముగానే ప్రొద్దుపుచ్చితిని. నేఁడే నేను చక్కగా వీణవాయింపఁ గలిగితిని. పినాకపాణియు సంతోషముతో వినెను. నా కిప్పుడుగదా కొంచెము ధైర్యము వచ్చినది. పూర్వమువలెఁ గాక యిపుడు నా మీఁదఁ గొంచె మభిమానము కలిగియున్నట్లు తోఁచినది." యనెను. "ఇఁక మీఁద నతఁడు నిన్నుఁదప్ప నితరులను గన్నెత్తి చూడఁడు. నీవు నిశ్చింతగా నుండుము." అని రాధ చెప్పఁగా బాలలత రాధను కౌఁగిలించుకొని "నాయభిప్రాయము సరియైనది కాకపోవచ్చును. పినాకపాణిని వివాహమాడవలెనను వాంఛ నీమనస్సున నున్నదా?' యని యడిగెను. దానిని విని రాధ "అయ్యో! ఎంతపాపఁపుతలంపు! కలలోనైన నా కట్టియాలోచన లేదు" అనెను. దానిని బాలలత విని 'నా బుద్ధిని నేను నిందింపవలెను. అన్యాయముగ నీ విషయమున నతనికి మోహ మున్నట్లు శంకించితిని' అనెను. రాధ తన చెలిం జూచి 'బాలలతా! దానిచేతనే నీ విట్లు చిక్కిపోవుచున్నావు. ఇట్లు నీవు నన్ను గుఱించి తలంచుట పాపము. మనము ప్రాణస్నేహితలముకామా? నేను చెప్పుదానిని వినుము. ఈ లోకములో రేపు కానున్నది మనకుఁ దెలియదు. అయిన నిదిమాత్రము నిశ్చయము. నే నెప్పుడును నీ యిష్టమునకు వ్యతిరేకముగ నడువను. నాయెడ నీకు నమ్మక మున్నట్లు ప్రమాణముచేయుము.' అని యడుగ, బాలలత రాధను కౌఁగిలించుకొని యట్లే ప్రమాణము జేసెను.

---

# ఇరువదియొకటవ ప్రకరణము.

## అలమేలు.

శివరాత్రితోఁ జలి శివశివయని పోవునను సామెత కలదుగదా! మాఘమాసము కడచెను. చలియుఁ దగ్గెను. సర్వజనహృదయానందకరమగు వసంతకాలచిహ్నము లారంభమయ్యెను. ఎక్కడఁ జూచినను గామాక్షయ్యగారి భవనమునఁ బువ్వులు పరిమళముల వెదజల్లుచుండెను. భ్రమరములు ఝుంకారమిషచే పాట పాడున ట్లుండెను. తోఁటవాకిలియొద్ద నలము కూర్చొని తన యొద్దకుఁ జదువుకొనవచ్చు పిల్లలకై యెదురుచూచుచుండెను. ఇట్లామె యెదురుచూచు చుండినపుడు శీనమ్మ వచ్చి "అమ్మా! అమ్మా! మనయింటికి నతిథులు వచ్చెదరఁట" అనెను. అలము "రానిమ్ము, నీ వెక్కములు చక్కగా నేర్చుకో. నీపనిని నీవు చేయుము." అనెను. దానికి శీనమ్మ "ఎవరు వచ్చెదరో తెలియునా?" యన, అలమేలు "ఎవరు వచ్చిన మన కేమి? మన పని మనము చేయుదము, రమ్ము" అనెను. అంత నాపిల్ల "అంబికాపతి యఁట" అనఁగా, నలము "ఊరాచ్చికోటనుండియా?" అనెను. "అవునమ్మా" యని శీనమ్మ యనెను. వారు పచ్చయప్పగారి భవనము నుండి వచ్చుచున్నందునఁ దప్పక రాధనుగుఱించి తెలియవచ్చు నని యలమేలు సంతసించెను. ఆమె శీనమ్మను జూచి "బాలికా! ఎప్పుడైన నంబికాపతి యిక్కడకు వచ్చియుండెనా?" అన, నాపిల్ల, "అవును, అప్పుడప్పుడు వచ్చుచుండును. ఆయన చాల మంచివాఁడు. మానాయనయొద్దఁ జదువుకొనుచుండువాఁడు. ఇక్కడకు వచ్చినపుడంతయు మమ్ములను దోఁటకుఁ బిలుచుకొనిపోయి కథలు చెప్పుచుండును. ఆటలు నేర్పును. ఆయన వచ్చిన, వారితో నాటలాడుకొనుటకు మీరు సెలవు నియ్యవలెను." అనెను.

వీ రిట్లు మాట్లాడుకొనుచుండఁగ మీనాక్షి బండిసిద్ధముచేయించి తన భర్తతో నంబికాపతిని బిలుచుకొనిరమ్మని చెప్పిపంపెను. అట్లు వారు వెళ్ళినరెండుగంటలకు బండి యంబికాపతిని దెచ్చి కామాక్షయ్య

గారి యింటిముంగిట విడిచెను. మీనాక్షి చిరునగవొప్పు మోముతోఁ దన భర్తయొక్క శిష్యుఁడైన యంబికాపతిని వాత్సల్యముతోఁ బలుకరించెను. ముగ్గురు పిల్లలును నంబికాపతి బండి దిగకముందే నేనుముందు, నేను ముం దని యతనియొద్దకుఁ బరుగిడిరి. పిల్లలను సంతోషముతో దగ్గరకుఁ దీసికొని వసారాలో నడుగిడ నక్కడ గులాబికుసుమములు కమ్మనివాసన లీనుచుండెను. సమీపమున నుండు నొక కిటికీయొద్ద తెల్లని పట్టుబట్ట కట్టుకొనిన యొక శాంతమూర్తి స్త్రీవ్యక్తి రాధను బోలినది కూర్చొని యుంట యంబికాపతి మొట్టమొదటఁ జూచి యాశ్చర్యపడి, కలయో, కల్లయో, మాయయో, యని యెన్నుకొనుచు నిశ్చేష్టితుఁడై నిలుచుండ మీనాక్షి "మఱచితిని. నే నలమేలును గుఱించి నీతోఁ జెప్పనేలేదే" అని "అమ్మా! అలమేలూ! ఇదిగో, యితఁడే యంబికాపతి. నా భర్తయొక్క ప్రియశిష్యులలో నొకఁడు" అని చెప్పి "అబ్బాయీ! ఈమెయక్కయేగదా, మీ భవనమున నున్నది. ఈమెనుగుఱించి నీవు వినలేదా?" అనెను. అంబికాపతి "అవును, రాధయనునామె మా భవనమున నా చెల్లెలియొద్ద నున్నది. తన కొక సోదరి కలదనియు నామె యొక ప్రభువునింటఁ బాఠము చెప్పుచున్నది యని మాత్రము చెప్పినది." అన, మీనాక్షి "ఇక్కడనే మాపిల్లలకు నేర్పుచున్నది." అని చెప్పెను. తరువాత వారివారి కార్యములకు వారు వారు పోయిరి. ఆ దినము సాయంకాలమువఱకు నంబికాపతికి నలమును జూచి మాట్లాడుటకు వీలులేదయ్యె. ఆ సాయంకాలము తోఁటలో నొక్కచోట నతఁడు కూర్చుండినపు డల యొక బుట్టనిండ గులాబిపువ్వులఁ దీసికొని యెక్కడకో పోవుచుండెను. ఆమె యట్లు పోవునపు డంబికాపతి చూచి "ఆహా! ఈమె రాధవలెనేయున్నదే. అయినను రాధ సూర్యబింబము. ఈమె చంద్రబింబము. ఈమె శాంతమూర్తి" యని తన మనస్సునఁ దలఁచుకొనుచుఁ దాను గూర్చున్న తావు విడిచి లేచి "సుందరీ! నే నీ బుట్ట దీసికొని వచ్చెద. నీ కంత శ్రమ యేల?" అన నందుల కామె గజగజ వణఁకి తనతో నిదివఱ కెప్పుడు నొంటరిగ నా తోఁటలో మాట్లాడినవారు లేనందున భయముతో 'నక్కరలేదు. నే నీ సమీపమునకే తీసికొనిపోవుచున్నాను.

ఇదిగో భవనము చాల సమీపముననే యున్నది. అక్కడ నొకయవ్వ వీనిని కావలెనన్నది. మీనాక్షమ్మగారు తెమ్మని చెప్పినారు. కావునఁ దీసికొనిపోవుచున్నా'నని చెప్పెను. అందుల కంబికాపతి "కొంచెము దూరమైననేమి? ఇది చాల భారముగ నున్నది" యని తాను బుట్టను గ్రహించి, "సుందరీ! నీ వన్నివిధముల రాధనే పోలియుంటివి." అనఁగా నలము కొంచెము సిగ్గుపడి సంతోషము సూచించు మోముతో నతనిఁ గాంచి, 'నేనును రాధను గుఱించి విచారింప నెంచి యుంటిని. ఆమెయొద్దనుండి యిరువది దినములుగ జాబే లేదు. ఇ ప్పెప్పుడు నామె యుండినది కాదు. రాధ సౌఖ్యముగ నున్నదా?" యనియడిగెను. అంబికాపతి, "ఆమెయుత్సాహమునకు, సంతోషమునకు నెప్పుడు నే కొంతయు రాదు. ఆమె యూరాచ్చికోటలో లక్ష్మివలెఁ బ్రకాశించుచున్నది. ఆమెను జూడకున్న మాచెల్లెలొక్కనిముసమైన బ్రతుకఁజాలదు. ఆమె యదృష్టవంతురాలు" అనెను.

ఇట్లు చెప్పు నప్పు డతనిముఖకమలము కొంచెము వాడెను. శాంతస్వభావము, నిష్కాపట్యము గలిగిన యలమున కెట్టు లతని గుణము తెలియును? 'నా విషయమై యెప్పుడైన మాట్లాడుట కలదా?' యని యల మడుగ, నంబికాపతి 'ఒక్కసారి మాత్రము తన కొకచెల్లె లున్నట్లు చెప్పినది గాని, మెచ్చుట నున్నదియుఁ జెప్పలే'దనెను.

---

# ఇరువదిరెండవప్రకరణము.

## కుంతలమ్మగది.

ఊరాచ్చికోటలో నేయుదయమున నంబికాపతి బయలు దేరెనో యాయుదయమునఁ బశుపతి గుఱ్ఱముమీఁద నెక్కి యచటికి వచ్చెను. రాధ వెలుపలికి వచ్చి, తనలో "నెవరి నే నందఱికన్న మిన్నగ గౌరవించెదనో, యేరూపముచే నామనస్సును హరించెనో యట్టి పశుపతినిఁ జూచి నే నేల భయపడవలెను? ఎప్పు డతనిఁ గాంచఁ గలుగుదునా యని వేచియున్న నే నిపు డేల జంకవలెను? అతఁడు నాయెడల మనఃపూర్వకమైన ప్రేమ కలిగియున్నాఁ డనుటకు సందియమే లేదు. కాన నే నతనిఁ జూడ నిట్లు తొందరపడుట ధర్మమే." అని తనలో నాలోచించుకొనుచుండ నామెకు ముందుఁగా పఱదా తెఱచికొని నల్లనివస్త్రములు ధరించి శుష్కించిన కుంతలమ్మ వెలుపలికి వచ్చెను. అట్లామె యకస్మాత్తుగా వచ్చినందున రాధ యొకించుక చకిత యయ్యెను. వెంటనే కుంతలమ్మ "అయ్యో! నే నిట్లు తటాలున వచ్చి నిన్ను భయపడఁజేసితినే. నీవు భయపడకుము. అయిన నీయూరాచ్చికోటలో నందఱు నన్ను దయ్యమనియే యనుకొందురు." అన, రాధ, "నాకు భయమన్న మాటయే లేదు. మీగదినుండి యిక్కడకు వేఱుద్వారముంట నా కింతవఱకుఁ దెలియదు. నే నిక్కడకు వచ్చి పదిమాసములయ్యెను. ఇన్నినాళ్ళనుండి యున్న నాకుఁ దెలియనిదారి యిక్కడనున్నదే యని యాశ్చర్యపడుచున్నాను." అనఁగానే కుంతలమ్మ "ఈ సౌధముయొక్క రహస్యములు తెలిసికొనుట బహుకష్టము. ఎన్నియో విషయము లున్నవి. నాగదిని నీవు చూచితివా?" యనెను.

రాధ—లేదు.

కుంతలమ్మ—"చూచుటకు నీకు ధైర్యమున్నదా?"

రాధ—మీరు చూపించునెడల నేను చూచుటకు సిద్ధముగ నున్నాను.

కుంతలమ్మ—"రా! పోవుదము" అని చెప్పి పరదా నవతలికి లాగ నక్కడ నొక తలుపు కనఁబడెను.

దాని నొక గవాక్షముగ రాధ తలఁచియుండెను. చూచుట కది కిటికీవలె నుండెనుగాని, నిజముగా నొకతలుపు. ఈదారినిఁ బ్రవేశించుమని కుంతలమ్మ చెప్ప నిరువురు నా ద్వారమున లోపలికి వెళ్ళిరి. అక్కడనుండి కిటికీలను, తలుపులను దెఱచుచు రహస్యమార్గముగ కుంతలమ్మ రాధను తనగదికిఁ దీసికొనిపోయెను. ఆగది చేరఁగనే రాధకు శరీరము గగుర్పొడిచెను. ఎక్కడ చూచినను నల్లని పరదాలు. భూమిమీఁద నల్లనితివాచి. ఆగదిలో నుంపఁబడినకుర్చీలు మంచములు మొదలగునవి నల్లని కొయ్యతోఁ జేయఁబడియుండెను. రాధయొక్క మొగమును గుంతలమ్మ చక్కగాఁ బరికించిచూచి "ఈగదిని జూడ నీకు భయము పుట్టుటలేదా?" యన, రాధ, "ఇది యొక సమాధివలె నున్నదే" యనెను. "అవునమ్మా! రాధా! నీవు నిజము పల్కితివి. సూక్ష్మబుద్ధివి. ఇది సమాధి. నీకేమి తెలియును? దేవున కింక నామీఁద దయ రాలేదు. నాప్రతిజ్ఞ యెప్పుడు నెఱవేఱునో! నేను పాపము జేసితిని. అయ్యో! ఆ......చంపినవారి సంతమొందించి నా ప్రతిజ్ఞ తీర్చుకొనకుండ నేను పోవునదిలేదు" అన, రాధ "ఎవరిచావు? ఎవరు!" అనుచుండగనే కుంతలమ్మ "ఎవరా? చంపినది. నేను వారిని కనుఁగొనకుండ విడిచెదనా? నీవు అరుళ్‌నాథుని దారుణమరణమును గుఱించి వినియుండలేదా? అక్కడ కూర్చొనుము." అన రాధ, "ఇఁక నీవేమిచెప్పునో! అయ్యో! నే నెట్టి దారుణకృత్యమును వినవలయునో" అని భయపడి యామె చూపించిన యాసనముపైఁ గూర్చుండెను. ఆమె యట్లుకూర్చొన్నతరువాత కుంతలమ్మ "నాయొక్క కథను నీవు వినియేయుందువు. నావివాహముహూర్తమునకు ముందటిదినము నా భర్తయైన యరుళ్‌నాథుఁడు చంపఁబడెను. తోఁటలో బడియున్న శవమును మొట్టమొదటఁ జూచినది నేనే! నీవు దీనిని వినలేదా? ఈ సౌధములో నందఱికి నిది తెలియునే" యన, రాధ "అవును, బాలలత నాకు చెప్పినది. నే వినియుంటిని" అనెను.

కుంత——చెప్పెదను. ఏదినమైతే నాభర్తను జంపినవారినిఁ జంపి వారి
రక్తమును చూచెదనో యదే నా కవసానదినము.

అని దాపున నున్న యొక పెట్టెఁ దన తాళముచెవితోఁ దెఱచి యొకకత్తిని బయటికిఁ దీసి చూపెను. ఆకత్తి కందమైనపిడి యుండెను. అది చాల ప్రాఁతది. పామువంటి యాకారముగలిగి మధ్యకు మడువబడియుండెను. అది తెఱచినట్లయిన నారెండిటికి మధ్య కత్తి యుండెను. ఆ సర్పాకారముగల పిడికిఁ, బామునకుఁ గన్నులుండుచోట, రెండు ప్రకాశమానమైనరత్నము లుండెను. ఆపిడిమీఁద నొక చక్రము చెక్కఁబడి, ఆయాఁకుమీఁద రత్నములు, వజ్రము లమర్పఁబడియుండెను. రాధ దానినిఁ జూచి "అదిగో యాకత్తిమీఁదఁ గనఁబడు నెత్తుని గుర్తేమిటి" యన, కుంతలమ్మ రహస్యముగ రాధచెవిలో "ఇది రక్తము! నాభర్తయైన యరుళ్నాథుని పవిత్రరక్తము!"అనెను. 'అతని రక్తమని నీ కెట్లు నిశ్చయము ?' అని రాధ యడుగ, కుంతలమ్మ, సూర్యునిచూపించి సూర్యుఁడీతఁడనుట యెట్లు? చంద్రుని చంద్రుఁడని చెప్పుటయేల? సావధానముగా వినుము. నాభర్త చనిపోయి పడియుండ నాతనియొద్ద నీకత్తిని జూచితిని. ఇవి యతనికిసమీపమున నున్న యొకచెట్టుక్రింద నాకులలో నుండెను. ఎన్నఁడునులేనికత్తి నాఁడక్కడి కేల రావలెను? దానిని గాంచినపుడు నాప్రాణములు లేచివచ్చినవి. ఇంతమాత్ర మాధారము చిక్కెఁగదా యని సంతసించి దానిని గైకొంటిని. ఆకత్తినిఁ జాలగౌరవముతోను, ప్రేమతోను దాఁచుచున్నాను. అది నాకుదారిచూపి సాహాయ్యముచేయకమానునా? అనేకులీతోఁటలో వెదకిరిగాని ఈకత్తి నాకండ్లకే కనఁబడుట కేదో విశేషమున్న దని భావించితిని. ఏమివిశేషము! నా ప్రాణనాథునిదయయే నాకుఁ గన్పడఁ జేసిన'దని దానినిముద్దుపెట్టుకునితిరిగిదానినిమడిచి పెట్టెలోఁబెట్టి తాళము వేసి తాళముచెవినిఁ దనకొంగున ముడివేసికొనెను. అట్లామె చేయుట రాధ చూచి యాశ్చర్యపడఁ గుంతలమ్మ'నే నిట్లు చేయుట నీకు నాశ్చర్యముగనేయుండును. కాని ఈకత్తివలనఁగలుగులాభములునీకుఁ దెలియవు. ఎన్నియో రహస్యము లీ కత్తివలన బయల్పడఁగలవు. నిస్సందేహముగా నిది నా బ్రతుకున కాధారము. ఈవిషయము నీకును, నాకు

నుదప్ప నింకెవ్వరికిఁ దెలియదు' అనెను. రాధ, "ఈవిషయమై నీ వెవరితో నాలోచనము చేయలేదా ?" అని యడుగ, కుంతలమ్మ 'ఊఁ, ఆలోచనయా! నా భర్తశవ మిక్కడకుఁ దేఁబడినపు డనేకులు ప్రభువులు, న్యాయవాదులు విచారణఁ జేసిరి. దానివలనఁ దేలిన దేమనగా వీ రందఱియొక్కబుద్ధి కాసునకుఁగూడ కొఱగాదనుటయే. తిరిగి వారినిఁ బిలిపించి యాలోచనఁ జేయుదు నని తలంపకుము. నే నెందుల కీ కత్తిని జూపితినో నీవు గ్రహింపఁ జాలవైతివి. నాభర్త దయవలన నే నెప్పుడును న్యాయమునే చేసెదను.' అనుచుండ, రాధ తన మనస్సులోని భావమును బయటఁ జెప్ప నుద్దేశించి "మంచిదమ్మా! ఆకత్తిసాహాయ్యమున నట్లు చంపినవారిని నీ వెట్లు కనుగొన గలవు?" అనగాఁ, గుంతలమ్మ "అవును, ఇది యొక చిహ్నము. ఈ కత్తి యెప్పుడైతే నాచేయిఁ జిక్కినదో యప్పుడే యా కత్తిగలవాఁడు కూడ చిక్కఁగలఁ డని తోఁచినది. ఏదినమున నే గంటయందు నా ప్రతిజ్ఞ నెఱవేరనున్నదో యప్పుడు ప్రాణనాథుఁడే నాకుఁ దెరువుఁ జూపించును. ఆ రహస్యములు వెలువడువేళ యున్నది. నా సంతోషోత్సాహములు పదిసంవత్సరములక్రిందటనే చచ్చినవి గాని, నేను చావలేదు. నా కింకను గాలము రాలేదు. ఆ కాలము వచ్చిన నా పని తీర్చి మఱి పోయెదను" అనిచెప్పి చాలించెను. కోపము, విచారము, పట్టుదల యనునవియే యాకారముఁ దాల్చి వచ్చెనేమో యనునట్లు నిలుచుండిన కుంతలమ్మను రాధ చూచి, "ఈమె కది సమకూరి తీరును. ఈమె ప్రతిజ్ఞ నెఱవేర్చుకొనును." అని తలంచెను. తాను మాటాడిన దంతయు రాధ మనస్సున కెక్కుట కుంతలమ్మ చూచి చిఱునగవుతో "అమ్మా! రాధా! నీ గుణములను నీవు వచ్చినదాది పరిశోధించితిని. నీ యొక్క నడవడిని గుఱించి సంతసించితిని. నీ యెడల నాకు నవ్యాజప్రేమము కలదు. అమృతవల్లి కట్లుకాదు." అన రాధ "అమృతవల్లి నన్ను ద్వేషించుచున్నది." యనెను. దానిని విని కుంతలమ్మ యాశ్చర్యపడి, "నీకు నిది తెలియునా? పూర్వమే నే నెఱుంగుదును. రమ్మ మనము పోవుదము." అని చెప్పి రాధను మరల నామెగదికిఁ దీసికొనివచ్చి వదలిపెట్టి పోఁబోవుచుండ

రాధ కుంతలమ్మను జూచి "ఈయూరాచ్చికోట సౌధములో నెక్కడఁ జూచినను రహస్యమున్నట్లున్న దే. అయిన నీ సౌధములో నొక్కొక్క గదికి వెళ్ళినప్పు డెప్పుడో దీనిని జూచినట్లే తోఁచుచున్నది. పిశాచపు గదియని చెప్పెదరే! దానికి సమీపమున నున్నగదిమాత్రము నే నెప్పుడును చూడలేదు"అనెను. కుంతలమ్మ దానిని విని యాశ్చర్య పడి "నీవు చూడలేదా! నీవు చూడలేదా? నేనుకూడ నా నాథుఁడు పోయినతరువాత నక్కడకుఁ బోలేదు. మంచిది. మన మిరువుర మచ్చటి కొకదినము పోవుదము." అన రాధ "గదితాళపుచెవి యమ్మ తవల్లియొద్ద నున్నదఁట. దాని నామె యెవ్వరికి నీయదఁట" యన, కుంతలమ్మ, 'నీవు దానిని గుఱించి యోజింపకుము. నే నడిగిన నామె యియ్యనని చెప్పదు. తప్పక యిచ్చును' అనెను.

# ఇరువదిమూఁడవప్రకరణము.

"పీలుపడదు."

రాధహృదయపీఠియందుఁ బశుపతివిగ్రహము ప్రతిష్ఠింపఁబడెను. కొలఁదిరోజులనుండి యతఁడు తన్నుఁ జూచుటకు వచ్చినప్పుడంతయు నాతనికిఁ గనఁబడకుండ నెటకో పోవుచుండెను. ఆమె యట్లు చేయుటచే వారిప్రేమ మధికమయ్యెను. రాధానురాగవల్లి పశుపతి హృదయ మను పాదున నాటుకొని క్రమముగఁ బెరుఁగఁజొచ్చెను.

ఒకనాఁడు పశుపతి తన తల్లియొద్దకు వచ్చి "అమ్మా! నీ వెప్పుడు నా యెడఁ బ్రేమయు, నాదరమును గలిగియుంట నాయొక్కయదృష్టమే. నీ దయయుండినఁ జాలు"ననియెను. తల్లి కుమారునిఁ బరికించి, "కుమారా! రాధను శీఘ్రకాలములో వివాహము చేసికొమ్మని" అనఁ బశుపతి "యదియే నాయభీప్సితము. దాని నెట్లు నెఱవేర్చుటయో నాకుఁ దోఁపకున్నది.'' యనఁ దల్లి "నీ కట్టికోరిక యున్న యెడల నీవు రాధ నావిషయ మడుగుము. దాని కామెయేమియునడ్డము చెప్పదు. ఆ పిల్ల దేవాంశసంభూతురా లనుటకు సందేహము లేదు. పోయి యడిగిరమ్మని" అనెను. అందులకుఁ బశుపతి 'రాధ సమ్మతించునో సమ్మతింపదో యను సందేహము గలదు. ఆమె కులగోత్రాదులు తెలియవే' యన, భాగీరథి "ఆమె యెటువంటి దైననేమి? ఎప్పుడైతే నాకొమరుని హృదయమును హరించెనో యట్టివనిత నాకు నిష్టమైనదే. ఇట్టి సురూపాతిశయముచే శోభించు సద్గుణవతి తప్పక గొప్పవంశమునందుఁ బుట్టినదని వేఱచెప్పవలయునా? లేక యామె సీతవలె నయోనిజయై యుండవచ్చు"ననఁ బశుపతి, "నీవంటి యుత్తమురాలినిఁ దల్లినిగాఁ బడయుటకు నే నెంతపుణ్యము చేసితినో" యని యుప్పొంగి 'ఇంకమీఁద నాలస్యము చేయుటచేఁ బ్రయోజనములేదు. రాధ నడిగి వచ్చెద' ననిచెప్పి యారాచ్చికోటకు వచ్చెను. రాధకొఱకు కొంచెము సేపు వెదకెను. సుబ్బన్న యను సేవకుఁడు పశుపతినిఁ దీసికొనిపోయి రాధయున్న స్థలమున విడిచెను.

రాధ యప్పుడు కొన్ని పువ్వులను మాలగా గుచ్చుచుఁ బటము లను వానిచే నలంకరించుచుండెను. తా నెదురు చూడని కాలిచప్పు డెవరిదియో వినఁబడఁగానే వెనుకకుఁ దిరిగి పశుపతినిఁ జూచి కొంచెము సిగ్గుపడి తిరిగి ధైర్యము తెచ్చుకొని "అమృతవల్లినిఁ బిలువవలయునా?" అనెను. పశుపతి "నే నామెను జూచుట కిప్పుడు రాలేదు. నిన్నుఁ జూచు టకే వచ్చితి" నని, "రాధా! నీ విన్ని దినములు నాకుఁ గనఁబడకుండ తప్పించుకొను చుంటివి గానఁ నేఁ డెవరితోను గబురు పంపక నే నే స్వయముగ నీ గదికి వచ్చి నిన్నుఁ గనుగొంటిని. నేను జెప్పునది నిజమేనా?

రాధ—నేను నిశ్చయముగా మిమ్ములఁ జూడ నిష్టము లేక దాఁగు కొనుచుంటిని.

పశుపతి—అట్లయిన నన్నుఁ జూచుట నీ కిష్టము లేదా?

రాధ—మీసాన్నిధ్యముచే నా హృదయ మానందము చెందును.

పశుపతి—అట్లుండియు నాతో సంబంధము కలిగించుకొనుట నీ కిష్టము లేదా?

రాధ "అవును" అని సిగ్గుతోను, విచారముతోను బలికెను. ఆమె యిట్లు చెప్పునప్పుడు కొంచెము యోచించి, మెల్లగ నొక్కొక్క యక్షర ముచ్చరించినందునఁ బశుపతి "నన్నుఁ జూచునపు డంతయు నీ వానందముఁ జెందెద నంటివి. నా సంబంధము నీ కిష్టము లేదను చున్నావు. ఈ రెంటికిని సమన్వయము నాకుఁ గుదురలేదే" అనెను. రాధ దీనిని విని యేమియు మాటాడుట కిష్టము లేన ట్లుండెను. ఆమె ముఖము చిన్నబోయియుండెను. ఆమె తనువు వణఁకుటచేఁ జేతిలో నుండు పూవు గాలిచేఁ గదలుచున్నట్లు కదలసాగెను. అంతటఁ బశుపతి, "నిజము చెప్పుదునా! బహుకాలమునుండి మాతల్లియు నేనును వెదకి వెదకి యమూల్యరత్నమ వగు నిన్నుఁ గాంచితిమి. ఇన్నిదినము లెంత మందినిఁ జూచినను మామనస్సులకు సరిపడక నీవుమాత్ర మనుకూల పడితివి. మా తల్లి యిష్టప్రకార మామెకుఁ గోడలవై నా హృద యము నానందపఱచెదవా?" అనెను. దీనిని వినిన రాధకు ముఖ

కమలము వికసించెను. కాని వెంటనే ముకుళించెను. నోట మాట రాక యెట్టకేలకు "అయ్యా! మీరు నాయందుఁ బ్రేమ కలిగి యుంట నా యదృష్టము. మీ రుత్తములు. ధనవంతులు. మీ భాగ్యము ననుభవింప నా కదృష్టములేదు. నేను మీకుఁ దగిన దానను కాను." అని పొరలిపొరలి వచ్చు కన్నీటినిఁ దన యావచ్ఛక్తి నుపయోగించి యడఁచుకొనెను. పశుపతి "ప్రేమపుంజమా! రాధా! మహారాజ్ఞి కేలాటిభాగ్య ముండవలెనో యట్టి భాగ్యదశ యందే నీ వెప్పుడు నుండఁగలవు. దానికి సందేహమే లేదు. నీయెడల నాకుఁ బ్రేమ నేల కలిగించినాఁడో యీశ్వరుఁడు, నాకుఁ దెలియదు. నీవు నన్నుఁ బెండ్లిచేసికొనవా?" అని పశుపతి యనుచుండఁగనే, రాధ "వీలుపడదు" అనెను.

పశుపతి యత్యాశ్చర్యముతో నామెను జూచెను. ఇట్టి జవాబామెముఖమునుండి వెలువడునని యతఁడు నిరీక్షింపలేదు. వెంటనే యతఁడు రాధను చూచి "రాధా! నీ విది చెప్పఁదగినదికాదు. ఏదో నోరు తెఱచి పరధ్యానముతోఁ జెప్పితివి కాఁబోలు. నేను నమ్మనే నమ్మను. నీవు నన్ను వివాహముచేసికొనవలెను." అన, రాధ "వీలు పడదు." అనెను. ఈ పర్యాయముకూడ నామె యేమో పొరపాటునఁ జెప్పినదని నమ్మలేదు. ఆమె చెప్పినయర్థ మామెముఖమున వెల్లడియగుట నతఁడు గాంచెను. పశుపతి "అట్లయిన నేను మూఢుఁడను. ఇంతకాలము నీవు నాయందుఁ బ్రేమయు నాదరమును గలిగి ప్రవర్తించుచున్నావని తలఁచిన దంతయు వ్యర్థమే? నావంటి మూఢుఁడు బుద్ధిహీనుఁ డీలోకమున మఱియొకఁడు లేడని తెలిసికొనుటకే కాఁబోలు నే నిక్కడ కీ దినము వచ్చుట" అని సహింపరాని దుఃఖముతో ముఖము నవలఁ ద్రిప్పుట రాధ చూచి "అట్లు మీరు మిమ్ములగురించి వ్యర్థముగా దూషించుకొనఁగూడదు. మీ రెప్పటికిని మూఢులుకారు. బుద్ధిహీనులునుగారు. నేను చూచినవారందఱిలో మీరే బుద్ధిమంతులు. నన్ననలేక యనవసరముగ మీరు మిమ్ముల నిందించుకొని యిట్లు చింతింపనేల" యని కోపముతో ననెను. పశుపతి "నేను బుద్ధిహీనుఁడ ననుట కీయుదాహరణ మొక్కటియే చాలును. వేఱేమి కావలెను? నీవు

చూపుచుండిన యాదరముచేఁ బరవశుఁడనై నీవు నాయందుఁ బ్రేమఁ గలిగియుంటి వని నమ్మి మోసపోయితిని. ఇంతకన్న వేఱుపిచ్చియున్నదా?" యన, రాధ "మీరు తలఁచుచుండిన దంతయు నిజమేకాని వేఱుకాదు..." అని యేమో చెప్పఁబోవుచుండఁ బశుపతికిఁ బోయిన ప్రాణము తిరిగి వచ్చినట్లుండెను.

పశుపతి——రాధా! ప్రేయసీ! సుగుణరాశీ! అట్లయిన నన్ను నీవు వివాహమాడుట నిశ్చయము. నిజమైనప్రేమ నాయెల నీకుఁ గ్రలదుగదా!

రాధ "సందేహము లేదు." అని నిష్కళంకముగను, స్ఫుటముగను, నాదరభావముతోను జెప్పి "అయినను మిమ్ముల నేను వివాహము చేసికొనుటకు మాత్రము వీలుపడదు" అనెను.

పశుపతి "ఏల వీలుపడదు?" అని పరితాపము సూచించు స్వరముతో నడుగ రాధ, 'దీనికిఁ గారణముమాత్ర మడుగకుఁడు.' అనుచుండఁ బశుపతి "రాధా! నిన్నుఁ గారణ మడుగుటకు నా కధికారము గలదు. నాయందుఁ బ్రేమ యున్నదంటివి. ప్రేమయుండియు నన్ను వివాహము చేసికొన ననెదవు. ఇది యొక సమస్యగా నున్నది. దానిని విప్పి చెప్పుటకు నాకు సాధ్యపడలేదు." అనెను.

రాధ——మిమ్ములనే త్రికరణశుద్ధిగాఁ బ్రేమించితిని గాని మిమ్ముల వివాహమాడఁ జాలను. చక్కగా యోజించి చెప్పితిని. మిమ్ముల వివాహమాడునట్టి యోగ్యత నాకు లేదు. భాగ్యమున కాశబడి, నేను వివాహమాడిన మీగౌరవమునకు భంగము కలుగును.

పశుపతి లేచి "రాధా! నా కింకను నీపలుకు లర్థము కాలేదు. ఏల నీవు నన్నుఁ బెండ్లిచేసికొన ననెదవు? ఉన్నది యున్నట్లు చెప్పుము" అని యామె రెండుచేతులఁ బట్టుకొని బతిమాలగా రాధ "కారణములు చెప్పెద వినుఁడు. వియ్యమునకుఁ, గయ్యమునకు, నెయ్యమునకు సమత వలయునండ్రు, మీరు ప్రభువులు. మీపదవి యెక్కడ?

నాపదవి యెక్కడ? ఏతల్లిదండ్రులు నన్ను మీకుఁ గన్యాదానము చేయుదురు? తల్లిదండ్రులులేని యనాథనైన నేను నా కీనాఁటి కిట్టి భాగ్యము కలిగినదని మిమ్ములఁ వివాహ మాడ సమ్మతించుట భావ్యమా ? నలుగురిలో మీ భార్య నని నిలుచుటకు నా మన స్సెట్లొప్పును ? ఇది యంతయు మీ గౌరవమునకు భంగముగదా! అట్లు జీవించుటకన్న మరణ ముత్తమము. భార్యయన్న భర్త కర్థ శరీరము. నా కీ జన్మమున మిమ్ముఁ జెట్టవట్టునట్టిభాగ్యములేదు. మీరు మీయొక్క గొప్ప గుణమువలన నే ననాథ నని మఱచితిరి. ఇట్టి విషయములఁ దొందరపాటు తగదు. ఆజన్మాంత మనుభవింపవలసిన విషయము'' అని రాధ నవరసము లొలుక భాషింపుచుండఁ బశుపతి "రాధా! నిన్ను విడిచి వేఱొక వనితను నేను భార్యగాఁ గైకొనను. ఇది నిశ్చయము. నీకు నాయెడఁ బ్రేమ గలదని నీవు నోరు తెఱచి యొప్పుకొంటివి. నీవే నాభాగ్యము. నీవే నా జీవితము. నీతోడిద నాకు లోకము" అని పశుపతి చెప్పఁగా రాధ 'నే నిదివఱకుఁ జెప్పినదంతయు నర్థము కాలేదు కాఁబోలు. మిణుఁగురుపురు గెక్కడ? నక్షత్ర మెక్కడ? కాగడ యెక్కడ! చంద్రుఁ డెక్కడ? రాధ యెక్కడ? పశుపతి యెక్కడ? అయ్యో! నే నింటిలోనికిఁ బోవలెను. సెల వొసఁగుఁడు. నే నింకఁ బోవచ్చునా?' యనఁ, బశుపతి "రాధా! నీ విట్లు చెప్పిపోవుట న్యాయమా? ధర్మమా? ఈశ్వరునకైన భయపడ నక్కరలేదా?" యని గద్గదస్వరముతో ననెను. రాధ యప్పుడుకూడ నెంతమాత్రము సందీయక "మీరు నేనీ విధముగాఁ జెప్పిపోవుట తలఁచి పిదప సంతోషించెదరు, కాని వ్యసనపడరు. కాలమువచ్చును." అని పోఁబోవుచుండఁ బశుపతి మిగుల పరితాపముతో "రాధా! ఒక నిమిషము నా నిమిత్తము నిలిచెదవా? అంత త్వరగాఁ బోనవ సరములేదు. నీ తల్లిదండ్రుల విషయము నాకుఁ గాని, మాతల్లికిఁ గాని యనుమానములేదు. సింహముకడుపున సింగఁపుబిల్ల పుట్టునుగాని యన్యముకాదు. ఉత్తమురాలు కావలె ననునదియే మాయిద్దఱకు నభి ప్రాయము. ఒకవేళ, సీతవలె నీ వయోనిజ వగుదువేమో యని మా యమ్మ యన్నది. సత్యముగాఁ జెప్పుచున్నాను. మాతల్లి నిన్ను సాధా

రణమైన బాలిక యని భావింపక తన కుమార్తెవలెఁ జూచుకొనును. ఆమెకుఁ గోడలు, కూఁతురు, రెండును నీవే! నా మీఁదకంటె నీ యెడలఁ బ్రేమాధిక్యము కలిగియుండును. నిన్నుఁ బెండ్లి చేసికొన కుండిన వేఁ యొకతెను నేను కన్నెత్తియైనఁ జూడఁజాలను. ముమ్మాటి కిని నమ్ముము. నీ వెంతగాఁ జెప్పినను నేను దిరిగి వేఁడుకొనెదను. నా మంత్రిమాత్రివగు ని న్నెన్నిమారులు బతిమాలినను పాపము లేదు. నీవు నాకు భార్యగా నుండుట కంగీకరింపుము. అనుగ్రహింపుము. రాధా!" అని కన్నీరు విడువంజొచ్చెను. రాధ "నే నొప్పుకొనఁ జాలను" అని మృదువుగాఁ జెప్పి మెఱుపుతీఁగవలె మరలిపోయెను.

---

# ఇరువది నాల్గవ ప్రకరణము.

బాలలత వివాహ నిశ్చయము.

పశుపతి తనను వివాహమాడు మని రాధను గోరుచుండు సమయమునఁ బచ్చయప్పగారితోఁటలో నింకొక మూల మఱియిరువురు వారి వివాహవిషయము మాటలాడుచుండిరి. వా రెవరనః బాలలతయుఁ, బినాకపాణియు. వారు మాటలాడునట్టి స్థలము నిశ్శబ్దముగ నుండెను. ఆ తోఁటలో నీశాన్యమూలయందు నొక రావిచెట్టుక్రింద నరుగుమీఁద నమృతవల్లి యొక వేఁపచెట్టువేసి పెంచి రావిచెట్టునకు వేఁపచెట్టునకుఁ బెండ్లిచేసెను. ఒక సంపంగితీఁగె రెండు వృక్షములను బంధించుచుఁ బ్రాఁకి పుష్పించి కమ్మనితావుల వెదజల్లుచుండును. ఆ చెట్లక్రింద నాగప్రతిష్ఠ గావింపఁబడెను. నాగములమధ్య నున్న కృష్ణమూర్తియే వా రిరువురిమాటలకు సాక్షిగా నుండెను.

పినాకపాణి బాలలతను గాంచి "చాలదూరము తోఁటలోఁ దిరిగినందున నీవు బడలిన ట్లున్నావు. అదిగో! పెద్దయా కచ్చట నున్నది. దానిని విసనకఱ్ఱగాఁ జేసి విసరెద" నన, బాలలత నవ్వి "అక్కఱలేదు. రావిచెట్టుచల్లఁదనము, వేఁపచెట్టు చల్లగాలి యుండ వేఱు తాళవృంత మేల?" అనెను. వా రట్లొంటరిగా నున్నప్పుడు పినాకపాణి బాలలతను జూచి "మన వివాహమునకై మీ యమ్మ యేల యాలసించుచున్నది? శుభస్య శీఘ్ర మ్మన వినవే?" యనెను. బాలలత "నేను మీకుఁ దగినదాన నని తోఁచినయెడల నందుల కేమి యభ్యంతరము" అనెను. నిశ్చయముగ నతఁడు బాలలతయెడఁ బ్రేమ గలిగియుండెను. రాధకుఁ దనయెడలఁ బ్రేమ లేదని తెలిసిన తరువాత ప్రేమనంతయు బాలలతమీఁదఁ బ్రసరింపఁజేసెను. బాలలత "మన సంభాషణము నమ్మతో నేఁ జెప్పుదునా?" యని యడుగఁగ, "నందుల కేమి యడ్డుకలదు? మీతల్లికే కాదు; ఇంక నెవరెవరికిఁ దెల్పవలెనని నీ కిష్ట మున్నదో వారికి నీవు నిర్భయముగఁ దెలుపవచ్చు" నని పినాకపాణి చెప్పెను. వెంటనే వా రా స్థలము వదలి యిల్లు చేరిరి.

అమృతవల్లికి నీవిషయము బాలలత యెఱింగించినప్పు డామెకుఁ గలిగిన యానందమునకు మితియే లేదు. ఆమె పినాకపాణియొద్దకుఁ బోయి "మీయిష్ట మెట్లున్న నట్లు జరిగించెదను. పదిదినముల కొక ముహూర్త మున్నదఁట. ఆముహూర్తముననే మీ వివాహము గావించెదను. ఈ నిమిషమే మొదలియారుగారికిఁ దంతియిచ్చెదను. మిమ్ముల నల్లునిఁగాఁ బడయుటకన్న నాకు వేఱుభాగ్యము కలదా? నాకు నొక్కతెయే కుమార్తె యనుట మీకుఁ దెలిసినదే కదా! ఆమెజాతకము మీజాతకమునకు ననుకూలపడి బహుకాలము సౌఖ్యము లనుభవించుఁగాక!" యనెను.

కుమార్తెతోఁ గూర్చొని యమృతవల్లి వివాహవిషయమై యేమేమో మాటాడుకొనుచు శుభలేఖ వ్రాఁయుసిద్ధపఱచుకొనుచుండఁ దలుపు తటాలునఁ దెఱువఁబడెను. అప్పుడు సుబ్బన్న ప్రవేశించి "అమ్మా! కుప్పుస్వామి వచ్చి వేచియున్నాఁడు. మీతోఁ గొన్ని రహస్యములు మాటాడవలెనఁట." అనెను. ఇంతలో నెవరిదో కాలిచప్పుడు వినరాఁగానే యమృతవల్లి తిరిగిచూచెను. అతఁ డెవ్వరోకాదు. కుప్పుస్వామియే.

కుప్పుస్వామి "నే నిప్పుడు వచ్చినకార్యము మిక్కిలి ముఖ్యమైనది. నేను మీతో రహస్యముగా మాట్లాడవలెను." అని బాలలత వంకఁ జూడ, నమృతవల్లి "అవును, చాలును. మీ రింతదూరము వచ్చుట మిక్కిలి ముఖ్యకార్యమే" అని కోపముతో ననెను. బాలలతయును దరువాత వచ్చెదనని బయటికిఁ బోయెను. సాయంకాల మగుటచే సుబ్బన్న దీపము వెలిగించిపోయెను. అటు లతఁడు దీపము వెలిఁగించి పోయినతరువాత నమృతవల్లి కుప్పుస్వామినిఁ జూచి "మీ రిట్లు నా యాజ్ఞ మీఱి వచ్చుట న్యాయ్యమేనా ?" అనెను. కుప్పుస్వామి యొక నిమిష మామెముఖ మట్టె పరికించి చూచి, "బాలలతను బినాకపాణి కిచ్చుటకు నిశ్చయించినట్లు వింటిని. నిజమా? యథార్థ మని యందఱు చెప్పుచున్నారు. గొప్పవారింటివివాహ మగుటచే జన మంతయు సంతసించుచున్నారు." అని యతఁడు చెప్పు మాటల ధ్వనిలో నేదో యొక వికార మమృతవల్లికిఁ దోఁచుటచే నాతని

ముఖమువంక నిదానముగాఁ జూడసాగెను. అతఁ డప్పుడు, తల మొదలు కాళ్ళవఱకు తెల్ల దుస్తులు ధరిచియుండెను. హృదయము తటతట కొట్టుకొనుచుండెను. ధైర్యము తెచ్చుకొని, యతఁ 'డేనాఁటి కిని నమ్మ సాధ్యముగానిది; మీకుమార్తెను బినాకపాణి కిత్తురను వార్త వింటిని' యనెను. అందుల కామె 'నమ్మసాధ్యముకాని దానిని మీరు నమ్మకూడదు. వివాహము నిశ్చయమైనది. బాలలతను బినాకపాణికే యిచ్చెద'ననెను. దీనిని కుప్పుస్వామి విని రెండు నిమిషము లూరకుండి, "అట్లయిన నింతకాలము నన్ను మోసపుచ్చుచుంటివి." అన, నమృతవల్లి "ఏమీ! నిన్ను మోసపుచ్చుచుంటినా? ఏవిషయమున? వివరముఁ జెప్పుము." అని యధికారము సూచించు స్వరముతో నడిగెను. కుప్పుస్వామి యామెవంకఁ జూచి, "అమ్మా! మీ కొమార్తెను నా కిచ్చునట్లు వాగ్దత్తము చేసినసంగతి మఱచి పోయినట్లున్నారే? ఇందులకేకదా నే నిన్నిదినములు వేచియుండినది." అనఁగా, నామె "మీరా నాకొమార్తెను జేపట్టువారు?" అనుచుండఁ, గుప్పుస్వామి "ఏల మీకొమార్తెను బెండ్లిచేసికొనఁదగను? నాకుఁ గులము తక్కువా? చదువు సన్నమా? శీలము కొఱఁతయా? రూపము లోపమా? ప్రాయముకాదా? శ్రీమంతుఁడనుగానా? నేను వకీలును, మాసమునకు వేయి, రెండువేలరూపాయలను సంపాదించెదనే" యన, నందుల కామె "అంతయు నావలననేకదా" యనెను. "అవును నేను గృతఘ్నుఁడనుగాను. మీదయయుఁ గలదు లెండు. కాని నేను దరిద్రుఁడ నని చూపించిన దయకాదు. కారణము తెలియునా?" యనెను. అమృతవల్లి మాటుమాట చెప్పలేక, 'నే నెప్పుడును మీ కుపకారము చేయుచుంటిని' అనెను. 'బాలలతను నాకు భార్యగాఁ జేయవలసిన సమయము వచ్చినప్పుడిట్లు నన్నుఁ జేయివిడుచుటన్యాయ్యమేనా?'యని కుప్పుస్వామి యనుచుండ, నమృతవల్లి "కుప్పుస్వామీ! యెప్పటికి సాధ్యపడదని నమ్ముము. నాకూఁతురు పచ్చయప్ప ప్రభువునకు జనించినది గదా?" యన, కుప్పుస్వామి "అవును, నేను మాత్రము సాధారణుఁడనుగాను. వాగ్దత్తము చేసిన విషయము నెఱవేర్చినఁ జాలును. మీకొమార్తె నిచ్చి నా కేల పెండ్లిచేయఁగూడదు? నే నీ స్థలమును విడిచి

యడు గవతలఁ బెట్టను. నీక్షేమమునకే యిట్లు నే రహస్యముగ మాట్లాడవచ్చితిని. అంతకోపము కూడదు. మనయిరువుర మధ్య నుండు రహస్యము మూఁడవవానికిఁ దెలియకుండ దాఁచితిని. తెలిసిన సిగ్గుచేటు. ఒక నిమిషము నిదానించుము." అన నమృతవల్లి యాఁడు గఱచుచు, నాఁడుపులివలె గాండ్రించుచుఁ గోపముతో "కుప్పుస్వామీ! నే నెన్నిదినములు నీబాధ సహింపఁగలను? అన్నిహింసలకు నొకపరిమితి గలదు. నీవు నన్ను బెట్టుహింసకుఁ బరిమితియే లేదు. ఇంక నే సహింపఁజాలను. నీవు జాగ్రత్తగలిగి ప్రవర్తింపుము." అనెను. దీనిని విని కుప్పుస్వామి యామెను దృణమునువలె నలక్ష్యముతోఁ జూచి "నీవు నన్నీ ప్రకారము భయపెట్టనక్కఱలేదు. నీవిషయము నాకుఁ దెలియనిదికాదు వీని కంతకు నే భయపడఁబోవువాఁడను గాను. కాని మనయొక్క నడత లొండొరులు తెలిసికొనుట మంచిదికదా! నే నిప్పుడు చెప్పుటమాత్రమేకాదు. నాకధికారముతో నడుగుశక్తియుఁ గలదు. బాలలతను బినాకపాణికి నిచ్చి వివాహమొనర్చుట యీక్షణమే నిలుపవలెను. నీ వామెను నాకిచ్చునట్లు మఱల వాగ్దత్తము చేసి తీరవలెను. తెలియునా?" యన, 'నయితే పచ్చయప్పగా రందులకు సమ్మతింపకున్న నే నేమిచేయుదు? లోక మేమనును?' అని యామె చెప్ప, 'నందుల కతఁడు "లోకమా? నీకును నాకును లోకమనియొకటి కలదా? ప్రపంచమును మనయిష్టము వచ్చినట్లు త్రిప్పఁగలము. ఆవిద్యలో మన మిద్దఱమును సమర్థులమేకదా"యనెను. దీనిని విని యమృతవల్లి నీ విదివఱలో నేమియడిగిన నిచ్చుచుంటినికదా? నా కున్న దొక్క కూఁతురు. అది కేవల మమాయిక. దానిని విడిచి నీవింకేమి యడిగినను సరే యడుగుము. ఆవిషయముమాత్ర మాశ వదలుకొను"మని నుడివెను. అతఁడు "నా కేమియు నుచితముగ నియ్యలేదు. విధిలేక యియ్యవలసివచ్చినది యిచ్చితివి. నీకూఁతు నిచ్చి పరిణయముఁ గావింపుము. లేదా, నీమానము దక్కదు. నీపరువు తీయుదును." అని బెదరించెను.

బాలలత తన తల్లియుఁ గుప్పుస్వామియు మాటలాడుచున్న పరుషవాక్కుల నాకర్ణించి, "అమ్మా! ఏమి విషయము? నీ విట్లేల భయపడి యున్నదానవు? నేను పినాకపాణిని బిలుతునా?' యన,

నమృతవల్లి వలదని తనతల నడ్డముగఁ ద్రిప్పెను. కుప్పుస్వామి గొల్లున నవ్వసాగెను. "నీ కీ విషయములో మాత్రము రహస్య మావశ్యక మని తెలియునా! అమృతవల్లీ!" యని యతఁ డనెను. "మంచిది; నీ విప్పటికిఁ బోవచ్చును." అనఁగా, నతఁడు "అట్లయిన రేపు రావచ్చునా!" యన, 'నట్లే' యని యమృతవల్లి తలయూఁచెను.



# ఇరువదియైదవప్రకరణము.

అంబికాపతి.

మన మిప్పు డంబికాపతివిషయమై కొంచెము విచారింతము. అతఁడు కామాక్షయ్యగారి భవనములో నుండినప్పుడు మాటిమాటికి నలమును గనుఁగొని మాట్లాడుచు సంతోషముతోఁ బొద్దులు పుచ్చుచుండెను.

ఒకనాఁడు మీనాక్షి గదిలోఁ బుస్తకములను సరిగాఁ బెట్టుచుండినపుడు "ఏమే, ఏమే" అను ధ్వని వినరాఁగా నామె తిరిగిచూచెను. అంబికాపతి యలముతో నెట్లు ప్రవర్తించుచున్నాఁడో నీ వది చూచితివా ?" యన నామె "యంబికాపతి యలముయొక్క మేలుగుణముల శీఘ్రకాలములోనే గ్రహించినాఁడు. నే నిదివఱకుఁ జూచిన స్త్రీలలో నలము సాధ్వి, మంచిది, గుణవతి. ఆమె మనపిల్లల కుపాధ్యాయగా నుండుట మనభాగ్యము" అనెను. కామాక్షయ్యగారు "ఒకవేళ నీ ప్రేమ ముదిరి యంబికాపతి యలమును బెండ్లిచేసికొనునేమో ? అట్టి సందేహము నీకుఁ గలుగలేదా?" యన, మీనాక్షి నాకు నట్లే తోఁచుచున్నది." అనెను. దీనిని విని యాతఁడు గదిలో నటునిటు పచారిచేయుచు, "నట్లయిన అమృతవల్లిప్రభ్వికుమారుఁడు మన యింటి యుపాధ్యాయను బెండ్లిచేసికొనె నన్న యపవాదము మనకు రాఁగూడదు." అన, నాయనభార్య "అట్లంబికాపతి వివాహముఁ జేసికొన్న తప్పేమున్నది? సమ్మత మైనయెడల వార లెందులకు పెండ్లిచేసికొనరాదు?" అనఁగ నాతఁడు "అట్లు లోకమంతయుఁ దలంపవలదా ? అలము తల్లిదండ్రులు లేనిది," యన, మీనాక్షి "అయిన నేమి! రంభను బోలిన సౌందర్యవతి, పార్వతివంటి గుణవతి, సరస్వతినిఁ బోలిన విద్యావతి. మీరే యి ట్టిసతీమతల్లి ననెద రని నే ననుకొనలేదు. లోకమా?" యనెను. దానిని వీని యాయన "మీనాక్షీ ! నీకు లోకమింకను దెలియలేదు. నే నలముయొక్కగుణాతిశయములను జక్కగా నరసితిని. నాకుఁ బుత్త్రిఁ డుండిన నే నలము నిచ్చి పెండ్లిచేసి యామెను

నా కోడలుగా గ్రహింతును. ఆమె గుణములను జూచి నేను సంతోషించినట్లు మరెవ్వరును సంతోషించియుండరు. అమృతవల్లి యొక్క పేరాస నీకుఁ దెలియదు. ఆమెకు ధనాశ మెండు. ఎక్కడనైనను ధనవంతురాలైనయెడ నట్టిది కురూపిణియైనను సరే తనకుఁ గోడలుగా నొనర్చుకొనును. ఈ కార్యము మనయింట జరిగినయెడల నామె యూరకుండదు." అనెను. మీనాక్షి "అంబికాపతి చిన్నవాఁడు కాఁడే! ఆతనికిఁ దగిన వయస్సు వచ్చినది. ఇష్టప్రకారము నడువఁగల యీడున్నది. ఏమిప్రపంచము? వస్తువుల నమ్ముట, కొనుట వలె వివాహవిషయములోఁ గూడ ననులోమవిలోమముల నొనర్చుచున్నారే? ఏమి యన్యాయము! మంచిశీలము, కులము, గుణము గల నాయికయు నాయకుఁడును దమకు నిష్టమున్న నేల వివాహము చేసికొనరాదు? ధనము లేని కారణమున గుణము కొఱఁతవడునా? అందఱకును న్యాయోపదేశముఁ జేయు మీరే యిట్లు వచింపనగునా?" యని లోనికిఁ బోయెను.

ఒకనాఁ డంబికాపతి యలమును జూచి "సుందరీ! నేఁ దలఁచినదంతయు బయల్పడనీయక నా మనస్సుననే యణఁచుకొనుచుంటిని. నీవెప్పుడును నే నడిగినదానికి బదులుచెప్పుటలేదే! నా సెలవులు కావచ్చినవి. చెప్పుము, నీకు నాయెడఁ బ్రేమకలదా?" యన, నల మంబికాపతినిఁ జూచి "మీరు నాయెడ నింత యనుగ్రహము కలిగియుండ నే నేల మీమీఁదఁ బ్రేమకలిగి యుండకపోవుదును?" అనెను. ఇంతలోఁ గామాక్షయ్యగా రంబికాపతిని బిలువనంపి, "అంబికాపతీ! నీ వెక్కడకుఁ బోయియుంటి"వని యడుగ "నేను కనకగిరి చూడఁబోయితిని. తళిగలో నుండు కోవెల మిక్కిలి యందమైనదని వింటిని. దానిని రేపు చూచి రావలె ననియున్నది. ఆ కోవెల మిక్కిలి పురాతనమైనది. అక్కడ శిలాశాసనములు, తాతిపనులు మిక్కిల ప్రసిద్ధములు." అనఁగా నాతఁడు "నీ వొంటరిగాఁ బోవుచున్నావా?" యన నంబికాపతి "జన్మ మెత్తినతరువాత నే నొంటరిగా నెక్కడకుఁ బోయినదిలేదు. అలముకూడ వచ్చెద నన్నది.ఆమెనుగూడ తీసికొనిపోయెద" ననెను. దానిని విని "అంబికాపతీ! నీవు కోవెలకుఁ బోవుటలేదు.

నీ నాశనమునకై పోవుచున్నావు తెలియునా ?" అని కోపముతో నన, నంబికాపతి మీరు చెప్పునది నా కర్థముకాలేదు.'' అనఁ గామా క్షయ్యగారు "అవును నీ కిప్పు డర్థముకాదు. నీకుఁ గన్ను లగుపడుట లేదు. అల మందకత్తె, చదువుకొన్న దే! కాని నీవివాహవిషయములో నీవు మీతల్లినైన నడుగలేదు." అన నంబికాపతి "మాతల్లియా! ఆమె నాక్షేమము కోరునదికాదు. అపరకైకమ్మ. కొన్నివిషయములు సొంతముగాఁ జేయఁదగినవి యున్నవికదా?'' యనెను. దానికి నాతఁ "డవును చేయవచ్చును. అయితే యీ విషయమునుగుఱించి మీతల్లికిఁ దెలియదు. దీని నంతయుఁ జూడ నీ నాశనము నీవు దెచ్చుకొనుచున్నా వనుట నిశ్చయము. నాగృహములో నిది జరిగిన నా కపవాదము సంభ వించును. కాన నీ వీక్షణము మాయిల్లు వదలి, వేఱుస్థలమునకుఁ బోవలయు'' ననెను. అంబికాపతి యీ సంభాషణమున కర్థముగ "తన్నిల్లు విడిచి వేఱుగ పొమ్మనుటయా''యని యడుగ, నాయన "నే నెపుడును నాయింటికి వచ్చినవారిని నాయిల్లు విడిచి పొమ్మని చెప్ప లేదు. అయితే నీ కీవిషయములోఁ జెప్పవలసివచ్చినది'' అనెను.

అంబికాపతి "నేను మీ యొక్క దయకుఁ బాత్రుఁడను గదా. నే నెప్పుడైన మీకుఁ జెడ్డపేరు తెచ్చునట్లు నడచితినా ?'' యన నాతఁ "డబ్బాయీ! నీవు మంచివాఁడవు బుద్ధిమంతుఁడవు ననుటకు నే యాక్షేపణము లేదు. అయినను నీ సమయములో నేను నీయెడ నను గ్రహముఁ జూపఁగూడదు.''అనెను. దాని కతఁడు 'నేను మీయింటిలోఁ గొంచెము కాలము మాత్రమే యుండ వచ్చితిని. గుఱ్ఱపువానినిఁ బనివానిని వెళ్ళుమన్నపుడు మీరు వారికి రెండునా ళ్ళవకాశ మీయ రా! అంత మాత్రపుఁ గరుణమైన మీశిష్యునియందుఁ జూపఁగూడదా?' యన నాతఁడు "అట్లుకాదు. వెళ్ళవలె" ననెను.

ఒకవారము నాకు సావకాశ మీయవలయు నని బతిమాలఁగ నాయన "ఒకవారమా! ఈలోపల నీవు వివాహము ముగించుకొను టకా?" యని పలికెను. దానిని విన్నప్పు డంబికాపతికిఁ గోపము వచ్చెను. "మంచిది! మీ రింతదూరము చెప్పుచున్నందున నిదిగో!

మీ భవనమునకు సమీపమున నొక గుడిసె యున్నది. ఎంత యద్దె యడిగినను సరే యిచ్చి యీ క్షణమే పోయి యక్కడనుండి మీ సాన్నిధ్యమున నే నాపని నెఱవేర్చుకొనియెద. ఇట్లు నన్నిల్లు వెడలఁ గొట్టుట మీ కపవాదము లేదుకాఁబోలు! ఆ గుడిసె యధికారిని నే నెఱుంగుదును" అని యనుచుండఁ గామాక్షయ్యగారు కొంచెము యోచించి 'అంబికాపతి పట్టినపట్టు వదలఁడు. అట్లే కావించును. ఇతని నిప్పు డనుపుటవలన లాభ మేమియులే' దని మనస్సునఁ దలఁచి "జేపటిదినము మాత్రి మిచట ని న్నుండనిచ్చెదను. ఎల్లుండి యీ యిల్లు విడిచిపోవ సమ్మతమా!" యని యడిగెను. "అంత గొప్ప మనస్సుతో నొక్కదినము గడువు నిచ్చినారు. అంతియ చాలును." అని విచారముతో నంబికాపతి చెప్పెను. 'నీ కింత కోపమేల ? ఇంతయు నీ నడతవలన సంభవించినది గాని నా వలనఁ దప్పులేదు' అనుచుఁ గామాక్షయ్యగారు లోపలికి వెళ్లిరి.



# ఇరువదియాఱవ ప్రకరణము

## అలమేలు వివాహము.

మఱుసటిదిన ముదయమున నలమేలు తెల్లపట్టుచీరెఁ గట్టుకొని సౌందర్య మొప్పార వే ఆభరణముల ధరింపక తల్లిగలో నుండు కోవెలకు నంబికాపతితోడఁ బ్రయాణ మయ్యెను. ఆ నాఁ డామె సౌందర్యము నంబికాపతి కాంచి, 'యింతకన్న నందకత్తె లీ లోకమునఁ గలరా?" యని భావించి 'చాలదినములనుండి నమ్మియున్న గురువే యీ వివాహమునకు నడ్డము చెప్పుచున్నాఁడు. ఈ నాఁడు తామసించిన సమయ మెట్లుండునో? ఇంక నెన్ని విఘాతములు కల్గునో ? శీఘ్రములో నీ వివాహము నెఱవేర్చికొనిన మంచిది.' అని యోచించెను. అలమునకుమాత్ర మా దినము వివాహార్థ మంబికాపతి కోవెలకుఁ బోవుచున్నాఁడని తెలియదు. ఏదో సాధారణముగా వేడుకఁ జూచుటకుఁ బోవుచున్న ట్లెంచెను.

ఇల్లు వదలి కొంచెముదూరము వా రట్లు పోయినతరువాత నంబికాపతి "నే నొకవిషయము నీతోఁ జెప్ప నుద్దేశించియున్నాను. దానినేవిధముగాఁ జెప్పవలెనో యని యోచించుచున్నా" ననెను. మీ రేమి చెప్పినను వినుటకు సిద్ధముగానున్నా' నని యలము పలుక నంబికాపతి "ప్రేయసీ! ఇంక స్వల్పకాలములోనే మన వివాహము జరుగనున్నది." యనెను. దానిని విని యల మాశ్చర్యపడి "నిజముగానా?" యన, 'నిజమే, ఏదినము నీవు నన్ను వివాహమాడ వాగ్దత్తము చేసితివో యానాఁడే యెంత శీఘ్రముగా నిది జరిగిన నంతమంచి దని యెంచితిని. ఆలస్యము చేసినఁ జేతికి దొరకియు నోటికి లభింపలేదన్న సామెత యగును. మాతల్లికిఁ దెలిసిన విఘాత మొనర్పక మానదు. ఆలస్యము వలన నమృతము విషమగు నను వచనము వినలేదా? నాయెడల నీకు నమ్మకము కలదుగదా" యన నలము 'వేఁతే యడుగవలెనా ? ఇంత శీఘ్రకాలములోనా యని యాశ్చర్య పడెదను. మాయక్క రాధకుఁగూడ నే నీసంగతి వ్రాయలేదే! నాకుఁ దల్లివలె

నున్న మీనాక్షమ్మకుఁగూడ చెప్పలేదే" యనెను. దాని కంబికా పతి 'అన్నియు సావకాశముగఁ జేయవచ్చును. నేనింక మీఁదఁ గామా క్షయ్యగారియింటిలో నుండుటకుఁ గొన్ని విఘాతములు సంభవింప నున్నవి. నేను చెప్పినదానిని వినుము. పుట్టినదిమొదలు పరిశుద్ధవర్త నముగల నీకీ లోకములోని తంత్రములు తెలియవు. కేవల మమా యికవు సుమా.' అనెను.

ఇట్లు వారు మాట్లాడుకొనుచుఁ దళిగ యనుపట్టణముఁ జేరిరి. తళిగ పూఁదోఁటలకుఁ బ్రసిద్ధి, రమణీయమైనది. అక్కడ నంబికాపతి యొక పురోహితుని రావించి యాయన కధికధన మిచ్చి యానాఁడే యగ్నిహోత్రము సాక్షిగాఁ దనకు వివాహము జరపున ట్లేర్పాటు గావించెను. వివాహము జరిగి యాతోఁట దాఁటి వా రీవల వచ్చిన తోడనే యంబికాపతి యలమును జూచి "నీ విట్లు మనము రహస్య ముగా వివాహముఁ జేసికొన్నందుల కేమైన సందేహపడుచున్నావా?" యన నందులకు "అట్లు సందేహ ముండిన నే నేల నాసమ్మతినిఁ గనఁ బఱచి యుందును?" అని సిగ్గుచేఁ దలవంచుకొనెను. వీరల యన్యోన్య ప్రేమకు నపు డాకాశము, భూమియు, సూర్యుఁడు సాక్షులైరి. అంబికా పతి తనరెండు కన్ను లానందబాష్పములచే నొప్పారుచుండ "హృద యేశ్వరీ! ఇది మొదలు మనకు శుభకాలము. మనప్రేమకు నీశ్వ రుఁడు భంగము కలిగింపక మనలను గాపాడుఁగావుత" మనెను. అంబికాపతి యిట్లు నుడువునప్పుడు వారి సమీపముననున్న చెట్ల మీఁది పక్షులు 'తథాస్తు'ని యాశీర్వచనము చేసినవో యను నట్లు గానముచేసెను. పిమ్మట వా రక్కడక్కడ తిరిగి సాయంకాలము చీఁకటి పడువఱకుఁ బ్రొద్దుపుచ్చిరి. ఇంత ప్రొద్దు పోయినను వీ రిరు వురు నింటికి రానందులకు మీనాక్షి దిగులుపడెను.

ఆ దినము రాత్రి గడచెను. తెల్లవారెనుగాని యంబికాపతియు నలము నిల్లు చేరలేదు. వృద్ధదంపతులు పరితపించుచుండ బండివాఁడు మాత్రము వచ్చిచేరెను. అతఁడు రాఁగానే విషయ మేమని విచా రింపఁగా నతఁడు "వా రిరువురకును దళిగలో వివాహము జరిగినదనియు

రాత్రియైన పిమ్మట నూరు చేరుదు మని యా కోవెలలో సంచరించు చుండిరనియుఁ "దరువాత నేమి తోఁచినదో యేమో 'మేము లవకోడు పోయెదము. అక్కడ మా కొక స్నేహితుఁ డున్నాఁడు. అతనియింట నొక్క దినముండి వచ్చెద' మని చెప్పి వెళ్లినారు. ఇప్పటికి వారు లవకోడు చేరియుందురు. నేనే వారిని రై లెక్కించి వచ్చితిని. ఈ సంగతి మీతోఁ జెప్పుమని నన్ను బుత్తెంచి" రని చెప్పెను.

వీరి వివాహమున కిష్టపడనివాఁ డయ్యుఁ గామాక్షయ్యగా రా సంగతి యప్పుడు విని సంతోషించిరి. ఆ విషయమునుబట్టి యొక తంతీ వార్తను పాలకాడులో నుండు పచ్చయప్పగారి కనిపి నిద్రపోవుటకుఁ దనగది చేరెను.



# ఇరువదియేడవ ప్రకరణము.



## మినిచ్చి (దాది) యంత్యకాలము.

కొలంది దినములనుండి పచ్చయప్పగారికి దేహ మస్వస్థముగా నుండెను. ఆయన మందు తీసికొనుచుఁ బాలకాడులో నున్నట్టు లిది వఱకే చెప్పియుంటిమి గదా! ఆయన కంతకంతకు వ్యాధి ముదురుటయేగాని తఱుగుటలేదు. అది మనోవ్యాధి. సమీపబంధువు లాయన కెక్కడ పిచ్చియెత్తునోయని భయపడుచుండిరి. కొన్నినాళ్ళు పాలకాడులో నుండెదరు. కొన్ని దినము లనంతశయనమునకుఁ బోవుదురు. తిరుచ్చూరులోఁ గొన్నినా ళ్ళుందురు. తన ప్రథమభార్యయొక్కయు, నామె పిల్ల లిద్దఱ యొక్కరూపము లాయన కన్నుల కెప్పుడుఁ గనఁబడుచుండెను. రాత్రి నిద్రపట్టదు. ఒక నిమిషము కన్నుమూసిన నా ముగ్గురు వచ్చి యెదుట నిల్చెదరు. అమృతవల్లినిఁ బెండ్లిచేసికొనినను నామె వచ్చినతరువాతఁ దనపిల్లలు నాశనమైరను విషయ మాయనకుఁ దెలిసియుంటచే నామెను గన్న సింహామును జూచిన యేనుఁగువలె వణఁకును. ఆమెకుఁ బుట్టిన బాలలత యన్న నంత మక్కువలేదు. అఖండైశ్వర్యము భగవంతుఁ డిచ్చినాఁడు. పచ్చయప్పగారికి మాత్రము సుఖము లేదు.

అట్లీ స్థితియందుండు పచ్చయప్పగా రొకనాఁడు పాలఘాటునకు వచ్చినపుడు రెండునాళ్ళకుముం దీతంతి వచ్చెననియు, యజమానులున్నచోటు తెలియనందునను వారు స్వల్పకాలములో నిటకు వచ్చుట తెలిసినందునను దాని నిక్కడనే యుంచితిమనియుఁ బనివారు చెప్పి తంతె నాయనచేతి కిచ్చిరి. దానియం దిట్లు వ్రాయబడియుండెను. "మీకు సాధ్యమైన యెడల వెంటనే యిటకు రావలెను. కామాక్షయ్య, కళ్ళికోట" ఈవిషయమును బచ్చయప్ప మూఁడునాలుగు తడవలు చదివిచూచెను. "నా కేమియు నర్థము కాలేదే?" యనుకొనెను.

పచ్చయప్పగారు "ఇట్టి తంతీవార్తయు నొకటి కలదా! కొంచెము వివరముగా వ్రాయఁగూడదా! ఏమి సంభవించినదో తెలియలేదే! ఒకవేళ దాది చనిపోయినదో యేమో? అట్లు జరిగియుండదు. ఒకవేళఁ గామాక్షయ్యగారికి దేహ మస్వస్థముగా నున్న దేమో? ఏమి సంభవించినదో? ఈ లోకములో నాతఁ డొక్కఁడే నాకు నిజమైన స్నేహితుఁడు. పోయిచూచెదను" అని యెక్కడిసామానుల నక్కడ విడిచి కళ్ళికోటకుఁ బోవఁ బ్రయాణమయ్యెను.

పచ్చయప్ప గారి కీమునలితనములో నేమి సంభవించునో యని దిగులు. తనకు శుక్రదశ వచ్చునని జాతకములో నున్నదే. ఏదైన మంచివిషయము విందునేమో? తా నిదివఱకు విచారించుచున్న వేమైన తేలునేమో? యని యొకప్రక్క సంతోషము. ఈ ప్రకార మాయన యాలోచించుకొనుచుండఁగనే యాతఁ డెక్కిన బండి నిలిచినది. తాను కామాక్షయ్యగారియిల్లు చేరినట్లు తెలిసికొనెను. బండిలోనుండి కిటికిగుండఁ జావడిలో వ్రాసికొనుచున్న కామాక్షయ్యగారినిఁ గాంచి బండిదిగి వెంటనే లోపలి కేఁగి "అన్నా! మీరు నాకుఁ దంతీవార్త నంపితి రేల?" యనఁ గామాక్షయ్యగారు "అవును, అవును. అమృతవల్లికి దానినిఁ దెలుపుటకన్న మీకుఁ దెలుపుట శ్రేయస్కరమని యట్లొనర్చితిని. అంబికాపతి..." యనఁగఁ బచ్చయప్పగారు "అంబికాపతి కేమివచ్చినది?" అని యాతురతతో నడుగఁ గామాక్షయ్యగారు "అంబికాపతి వివాహము చేసికొన్నాఁడు" అనెను.

ఏమి ప్రమాదము వచ్చినదని యీ విషయమునకై తంతికొట్టినారని పచ్చయప్పగారు తలంచి "ఎవరిని పెండ్లిచేసికొనెను?" అని యడిగెను. దానికి బదులుచెప్పుటకుఁ గామాక్షయ్యగారు నోరు తెఱచుటకుఁ బూర్వమే వా రున్న చావడికిఁ బ్రక్క నున్న గదితలుపు తెఱచి యందుండి పొడుగైన సన్నని సుందరవిగ్రహమును శివమ్మ యీవలకు లాఁగి తెచ్చెను. తలుపు తెరవఁబడినప్పు డీ యిరువురును దిరిగి చూచిరి. చెదరియున్న నల్లని కుంతలములు, మందహాససుందరవదనము, చంచలలోచనములు కలిగిన యా స్త్రీ రూపమును జూచిన తోడనే పచ్చయప్పగారు నిర్జీవప్రతిమవలెఁ గూలఁబడెను. తరు

వాతఁ దెలివి తెచ్చుకొని మెల్లగా లేచి "అమ్మా! కుమారీ! నీ వెవ తెవు? చెప్పుము" అని హీనస్వరముతోఁ బలికి మెఱుపును జూచి భ్రమించునట్టు లతఁడు చేష్టలుదక్కి నిలువఁబడెను. ఇట్లు పచ్చయప్ప గారిస్థితిఁ గాంచి యలమేలును నిర్వేరచెంది చూచుచుండెను. వెంటనే కామాక్షయ్య లేచి "పచ్చయప్పా! ఏమి యీ విపరీతము! నీకు దేహము సౌఖ్యముగా లేదా యేమి?" అనఁ బచ్చయప్ప "అయ్యో! ఇదియే యంబుజము! చనిపోయిన నా భార్య స్వర్గ లోకమునుండి దిగివచ్చినది. ఇరువది వర్షములకు ముందు నా ముఖ మును గాంచినంతనే నవ్వుచుంటివే. ఇపు డిటులేల మాటలాడకున్నావు? అన్నా! నా యంబుజముముఖమే యిది. అదే యచ్చుగదా! చూ డుము." అనెను. దానికిఁ గామాక్షయ్య 'అయ్యా! మీ మొదటి భార్యను నేను జక్కఁగాఁ జూడలే'దనెను. అలమేలున కేమియు నర్థము గానందున భయపడి "అయ్యా! కామాక్షయ్యగారు! నేను పోయి వచ్చెద" ననెను. ఈ శబ్దము పచ్చయప్పగారు విని "అమ్మా! నీ విం కొక నిమిష మున్న మాయ మగుదువు. ఎట్లు వచ్చితివో యట్లు పోయెదవు. ఈ ముసలివానిమీఁద దయయుంచి నీ వెవ్వ తెవో నిజము చెప్పు" మని వేడుకొన, నందుల కామె "నే నలమేలును. అంబికాపతిభార్య" ననెను. పచ్చయప్ప విని "ఆ! తెలిసినది. నీవు అలమేలువు కావు. నా రంగము. అంబుజముయొక్కరూపము నీయం దచ్చుకొట్టిన ట్లున్నది. నీవు పుట్టినప్పుడే యామెపోలిక నీయం దుంట కనిపెట్టితి. పదునెనిమిదేండ్లక్రిందట నాకు జన్మించిన చిన్ని యంబు జమవు." దీనిని విని కామాక్షయ్య లేచి "అయ్యా! మీరు చెప్పునది మీకే యర్థ మగుటలేదు. నిరంతరప్రయాణముచేతను, వ్యాధిచేతను మీబుద్ధి చపలమైనది. ఈ గదిలోనికిఁ బోయి కొంచెము సేపు నిద్రిం పుఁడు." అనెను.

ఆ సమయమున నొక సేవకుఁడు వచ్చి కామాక్షయ్యగారితో "మిణిచ్చిదాది చావ సిద్ధముగ నున్నది. మిమ్ముల నొక్కసారి చూడఁగోరుచున్నది. మీతో నేమో చెప్పవలెనఁట." అని చెప్పెను. "మన యింటిలో దాదిగా నుండిన మిణిచ్చియా" అని

పచ్చయప్పగా రడుగ ‘అవును.’ అని కామాక్షయ్యగారు చెప్పిరి. దానిని విని పచ్చయప్పగారు ‘ఆహా! తెలిసినది. ఈ విషయమై భగవంతునికి నామీఁద దయ పూర్ణముగా వచ్చినది. నా కుటుంబ రహస్యములు మిణిచ్చికిఁ దెలిసియుండవచ్చును. రండి. అన్నా! మన మిరువురము మిణిచ్చియొద్దకుఁ బోవుదము. కుమారీ! రంగం! నీవు కూడ మాతో రమ్మ” అని యలముచెయ్యి పట్టుకొని తనతో రమ్మ నెను. ఏమి చేయఁగలదు! అంబికాపతి వచ్చి యేమనునో యని తన మనస్సునఁ దలపోయుచుండెను.

వీరు ముప్వురును వెంటనే బయలుదేరి దాపున నున్న పూఁదోఁటఁ జేరిరి. అక్కడ పడిపోవుచున్న గుడిసెముం దొకమంచము మీఁద నాల్గుప్రక్కల దిండ్లు వేయఁబడి ప్రాణముపోవుచున్న యొక వ్యక్తి యందుఁ బడియుండెను. ఆమెయే మిణిచ్చి. ఒక స్త్రీ యామె చెవిలో గట్టిగా ‘నవ్వా, యవ్వా! పచ్చయప్పగారు వచ్చినారా యని యడిగితివే! వారు నిన్నుఁ జూడవచ్చినారు. కన్నులు తెఱచి చూడు మవ్వా!”అనెను. పచ్చయప్పగారు దాపునకు వచ్చి నిలువఁబడిరి. వీరు వచ్చిన పదినిమిషములకు మిణిచ్చి కన్నులు తెఱచి ‘ఏరీ! అయ్యగారు!’ అని యడిగెను. అపుడు కామాక్షయ్యగారు ‘ఇదిగో! నేను వచ్చియున్నాను. ఇదుగో? పెద్దయ్యగారు” అనెను. దీనిని విని మిణిచ్చి తలయెత్తి చూచి “ఆపచ్చయప్పగారేనా? ఇరువది సంవత్స రములకు ముందు వారియొద్ద నేను దాసిగా నుంటిని. ఈ దాసిని వెదకి కొనుచు వచ్చినారా?” అనెను. వెంటనే పచ్చయప్పగా రామె ముఖమున కెదురుగా నుండునట్లు నిలువఁబడిరి. ఒకనిముసము సేపు తెప్పవాల్చక వారినిఁ జూచి “అయ్యా! పచ్చయప్పగారూ! ఎన్ని నాళ్లనుండియో మిమ్ములఁ గాంచి కొన్నిసంగతులఁ జెప్పి మఱి ప్రాణ ములు విడువవలయు నని వేచియుంటిని. పాపమును దాఁచి భరింపఁ జాలను.” అన నీమనస్సును వేధించు నాపాపకార్యమును నేఁ జెప్పు దునా”యని పచ్చయప్ప యనెను. “దానికి మిణిచ్చి మీకుఁ దెలియనే తెలియదు. ముమ్మాటికిఁ దెలియదు” అన నాతఁడు “నాబిడ్డలు కావే రిలోఁ బడి చావలేదు. వినాయకుని దేవాలయసమీపమునఁ బాతి

పెట్టఁబడినవారు నాపిల్లలు కారు''అనెను. "ఆ రహస్యము మీ కెవరు చెప్పినారు''అని మిణిచ్చి యడుగఁ బచ్చయప్పగా రలమేలును బిలిచి "ఇదిగో! యీ బాలిక చెప్పినది. ఈమె యంబుజమును బోలియున్నది. ఆ పోయిన యిరువురు పిల్లలలో నీమె యొకతె''అనెను. దాది "నావలననేకదా యీమె జీవించియుండఁగలిగినది. అయ్యా! అందఱు నావల కంపివేయుఁడు. నా యదృష్టమువలన నేను చనిపోకముందు మిమ్ములఁ జూచితిని. నేఁ జేసిన పాపముల నొప్పుకొని ప్రాణములు విడిచెదను.'' అని చెప్పఁ గామాక్షయ్యగా రందఱు నావల కనిపి తాను, బచ్చయప్పగారుమాత్ర మట నుండిరి. "అయ్యా! కొడుముడికి మీరు పోవకముందే యమృతవల్లి యన్నియు సిద్ధముచేసి మఱి పోయినది. ఆమె గర్భము దాల్చినదిమొదలు సవతిబిడ్డ లన్న నామెకుఁ గిట్టినది కాదు. ఆ బిడ్డలు కూర్చున్న తావును, నిలిచినతావునుగూడ నామెకు విష మయ్యెను. పలుతడవులు తానే వారినిఁ జంప నుద్దేశించెను. ఆమెను జూచినపు డొకయాఁడుపులినిఁ గాంచినట్లే యెంచుచుంటిని. ఆమెపక్షమే యవలంబించితిని. నేనుమాత్రము మంచిదాన నని తలంపకుఁడు. ఆమె యూరాచ్చికోటకుఁ దనపిల్లలతోఁ దిరిగి వచ్చునప్పటి కీ యిద్దఱుపిల్లలను లేకుండఁ జేయునట్లు లేర్పాటు చేసినది. పోయి రమ్మని చెప్పి నే నామెను మీతోఁ బంపితిని'' అనఁగానే పచ్చయప్పగారు పట్టరానికోపముతో "రాక్షసీ! నా పిల్లలను జంప నుద్దేశించితివా!'' అని యామె పండుకొనియున్న మంచమును గదలించిరి. మిణిచ్చికిఁ బ్రాణము లప్పుడే పోవున ట్లుండెను. కాని తన రహస్యముల బయలుపఱుపవలసియున్నందున నామె చావలేదు. తిరిగి యామె "అయ్యా! ప్రాణములు తీయుటయన్న మా కాటవంటిది. దోమలను, జీమలను నలిపినట్లే మనుష్యులను జంపుదుము. నేను జెప్పుదానిని వినుఁడు. పిల్లలను గావేరిలో ముంపలేదు. నల్లప్ప యను పనివాఁడు కాఫీతోఁటలోఁ బనిచేయుచుండెను. అతనికి నీ బిడ్డల నిద్దఱ నిచ్చి 'వారినిఁ గాపాడుము. నాకు నమృతవల్లి కొంతధన మిచ్చును. ఆ ధనములో నీకుఁ గొంత రహస్యముగాఁ బంపెదను' అని చెప్పి పంపితిని.

'ఆ పాతిపెట్టఁబడిన పిల్లలో!' యని పచ్చయప్ప యడిగెను. "అంతయు సాంతముగాఁ జెప్పెదను. మధ్యలోఁ బ్రశ్న లడుగకుఁడు. అవును, జ్ఞాపకమునకు వచ్చినది. మా యుక్తి నెవరికిఁ దెలియును? పుట్టణ్ణయను తోఁటమాలి మన తోఁటకు మూఁడుమైళ్లు దూరమునం దుండెను. ఆతని కిద్దఱు కవలపిల్ల లుండిరి. వా రిరువురును నొక్క తడవ స్ఫోటకమువలన మృతినొందిరి. వారినిఁ దెచ్చి కడిగి వారికి నలంకారము యొక్కయు రంగముయొక్కయు నగలఁ దీసిపెట్టి మీ బిడ్డ లని చెప్పితిని. అప్పుడు కామాక్షయ్యగారు కూడ నాశవముల యొద్దకు వచ్చిరి.

"నల్లప్ప, యేమయ్యెను?" అని పచ్చయప్పగారడుగ 'ఏమయ్యె నో నాకుఁ దెలియదు. ఏ డెనిమిది సంవత్సరము లతనికి ధనము పంపుచుంటిని. తరువాత నతఁ డడుగలేదు. నేను బంపనులేదు. అతఁడు మరణించియుండును. ప్రాణముతో నుండిన డబ్బడిగి యుండును. నేఁ బంపియుందును. ప్రతి ప్రాణియుఁ జావవలసియే యుండును. పచ్చయప్పప్రభూ! నే నొక్కటియు దాఁపక యున్నది యున్నట్లు చెప్పితిని. మీ భార్యతోఁ జెప్పఁడు. నేను జీవించియుండెడిపక్షమున మీకుఁ జెప్పియుండను. ఆమె యిచ్చు డబ్బుతో జీవించుచుందును. ఆమెధన మింక నక్కఱలేదని చెప్పఁడు. మీరు చెప్పిన నామెకుఁ గోపము వచ్చునేమో! నే పాపినిని, క్షమింపుఁడు" అని ముగించెను. వారును నింటికి వచ్చిరి. మఱునటిదినము తెల్లవారి పచ్చయప్ప తాను విన్నదానినిగుఱించి యాశ్చర్యపడి తన ముద్దుకుమార్తెను, నల్లప్ప విషయమును మాటిమాటికిని విచారించుచు నాతనిసంబంధము వలన నలము తన కుమార్తెయే యని నిశ్చయించి కళ్ళికోట వదలి యూరాచ్చికోటకు వచ్చి చేరెను. వా రట్లు బయలుదేరుటకు ముందు మిణిచ్చి చనిపోయె ననువార్త వినవచ్చెను.

———

# ఇరువదియెనిమిదవప్రకరణము.

## రాధకనుఁగొన్న యానవాలు.

రాధ తన గదిలో నుండు కిటికీలోనుండి తూర్పుదిక్కుఁ జూచుచుఁ దోఁటయందలి సౌందర్యములఁ దిలకించుచుఁ గూర్చొని యుండఁగాఁ దలుపుఁ దట్టినశబ్ద మయ్యెను. తన చెలి బాలలతయై యుండు నని రాధ భావించెను. కాని వచ్చినది కుంతలమ్మ. కుంతలమ్మన్న రాధకు నిష్టమే కాని యామెరూపము ఘోరమైనది. "నీవు నాతోఁగూడ మేడమీఁదికి వచ్చెదవా? నీ విదివఱ కెన్నఁడు దానిని జూడలేదంటివిగదా." యని కుంతలమ్మ యడుగ రాధ "మీ రెపుడు పిలిచిన నప్పుడు వచ్చుటకు సిద్ధముగా నున్నాను" అనెను. వెంటనే వారిరువురు సుబ్బన్న వెంట రాఁగా పెక్కుచిన్నగదులు, చావళ్లు దాఁటి మేడగదితలుపును జేరిరి. చాలకాలమునుండి మూయఁబడి యున్నందునఁ దాళము తుప్పుపట్టి యుండెను. కుంతలమ్మ తాళపుఁ జెవితో బలవంతముగ నొక్కమారు త్రిప్పఁగానే యది తెఱువఁబడెను. తలుపులు తెఱచిరి. కొంచెము మంచిగాలి యందుఁ బ్రవేశించిన తరువాత మొదట సుబ్బన్న ప్రవేశించి కిటికీతలుపులఁ దెఱచెను. కుంతలమ్మ గదిఁ బ్రవేశించెను. రాధ గడ గడ వణఁకుచు నామెచీరకొంగు పట్టుకొని లోనికి వెళ్లెను. కుంతలమ్మను జూచిన రాధకు భయము. అట్టి రాధ కుంతలమ్మకొంగు పట్టుకొని యామె వెంటఁ జనుదెంచెనన్న నాగది యెంత భయంకరముగా నుండవలెనో యాసంగతి చదువరులే యూహింపఁగలరు. ఆగదిలో నందమైన పరదాలుండెను. ఉన్నతమైన మేజాలు, కుర్చీలు మొదలగు మేలైన సరకు లుండెను. పటము లన్నియు బూజుపట్టియుండెను. ఎక్కడఁ జూచినను సాలీళ్లు, చిమ్మటలు, గబ్బిలములు పాఁకుచుండెను. సుబ్బన్న తలుపు లన్నింటిని దెఱచి మంచిగాలి వచ్చునట్లు చేసెను. లోపలికి వెళ్లిన తరువాత నంతభయము తోఁపలేదు. కొంచెము గాలి, వెలుతురు ప్రవేశించెను. సుబ్బన్న కొన్ని పుస్తకములను దులిపి మరల

యథాస్థానములలోఁ బెట్టుచుండెను. "అది యట్లుండనిమ్ము" అని కుంతలమ్మ చెప్పుచుండ అమ్మా! అట్లు చెప్పకుఁడు. వ్రాయఁదెలియదుగాని పుస్తకము లన్న నాకుఁ బ్రాణము. ఇవన్నియు జ్యోతిశ్శాస్త్రగ్రంధములు, అయ్యగారికి వీనియెడ విశేషాభిమానము. వారి ప్రథమభార్య, బిడ్డ లిద్దఱు పోయినప్పటినుండియు, నీ పుస్తకముల వారు చూడనేలేదు. "నా మొదటిభార్యయొక్క పిల్లలు దీర్ఘాయుష్మంతు లగుదు రనియు, మంచి చక్కనివారు, విద్యావంతు లగుదు రనియు నీ జ్యోతిశ్శాస్త్రములు చెప్పినవి. ఆపిల్లలు చిన్నతనమందే గతించిరి. ఏల యీపాడుశాస్త్రము లింక?" నందురు. రాధ వస్తువులు పరిశీలించునప్పు డొక దంతఁపుబెట్టె కనఁబడెను. "ఇది పూర్వకాలఁపు బని. మిక్కిలి యందమైనది. అతి విచిత్రముగా నున్నది." యనెను. దానినిఁ జూచి సుబ్బన్న "ఇది చిత్రమైనదియే. మాయమ్మగారు ముప్పది సంవత్సరముల క్రింద నొక యోగియొద్దఁ గొనెను. దానిలో నొక యందమైన కత్తి యున్నది. ఈపెట్టె తెఱచి దానిని గూడఁ జూడుఁడు." అనెను. దానిని విని రాధ పెట్టె తెఱచి పరిశోధించి యేమిచెప్పుటకుఁ దోఁపక నివ్వెరపడి నిలిచెను. అంత నామె "అమ్మా! నేఁ గనుఁగొనినయద్భుతమును గంటిరా?" యనఁ గుంతలమ్మ పరుగిడి వచ్చి పెట్టెఁ గైకొని చూచి క్రిందఁబడిపోయెను. వెంటనే సుబ్బన్న కొంచెము చల్లనినీరు దెచ్చి యామెముఖముమీఁదఁ జల్లగా నామె మూర్ఛనుండి తెప్పఱిల్లుకొనెను. ఆమె "చీఁకటిలోఁ జేసినది వెలుతురులోనికి వచ్చినది. దాఁచిపెట్టినది బయల్పడినది." అనెను. రాధ విని "ఏమమ్మా! యట్లనుచున్నారు?" అన "నేను దాఁచిపెట్టి ప్రాణసమానముగాఁ జూచుకొనుచున్న కత్తియొక్క యొర యిది. దీనికొఱకై నేను వెదకి వెదకి వేసారితిని గాని యింతవఱకుఁ గనఁబడలేదు." అనుచు తాను గుప్తముగా దాఁచియుంచిన ఖడ్గము నెత్తి యా యొరయందుఁ బెట్టినప్పు డా కత్తికై చేసిన యొర కావున సరిగా సరిపోయెను. దానినిఁ గని కుంతలమ్మ నే నీశ్వరుని నమ్మియున్నాను. భగవంతుఁడు నాకు మార్గము చూపునని చెప్పియుండలేదా? నిజము. ఈ చెక్కడఁపుఁబనిని జూడుము. ఈ రెండు

పనులు నౌకరు చేసినవియే. నా ప్రాణనాథునిఁ జంపిన యీఁటె యీ పెట్టెనుండియే తేఁబడినది." యనుచుండ రాధ "అమ్మా! కుంతలమ్మగారూ! మీరు మైమఱచి మాటలాడుచున్నారు. ఈ పెట్టె యమృతవల్లిదికదా!" యనఁ గుంతలమ్మముఖము వివర్ణ మయ్యెను. ఆమెకన్నులనుండి బాష్పములు కారుచుండెను. కుంతలమ్మ 'అవును. ఈ పెట్టె యమృతవల్లియొద్ద నుండఁగాఁ జూచితిని. ఆమెయే నా నాథునిఁ జంపినది. ఆమెయే పాతకిని, పాపిని. ఇదియే నా పగ తీర్చుకొనుటకు సమయము. నేను దీనిని విడిచెదనా? విడిచెదనా?' యని మహిషాసురమర్దనిమాడ్కి హుంకరించుచుఁ బరుగెత్తెను. ఆమెను రాధ గట్టిగాఁ బట్టుకొని 'వలదు! తల్లీ! వలదు! వలదు!' అనెను. కుంతలమ్మ నా పగ తీర్చుకొనెదను. తప్పక 'నాపగఁ దీర్చుకొనెదను.' అని చెప్పుచుఁ బిచ్చిదానివలె ముందునకుఁ బరుగెత్తసాగెను.



# ఇరువదితొమ్మిదవప్రకరణము.

వచ్చయప్పగదిలో నడచిన విచారము.

ఆ దినమురాత్రి పచ్చయప్ప నిద్రపోయి లేచినప్పు డిరువది సంవత్సరముల బాలుఁ డైనట్లు దృఢముగా నుండెను. పాలకాడు మందు, యాత్ర మొదలగున వన్నియు నాయన కేమియు నెమ్మది గలిగింపలేదు. పోయినపిల్ల లాయనకుఁ గనఁబడినసంతోషముతో వ్యాధి నివారణ మయ్యెను. అరనిముసమైన నలము తన్ను విడిచి పోఁగూడదు. రాధ యేమి చేయు చున్నదో యనియే యతనికి సదా విచారము. ఆమె యెవ రైనదియు నమృతమ్మకుఁ దెలిసి యుండిన నామె నెన్నఁడో చంపి యుండును. కాని యమృతవల్లికిఁ దెలియదని యాయనకు దృఢమైన నమ్మకము. ఇన్ని దినములు రక్షిం చిన తనబిడ్డలఁ దనకుఁ జూపించిన యీశ్వరుఁడే రాధను గాపా డు నని యతఁడు నమ్మెను. నల్లప్ప పిల్లలను గాపాడినకథ, నలమును జెప్పుమని పలుమా రడుగుచుండెను. అలమును జూచినపు డంతయు నంబుజము జ్ఞాపకమునకు రాఁగా దుఃఖించుచుండెను. కుమార్తె దగ్గఱ తనదుఃఖమును జూపఁగూడదని దుఃఖము నణఁచుకొనుచుండెను. ఒక నాఁడు తండ్రితో నలము "మీరు రాధను జూచితీరవలెను. ఆమె మిక్కిలి చక్కనిది, గుణవతి విదుషీమణి" అనెను. దానికి దండ్రి "అది యంబుజమును బోలియుండునా" యన "నాన్నా! మూడు మూర్తుల మీరూపమే. మీవలెనే యామెకు విశాలఫాలభాగము, గొప్పనేత్రములు. అందఱు రాధ నాకన్న మిక్కిలి చక్కని దం దురు." అని చెప్పి యంబికాపతివంకఁ దిరిగి "నాథా! మీరు రాధను జూచియున్నారుగదా? మీ యభిప్రాయ మేమి?" అని యడుగ నంబికాపతి "రాధ మిక్కిలి చక్కనిదనుటకు సందేహమే లేదు. కాని యల మనిన నాకుఁ జాల ప్రియ"మనెను. పచ్చయప్పగారు విచార గ్రస్తులై యుండుట యలమేలు కని "నాన్నా! మేము పడవలసిన యవస్థ లన్నియుఁ బడితిమి. వాని నన్నిఁటిని మఱచిపొండు. మన్నిం పుఁడు" అనెను.

అంబికాపతికి నీరహస్యము తెలియదు. పచ్చయప్పగారు కనcబడలేదని యనుకొనిన పిల్లలిద్దఱలో నల మొకతె యనిమాత్రము తలcచెను. అంతియకాని తల్లి చేసిన ఘోరకృత్యము లేవియుc దెలియవు. 'మన్నిcపుc'డని యలము చెప్పుటచే "ఎవరిని మన్నింపవలెను? ఏల?" అని యతcడడుగ దానికిc బచ్చయప్పగారు "పుత్రా! ఎల్లసంగతులు స్వల్పకాలములో నీకు విశదపడcగలవు. అంతవఱకు నీకుc దెలియకుండుట మంచిది. నీ కుతూహలమును భంగపఱచుటకు నా కిపు డిష్టములేదు" అనెను.

వీరు ముగ్వురు నూరాచ్చిసౌధమునకు వచ్చుచుండcగా నా తగులcబడిన కొట్టముసమీపముననుండి బండి పోవునపుడు తన ముద్దుబిడ్డలయొక్కయు, నల్లప్పయొక్కయు స్థితి జ్ఞప్తికి రాcగా దుఃఖించి యప్పటివిషయము లన్నియుc గన్నులcగట్టినట్లులు పచ్చయప్ప తలపోయసాగెను. రెండవభార్యకూcతురు సర్వసౌఖ్యము లనుభవింపుచుండcగc దన మొదటిభార్యబిడ్డ లిట్టు లష్టకష్టము లొందవలసి వచ్చెcగా యని యాతcడు కన్నీరు మున్నీరుcగా నేడ్చెను. వీ రెప్పుడును దా నింటికి తిరిగివచ్చునప్పుడు ముందుcగా తనగది సరిచేసిపెట్టునట్టులును, ఈరోడ్డు స్టేషనుకు బండిని బంపునట్టులును వ్రాయుచుండెడివారు. ఆ దినమున నే యేర్పాటులు లేకయే యూరాచ్చికోట చేరిరి. తాను వచ్చిన సంగతిc దెలిపినట్లయిన నమృతవల్లి రాధ కేమయిన నపకారము చేయునేమో యని భయపడిరి.

ఆయన తనసౌధము ప్రవేశించునప్పటికి మధ్యాహ్నము పండ్రెండు గంట లయ్యెను. సుబ్బన్న యప్పుడే భోజనముచేసి పండుకొని యుండెను. యజమానుcడు వచ్చి వాకిలిమెట్లమీcదc గాలు మోపcగనే తుల్లిపడి లేచి "దేవరా! ఏమియుc దెలుపకయ వచ్చినారే" యని వినయముతోc బలికెను.

ఆతcడు సుబ్బన్నతో, "నేను వచ్చినది రహస్యముగా నుంచుము. నోరు తెఱవకుము." అనcగా నతc డట్లే యనెను. వెంటనే "అంబికాపతీ! నీవు, నీభార్యయు నాగదిలోనికిc బొండు, వెలుపలికి రానక్కఱ

లేదు. నేను పిలిచినప్పుడుమాత్రము వచ్చినఁ జాలును. మనము వచ్చినసంగతి రహస్యముగానే యుండనిమ్ము. అలము ప్రయాణము వలన బడలియున్నది. ఆమెను నిద్రపోనిమ్ము. మీతల్లి యామెను జూడఁగూడదు" అనెను. మిణిచ్చియొద్దకుఁ బోయివచ్చినప్పటినుం డియు నమృతవల్లిని దనభార్య యని చెప్పుట మానివేసెను. "నాన్నా! రాధ" అని యల మేమో చెప్పఁబోవుచుండ నాతఁడు "నా కుమారీ! నే నధికకాలము ని న్నిక్కడ నుంపను. శీఘ్రముగానే అక్కయొద్దకుఁ బంపెదను." అని తండ్రి చెప్పఁగా నలము సంతసించి, తనభర్తతోఁ బోయెను. భోజనానంతర మమృతవల్లి పచ్చయరలోఁ బరుండుననియు, నామెను జూచెదనని పచ్చయప్ప యా గదికి వెళ్లెను. అక్కడ నామెలేదు. కాని యక్కడ బ్రహ్మరక్షస్సువలె నొక పురుషుఁడు నిలిచియుండెను. అతఁడు మఱొకఁడు కాఁడు, కుప్పుస్వామియే. పచ్చయప్ప యాగదిలోఁ బ్రవేశింపఁగానే యతని కోపము మాయ మయ్యెను. ఆతఁ డధి కానందముతో "స్వామీ! నా భాగ్యమువలన మీ రిప్పు డిటకు వచ్చితిరి." అనఁగా, "కుప్పుస్వామీ! నే నమృతవల్లికొఱకై వచ్చి తిని." అనఁగా నందుల కతఁడు పచ్చయప్పగారితో, "అయ్యా! మీ పని యెంత యవసరమైన దయినను నేఁ జెప్పునది యైదునిమిష ములు విని మఱి వెళ్ళుఁడు. మీరు దయచేసి వినెదరని నమ్ము చున్నాను." అని వేఁడుకొన, ప్రభువు, "ఇంకొకప్పు డెప్పుడైనఁ జెప్ప రాదా?" యన, కుప్పుస్వామి "కాదు, ఈ లోకమున కంతకు నీ కథ వెల్లడికాకముందు మీ రెఱుఁగుట ముఖ్యము." అని చెప్ప "ఏమి చెప్పెదవో చెప్పుము; వినెద" నని యాతఁ డొక కుర్చీపైఁ గూర్చుండఁ గుప్పుస్వామి, "అయ్యా! కొంతకాలమునకు ముందు అరుళ్ నాథుఁడు హత్య గావింపఁబడెనే" యన, "ఓరీ మూఢా! నీవా! నా కా సంగతి జ్ఞప్తికిఁ దెచ్చువాఁడవు? నాకుఁ దెలియునో తెలియదో యని సందే హము కాఁబోలు" ననెను. కుప్పుస్వామి, "లేదు. ఎవరు హత్యఁ గావించిరో మీకుఁ దెలియునా?" యన నాతని జంపినవాని పేరుఁ జెప్పిన వారికి నా యాస్తి నంతయును నిచ్చియుందునే!" అని యాతఁ డనఁగాఁ గుప్పుస్వామి "అట్లయిన నేఁ జెప్పునది వినుఁడు. తరువాత

మీరు మీ భార్యను జూడఁబోవచ్చును." అనెను. ప్రభువు "కుప్పు స్వామీ! నన్నుఁ బీడింపకుము, చెప్పుము." అని యాతురతతో నడుగ, నాతఁడు తన కథ నారంభించెను. "ఆనాఁ డరుళ్‌నాథుఁడు చంపఁబడుటకు జామునకుఁ బూర్వ మాతఁడు కోపముతోఁ దన గదికి వచ్చి యొక జాబు వ్రాసి, నా కిచ్చి యమృతవల్లికి నిచ్చునట్లు చెప్పెను. నే నట్లే తీసికొనిపోయి యామె కిచ్చితిని. దానినిఁ జదివి యామె యాజాబును నేలఁ బడవైచి త్రొక్కి, కన్ను లుఱిమెను. "బదులు వ్రాసి యిచ్చెదరా?" యని యడిగితిని. దాని కామె 'లేదు, పో' మ్మని చెప్పెను. అప్పు డామెముఖము కోపముతోను, విచారముతోను గూడియుండుటఁ గాంచి యరుళ్‌నాథునకును నామె కును నేమో మనఃస్పర్ధ గలదని తలంచితిని. మాబోటివాండ్రకీ రహస్యములు దెలిసియుండుట యుపయోగముగదా? దీనినిఁ దెలిసి కొనుటకై నేను సమీపముననే వేచియుంటిని. నేను దిరిగి వచ్చు నప్పటికి నరుళ్‌నాథుఁడు బయటికి వెళ్ళియుండెను. నేను నతని వెంటనే యతనికిఁ దెలియకుండ వెళ్ళితిని." అని చెప్పుచుండఁ బచ్చయప్పగారు కేసువిచారణ జరిగినప్పుడు దీని నంతయు నీవు చెప్పలేదే' యనఁ, గుప్పుస్వామి "అవును, నేను జెప్పలేదు. దాఁచి యుంచినది నాకు లాభమయ్యె. మనతోఁటలో నీశాన్యమూ లలో నొక పొదయొద్ద నుండు .రెండు రావిచెట్లమధ్య నమృతవల్లి యరుళ్‌నాథుని సంధించి మాటలాడినది. అమృతవల్లి కంబళిఁ గప్పుకొనియుండెను. వారు మాటలాడిన దంతయుఁ జక్కఁగ వినఁబడు నట్లు నేను సమీపమున నున్న చెట్లచాటున దాఁగికొనియుంటిని. దుష్టుఁడ నని తలంపకుఁడు. నే నొక బీదవాఁడను. ఇతరుల రహస్య ములు తెలిసికొనుటవలన ధనము సంపాదించుకొనవచ్చుఁగదా! దాని వలననే నే నిట్లు ధనవంతుఁడను కాఁగలిగితిని. చనిపోయినా రనుకొన్న యామెసవతిబిడ్డల నరుళ్‌నాథుఁడు తాను జూచినట్లును వా రేడేండ్ల నుండి పడరానికష్టములఁ బడి నల్లప్పతో నాపాడువడియున్న గుడిసెకు వచ్చి చేరినట్లును, నానల్లప్పనే తమ తాతగా వా రెంచియున్నట్లును, జెప్పి, యామె చేయున దంతయు పాపహేతు వనియును, భగవంతుఁడు

శిక్షించుననియు, నామెను దండించి యాపిల్లలయెడఁ దాను గావించిన మోసము నొప్పుకొని యిఁకనైన వారిని గాపాడుమనియు లేని యెడ నా విషయముఁ బ్రభువుగారికిఁ దెలిపెద ననియుఁ బెదరించెను. అమృతవల్లి తాఁ జేసిన మోసమంతయు నొప్పుకొనెను. అరుళ్‌నాథుని తనవైపు ద్రిప్పుకొనుటకు ధన మిచ్చునటుల నింక ననేకయుక్తులు పన్ని చూచెను. కాని యరుళ్‌నాథుఁడు యోగ్యుఁడని పేరు పొందవలె నను భ్రాంతిగలవాఁడు. ఆమె యిచ్చినధనము తీసికొని యూరకుండిన నంతయు బాగుగనే యుండెడిది. "ఈరాత్రికిమాత్ర మూరకుండుఁడు. ఉదయమునుండి పిల్లలు మాయింటికే వచ్చి యిట వసించుటకుఁ దగిన యేర్పాటులు చేసెదను" అని యమృతవల్లి సమ్మతిఁగనఁబరచెను. ఈమె నిజముగా నొప్పుకొన్నట్లే యరుళ్‌నాథుఁడు భావించెను. అతఁ డొక ప్రక్కకుఁ బోయెను. నేను దాఁగియున్న చోటినుండి యీవలకు వచ్చుటకుఁ బూర్వమే మెఱుపుతీఁగెవలె నమృతవల్లి తటాలున వెనుకకుఁ దిరిగి యరుళ్‌నాథుని వెనుకగా నాతనిఁ బొడిచెను. ఆమె యట్లు ఝుళిపించిన యాయుధము తళతళ మని ప్రకాశించెను. గుభిల్లని యరుళ్‌నాథుఁడు భూమిమీఁదఁ గూలెను. అట్టి ఘోరకృత్యమును నే నిదివఱకుఁ జూడలేదు. అతఁడు క్రిందఁబడినపు డమృతవల్లి యాయనను బరీక్షించి చూచెను. ప్రాణము పోయినదో లేదో యని పరీక్షించినదిగాఁ బోలు" అని చెప్పుచుండఁగాఁ బచ్చయప్పగారు "ఓరీ, పాపీ! ఈవిషయముఁ దెలిసియుండియు నిన్నాళ్లెట్లుల యూరకుంటివి?" అని కోపముతో నడుగ "నేనా! చెప్పుట! ఒక్కొక్కనిమిషమున కొక్కొక్కవరహా వచ్చుచున్నప్పు డీసంగతి బయటఁజెప్పి యాదాయము వదలుకొను పిచ్చివాఁ డెవఁడైన నుండునా? ఆమెను నేను రహస్యముగఁ జూచి "ఏమి చెప్పెదవు? నీ రహస్యమును బయటఁ జెప్పుదునా?" యని బెదరించితిని. "నన్నుఁ గాపాడుము. నీకుఁ గావలసిన యుపకారముఁ జేసెదను." అనెను. ఇట్లు చేసిచేసి నన్ను మోసపుచ్చినది. అబద్ధములు చెప్పరాదు. ఇన్నివిధముల నాకు సాయముచేసి కడపట మోసముచేయ నెంచినది. ఈఘాతుకికొమార్తె నెవరు పెండ్లాడుదురు? నాకు బాలలత నిచ్చి

పెండ్లిచేయుము. అట్లు చేసిన నే నామెయెడ నాదరము కలిగి వర్తించె దనని చెప్పితిని. కాని యందుల కామె యొప్పుకొనలేదు." అనెను.

'ఇది యొక్కటియే యామె చేసినసత్కార్య' మని పలికి సింగమువలె లేచి నిలుచుండి "పాపీ ! నీవా ! పరిశుద్ధయైన బాలలత నడిగినది ! ఛీ ! తిరిగి చూడకుండ నాయిల్లు వెడలిపొమ్ము. ఒకనిమిష మిక్కడ నాయెదుటనుండిన నిన్ను బయటి కీడ్పించెదను. ఇటువంటి పాతకముల కెన్నిటికిఁ గారణభూతుఁడ వయితివో ! ఆతతాయీ !" యని తిట్టుచుండఁ, గుప్పుస్వామి యప్పటికిఁగూడ భయపడక, "అయ్యా! ఈరహస్యముల నేను బయలుపఱచిన లోకులు నవ్విపోరా ? అట్లు నలుగురిలో మీకు నగుబాట్లు కాకుండుటకే కదా బాలలతను నా కీయుమని వేఁడుకొంటిని." అని చెప్పుచుండఁ, బచ్చయప్పగారు "పాపీ ! డోలు మెడకుఁ గట్టుకొని దీనిని లోక మంతయుఁ జాటుము. నీయోగ్యత గూడఁ బ్రకటించుకొనుము. నా కిదివఱకుఁ గలిగిన మనస్తాపమునకన్న వేఱు గలుగఁబోదు. నాయెదుటినుండి పొమ్ము" అనెను.

కుప్పుస్వామి తల వంచుకొనెను. ఏదో తనకు గొప్పభాగ్యము లభించునని దాఁచిపెట్టిన రహస్యమును బ్రభువుగారు విన్నప్పు డింత యలక్ష్యము చేయుదురని యతఁడు తలంపలేదు. ఈ గొప్పరహస్యము దాఁచినందులకు బాలలత లభించునని యిన్నినాళ్లు పడిన శ్రమ మంతయు కుప్పుస్వామికి వ్యర్థ మయ్యెను. విఫలమనోరథుఁడై యాతఁ డింటి కేఁగెను.

# ఇరువదితొమ్మిదవ ప్రకరణము.

అమృతవల్లిపాపము బయలుపడుట.

అమృతవల్లి, కుప్పుస్వామి కొంప ముంచునేమో యనుకొనుచుఁ బచ్చగదిఁ బ్రవేశించి యచట గర్జించుచున్న సింహమువలె నరుణలోచనములతోఁ దీవ్రకోపసంతప్తమానసముతో నుండిన తనభర్తను జూచెను. ఆమె మాయలమారి యగుటచే లేనిధైర్యముఁ దెచ్చుకొని తేనె లొలుకుపలుకులతో "నా ప్రాణనాథా! నే నెదురుచూడనటువంటి మీ దర్శనము నొసఁగితిరి. ఇదిగదా యభిమానమునకు నిదర్శన" మని చేతులు చాచి యాతురతతోను మందహాసముతోను నాతనియొద్దకుఁ బోఁగా నామె నాతఁడు విషకన్యగా భావించి వెనుకంజవేసి "రాక్షసీ! నన్ను ముట్టకుము. అరుళ్‌నాథునిఁ జంపినఘాతుకిరియొక్క చేయి నన్ను స్పృశింపవచ్చునా?" యనెను.

ఈ వార్త చెవినిఁబడగానే యామె తటాలునఁ గ్రిందఁబడి తన ముఖమును రెండుచేతులతో మూసికొని యేడ్వసాగెను.

పచ్చయప్పగారు "నిజమా? అబద్ధమా?" అని యోజించుచుండెను. "ఇంక నాలస్యముచేయుటచే ఫలములేదు. పెక్కుదినములు దొంగిలించినదొంగ యొక్కనాఁ డగపడు నను సామెత ఫలించినది." అని పచ్చయప్ప యనుచుండ నామె "అవును. బాలలత మేలుకొఱకై కావించితిని" అనెను. "అడవులలో నుండు మృగములు తమబిడ్డలఁ గాపాడుకొనుట కెన్ని మృగములఁ జంపుటలేదు? ఏమిచేసిననేమి? అంతయు నిపుడు బయలుపడినది. నా కేదండన విధించిన ననుభవించుటకు సిద్ధముగ నున్నాను. నేనే చేసితిని. చేతులారఁ జంపుట పాపమని తమకుఁ దామే నీటిలోఁ బడి చచ్చిన నంత పాప ముండ దని యప్పుడు నేను నిశ్చయించితిని. నేను నియమించిన సేవకులకు ధైర్యము చాలదు. కాన నాబిడ్డలను వారు చంపక మారుదేశముల కంపినారు. వారు తిరిగివచ్చి నా బాలలత యనుభవింపవలసిన సొమ్ము వా రనుభవించుట నాకన్నులారఁ జూచి యెట్లోర్తును? అరుళ్‌నాథున్నొక్కనికే యా

బిడ్డల చరిత్రము, నల్లప్ప పెంపకము, వారంద ఱారాత్రి నాపాడు గుడిసెలో నుండుటయుఁ దెలియును. అతని నొక్క పోటుతో యమ లోకమున కంపితిని. ఆపనియైనతరువాతఁ గుంతల మున్న గదిఁ బ్రవేశించి యామెవస్త్రముల ధరించి యర్ధరాత్రివేళ నాగుడిసె చేరి అంబుజమ్మపిల్ల లక్కడ నుంటఁ గాంచి యం దొక్కదానినిఁ జక్కగా గుఱుతించితిని. వారు నానేత్రములకు శత్రువులవలెఁ గనఁబడిరి. అంబుజముమీద మీ కెంత ప్రేమాభిమానము లున్నవో యందులో లక్షాంశమైన నాయెడ మీకు లేదను విషయము తెలిసికొన్నందున నాపిల్లను జూచిన నా కెపుడును గిట్టెడిది కాదు. ఆయిద్దఱు మరణించిరి గదాయని తలఁచియుండ నేడువర్షములకుఁ దరువాత నెక్కడినుండియో తిరిగివచ్చిరి. వారినిఁ బూజించెద ననుకొంటిరా? అట్లు చేసిన నాబాలలతగతియేమి? నల్లప్పను జంపవలె ననుకొంటిని. అక్కడ నాతని తలయొద్ద నున్న దీపముఁ జూచుటచే నేఁ జేయఁదలఁచినది యముఁడే చేసి సాహాయ్యం మొనర్చెనని సంతసించితిని. ఆపిల్లప్రక్కకు నే నేఁగునప్పటికి నందొకతె కన్నులు తెఱచి మేల్కొనియుండుటఁ జూచితిని.” ఇట్లు చెప్పుచుఁ గారుచున్న చెమట నమృతవల్లి తుడుచుకొనసాగెను. పచ్చయప్పగారు కదలక మెదలక యాడుగరచుచు నామె చెప్పు భయంకరమైన కథను వినుచుండిరి. “నే నూరు మాటుమణుగు నంతవఱకు నాగుడిసెయందే యొకమూల దాఁగికొనియుంటిని. అక్కడ మిణుకుమిణుకు మనుచుండు దీపములో నొకచీపురుపుల్లను వెలిగించి కొంప కంటించితిని. నేను దిరిగి వచ్చుటకుముందే యగ్నిదేవుఁ డా ముగ్గురను దనవశము చేసికొనెను. ఆహా! నాఁడు నేఁ జేసినది కన్నులఁ గట్టినట్లున్నది. నేను మిక్కిలి ధైర్యశాలినిని గాన నెగ్గివచ్చుచున్నాను. వారినిఁ జంపినపాపముమాత్రము నా మనస్సును నిప్పటికిని బీడించుచున్నది. కుంతలమునవస్థఁ జెప్పనక్కఱలేదు. అయినను నే నేమిచేయుదును? ఈభాగ్యము ముగ్గురు పిల్లలకు సమాన మని చెప్పిన యరుళ్ నాథునిఁ జంపినందులకు నే నెప్పుడును విచారపడలేదు. ఆ పిల్లలవిషయమై మాత్రము నే నపుడపుడు వ్యసనపడుటగలదు.” అనెను.

పచ్చయప్పగారు "ఆచింత నీ కక్కఱలేదు. నీవంటిపాతకిని వ్యస పడుట యా పిల్లలక్షేమమునకుఁ గొంతఁత గలుగును. అదిగో చూడు మని చెప్పి దాపున నున్న పరదా తెఱువ నక్కడికి నేబదియడుగు దూరమున నెదురుగా నుండు గదిలో నంబికాపతి తాంబూలము వేసికొనుచుండ నాతనియొద్ద నొకరమణి యాకుల నందిచ్చుచుండుట నమృతవల్లి చూచెను. 'అతఁ డెప్పు డిచటికి వచ్చినాఁడు'? అని అమృతవల్లి యడుగ "నాతో వచ్చినాఁడు. ఆతనియొద్ద నిలుచున్న బాలికను జూడు. ఆమె యెవ్వరో తెలియునా?" అని పచ్చయప్పగ రడుగ "అది యతనిభార్యయా? నా యిష్టమునకు వ్యతిరిక్తముగా వివాహముఁ జేసికొనిన దరిద్రురా లగు నలము కాంబోలు" ననెను ఆయన "అవును, ఆమెయే నాకుమార్తె రంగము. అల మని లోక లామెను బిలిచెదరు. నా ప్రథమకుమార్తె యలంకారము రాధయన పేర నీ ప్రాసాదములోనే వసించుచున్నది. నీకుఁ జక్కగాఁ దెలిసియే యున్నది." యనెను. అమృతవల్లి విని, "కానే కాదు. చచ్చిపోయిన వా రెక్కడనైనఁ దిరిగి వచ్చెదరా? ఎవరో కట్టుకథ గట్టి మిమ్ము మోసపుచ్చినారు. బాలలతనోట మట్టిఁ గొట్టుటకై కల్పించిన మోసమేగాని వేఱుగాదు." అని అమృతవల్లి చెప్ప ప్రభువు "అట్లుగా దట్లుగాదు. ఈశ్వరుఁడు దీనరక్షకుఁడుగదా ! నిష్పక్షపాతి. నీవుయుక్తి బన్నితివి. బయలుపడదని తలంచితివి. నిన్ను సృజించిన యీశ్వరుని కెక్కువ తెలియునని తలంపవైతివి. ఆ యిరువురు పిల్లలును నల్లప్ప తమ తాత యనుకొని యతఁడు చావఁగానే భయపడి ఈశ్వరేచ్ఛ వలనను నీ దురదృష్టమువలనను వా రిరువురును నారాత్రియే యెక్క డికో పోయిరి. అయిన నీవు చేసిన యనేక పాపములలో నీ పిల్లలను జంపినపాపము నీకుఁ దగులలేదు. కాని వారియెడఁ గావించిన మోసమునకై నీ వనుభవింపవలసినది మిగిలియున్నది." అనెను.

అమృతవల్లి "చెఱుపకురా చెడుదువు" అను మాట నాకొఱకై కల్పింపఁబడినది. నేఁ జేసిన యొక్కొక్క పాపము నా గొంతుకు జుట్టుకొనినది. దానివలన నే నేమియు నింతవఱకు లాభము నొంద

లేదు. నాథా! మీ బిడ్డలు జీవముతో నున్నందుకై నను నన్ను మన్నింపు మని దేవునిఁ బ్రార్థింపుఁడు." అనెను.

పచ్చయప్పగారు, "పాపినీ! రాక్షసీ! ఆతతాయినీ! నీకు దేవుఁడు కూడ నున్నాఁడా?" అని కోపముతో ననెను. ఆమె తిరిగి చూచునంతకు ఘోరమైన నల్లచీరెతోఁ గుంతల మ్మాట నిలుచుండుటయు, నామెచేతిని రాధ పట్టుకొని వలదు వల దని వారించుచుండుటయుఁ గాంచెను. కుంతలమ్మ కోపోద్రేకములు రూపు దాల్చినట్లు నిలిచియుండెను. రాధ తన శక్తికొలఁది యామెను నివారింపఁ జూచియు నిష్ప్రయోజన మగుటఁ గాంచి యూరకుండెను. వెంటనే కుంతలమ్మ "ఏమే! అమృతవల్లీ! మఱునాఁడు వివాహముఁ జేసికొనఁ దలఁచిన నా నాథునిఁ జంపితివిగదే! మన కిద్దఱ కనుకూలుఁడు, చుట్టము, హితుఁడు, నా హృదయమును గొన్నవాఁ డట్టివాని నేల చంపితివే?" యనుచుండ నమృతవల్లి కుంతలమ్మ నిలుచున్న దిక్కుఁ జూచి యింక, నే మాయోపాయములు చేసి తప్పించుకొనుటకును సాధ్యము కాదని తెలిసికొని, యామెతో "అవు నాతని నా శత్రువునుగాఁ దెలిసికొని చంపితిని" అని నదురు బెదురు లేక ధైర్యముతోఁ జెప్పెను.

పచ్చయప్ప లేచి నిలువఁబడెను. ఆయన యొక యడుగు వేయకముందే యాఁడుసింగమువలెఁ గుంతల మొక్క గంతున నమృతవల్లిమీఁదికి దుమికి యామెను బట్టుకొని, "తాటకీ! నా పగఁ దీర్చుకొనెదను. నా ప్రతినఁ దీర్చుకొనుటకుఁ గాల మిప్పుడు వచ్చినది." అని చెప్పుచు గుప్తముగావించిన ఖడ్గమునకు నమృతవల్లి నెఱఁజేసెను. అట్లమృతవల్లిం జంపి తన ప్రతిజ్ఞ నెఱవేర్చుకొన్న తరువాతఁ గుంతలమ్మ "ఆహా నేఁడుగదా సుదినము! ప్రాణనాయకా! నీ దయవలననే నే దీని నొనర్చితిని. నాప్రతిన నెఱవేర్చుకొంటిని. పగ దీర్చుకొంటిని. మీయాత్మకు శాంతి భగవంతుఁ డిచ్చుఁగాక. నే నిన్ని దినములు వేచియుండినది వృథకాలేదు." అనిచెప్పి పచ్చయప్పగారి వంకఁ జూచెను. వారును నామె యున్మాదావస్థలో నున్నదని తెలిసి యూరకుండిరి.

---

# ము ప్ప ది యొ క ట వ ప్ర క ర ణ ము.

## రా ధ యొ క్క వృ త ము.

పచ్చయప్పగారియింట జరిగినవిషయములు బహిరంగముగ నందఱును మాట్లాడుకొనుచుండుట విని సహింపలేక యాతఁడు తనయిల్లు వదలి యెచ్చటనైనను గొంతకాలము గడుపనిశ్చయించి కామాక్షయ్యగారియింటికిఁ బోవఁ బ్రయాణమయ్యెను. కుంతలమ్మకుఁ బట్టిన పిచ్చిని గుదుర్చుటకై యొకవైద్యుని గుదిర్చిరి.

అక్కడఁ బచ్చయప్పగారు కల్లికోటలో సముద్రపుగాలి వీచుచుండ హాయిగా తన యనుంగుబిడ్డలతోఁ గామాక్షయ్యగారి బంగాళాలో సుఖముగా నుండిరి. బాలలత యమాయకురాలు. తనతల్లి యుత్తమురాలని నమ్మియుండెను. అప్పుడప్పుడు "అమ్మా! నీ వింత గతికిఁ బాల్పడుదువని యెంచనైతి"నని తనలోఁ దానే పరితపించుచుండును. ఒక్కొక సమయమున బాలలత తనలో "నిఁకఁ బినాకపాణి నన్ను లక్ష్యముఁ జేయఁడు. మాతల్లియొక్క పాతకము లతఁడు విని యుండినయెడల నన్ను వివాహమాడ నిచ్చగింపఁ డనుటకు సందేహమే లేదు. నన్నతఁడు మఱచిపోయియుండును. మా తల్లిపాపము బయలుపడకముం దతఁడు నన్ను వివాహముఁ జేసికొనెద నని వాగ్దత్తముఁ జేసెఁగాని, యిప్పుడు దానిప్రకారము నడువఁడు" అని నిట్టూర్పులు పుచ్చుచు రాధకు బాలలత చెప్పఁగా నందుల కామె "అమ్మాయీ! బాలలతా! నీ కీవిషయములో సందేహమే వలదు. నీ తల్లిచేసిన పాపములకై నిన్నతఁడు విడనాడఁడు." అన "నిశ్చయముగా నీ వట్లు తలఁచెదవా? అక్కా! నీ సాహాయ్యము లేకున్న నే జీవించియుండఁగలుగుదునా? నీవు నాకు సోదరి వని తెలియకముందే నిన్ను శరణుఁజొచ్చితిని. అప్పుడు సైతము నీవు నాప్రాణస్నేహితురాలవుగా నుంటివి. మన కిట్టి సంబంధమున్నదని నేఁ దెలిసికొననే లేదు. కన్నెఱిఁగింపకున్నను గడుపెఱిఁగించునందు రిట్టిదియే కాఁబోలు.

నే నీవిషయము పినాకపాణికి వ్రాయుదునా?" యనెను. రాధ "తప్పక వ్రాయుము. అతఁడు యోగ్యుఁడు, నేను జెప్పునది నమ్ముము" అనెను.

కట్టకడపట రాధ చెప్పినట్లు బాలలత వ్రాసెను. బదులు వ్రాయుట కాలస్య మగునని యెంచి పినాకపాణి తా నొక గుఱ్ఱపు బండిమీఁదఁ గల్లికోటకు వచ్చిచేరెను. ఇతఁడు వ్యర్థముగా రాలేదు. అటువంటిజాబు లెట్లు వ్రాయ సాహసించితి వని బాలలతను జీవాట్లుపెట్టవచ్చెను. పినాకపాణి బాలలతతో "మన మిరువురము నివసించుటకై భవానీపురములో నొక క్రొత్తసౌధముఁ గట్టించుచుంటిని. అట్లు లేనియెడల నే నీవఱకే నిటకు వచ్చియుందును. అంతియ కాక మీ రందఱు నూరాచ్చికోట వదలి యెక్కడ నివసించుచుండినదియు నాకుఁ దెలియలేదు. బాలలతా! నేనా నిన్ను విడనాడుట?" యనెను. దానిని విని యామె 'నేను పూర్వపు బాలలతను గాను. మా తల్లిపే రెక్కడఁ జూచినను బ్రసిద్ధికెక్కియున్నది.' అని సిగ్గుపడి విషాదముతోఁ దల వంచుకొనెను. అంతట పినాకపాణి "ఇంత శీఘ్రకాలములో మనము వివాహముఁ జేసికొనరాదుగదా! ఇంక రెండుమాసములు గడచిన నీదుఃఖమును గొంచెము శాంతించును." అనఁగా బాలలతయుఁ బినాకపాణి మాఱలే దని యూఱడిల్లెను.

రాధ యొకనాఁడు తండ్రినిఁ జూచి "తండ్రీ! నేను బ్రహ్మచారిణినిగా యావజ్జీవము గడిపెదను. సదా మీతో నుండి మీ కుపచారము చేయుచుండెదను. ఇరువదివర్షములనుండియుఁ దండ్రికి దూరముననుంటినిగదా! ఆకాలములో నేఁ జేసియుండవలసినకృత్యములు గలవు" అనెను. దానిని తండ్రి విని "నీవు వివాహముఁ జేసికొనకుండ నుండవలసినదిలేదు. నాచిన్నారీ! నీ వొంటిగా నున్న నేమి, నీభర్తతో నున్న నేమి? ఎట్లైన నీవు నా కుపచారముఁ జేయవచ్చునే" యనెను.

"లేదు నాన్నా! నేను నిశ్చయముగాఁ జెప్పుచున్నాను." అని రాధ పలుక 'అట్లు చెప్పకుము, కుమారీ!' యని యాతఁ డనుచుండ "తండ్రీ! మీరు పరీక్షింపుఁడు. నే నిట్లుచేసెద నని వ్రాసియిచ్చెదను." అని రాధ దృఢమనస్కురాలై చెప్పెను. తండ్రి చిఱునగవుతో

'కుమారీ! తరువాత' అని యడిగెను. అందులకు రాధ "మీరు నేను నూరాచ్చికోటలో నివసించెదము. అలము, బాలలత వారిభర్తల యిండ్లకుఁ బోయెదరు. మీరును నేనును దీర్ఘయాత్రలఁ జేయుచుఁ గాలము పుచ్చెదము. మీరు నాకు జ్యోతిశ్శాస్త్రము నేర్పెదరు. నేనును శ్రద్ధతోఁ జదివెదను. నాముద్దు చెల్లింపరా నాన్నా? ఈయిరువదిసంవత్సరములు మిమ్ములఁ జూడక యిప్పుడు చూచినందుల కిట్లు నడువవలదా? ఇది నావిధి కాదా? మీరే చెప్పుఁడు" అనెను.

"మంచిది, నీయిష్టప్రకార మట్లే కానిమ్ము. అదిగో యొక పురుషుఁడు మనము కూర్చున్నదిక్కునకే వచ్చుచున్నాఁడు. అతఁ డెవ్వరో, నీ నేత్రములు చురుకైనవికదా, చూడుము." అనెను.

రాధ తిరిగిచూచునప్పటి కామెముఖమున సిగ్గుదయించెను. ఆసిగ్గును జిఱునగవును నడఁచుకొని 'పశుపతివలె నున్నా' రనెను. "భాగీరథియొక్క కొడుకు కాఁబోలు" నన, రాధ "అవునుగాని మన మిక్కడ నుండుట యాయన కెట్లు తెలిసినది?" యని యడిగెను. అట్లు వారు మాటాడుచుండునప్పుడు పశుపతి వారిని సమీపింప వా రాతనికి మర్యాద లొనర్చిరి. "అమ్మ సౌఖ్యముగా నున్నదా?" యని పచ్చయప్ప యడుగ "నేను కాశినుండికదా యిప్పుడు వచ్చుచున్నాను, నేను గాశికిఁ బోయి యొక మాస మైనది. అమ్మ నాకు జాబు వ్రాసినది. దానిచేతఁ గనఁబడకపోయిన మీ యిద్దఱు కుమార్తెలు కనఁబడినట్లు తెలిసెను. వెంటనే యీ విషయము తెలిసికొనుటకై వచ్చితిని" అనియెను.

భోజనమైనతరువాతఁ బచ్చయప్పగారు దేహ మస్వస్థముగా నున్నందునఁ గామాక్షయ్యగారి సౌధములోపలనే కూర్చుండిరి. బాలలతయుఁ బినాకపాణియుఁ గనకగిరి చూచుటకై వెళ్ళిరి. అంబికాపతియు నలమును దళిగకోవెలకు దేవునిదర్శనమునకై వెళ్ళియుండిరి. ఆసమయములో రాధయుఁ బశుపతియుఁ గామాక్షయ్యగారితోఁటలో నలముదగ్గఱ నుండి యంబికాపతి గులాబిపూలబుట్ట తీసికొన్నస్థలముఁ జేరిరి.

ఆస్థలముఁ జేరఁగానే, పశుపతి "రాధా! నే నేల యి ట్లవసర ముగఁ గాశి వదలి ప్రయాణమై వేగముగా నిటకు వచ్చితినో నీకుఁ దెలియునా?" యన, దాని కామె "మాతండ్రితో మీరు కారణమును జెప్పినారే. తప్పిపోయిన పిల్లలు దొరికిరను విషయమును విని విచారింప వచ్చితిమని తెలిపియుంటిరే!" యనెను.

"ఓసి పిచ్చిదానా! ఆవార్త తెలిసికొనుటకు నర్ధణామాత్రమే! ఒక కమ్మ వ్రాసినఁ దెలియదా? ఇంకేకారణ ముండియుండవచ్చును? ఊహించి చెప్పుము." అని పశుపతి యడుగ, నడిగిన ప్రశ్నలకుఁ దామ సింపక వెంటనే జవాబు లిచ్చురాధ యీ ప్రశ్నకు బదులు చెప్పనేరక యూరకుండెను. "రాధా! బాలలతవేషము వేసికొంటివి. ఆమె కకృతఘ్నవు నైతివి. అనాథ ననిచెప్పి వివాహమాడుట కంగీకరింపక నన్నుఁ బరదేశములపా లొనర్చితివి. ఇప్పుడు ప్రభువుకుమారితవైతివికదా? నేఁటికైనను నామీఁదఁ గరుణ గలిగినదా? ఇప్పుడేమిజవా బిచ్చెదవు?" అని యడుగ రాధ మిన్నకుండెను.

తరువాతఁ బశుపతి పచ్చయప్పగారిని దర్శించి యీవలకు వచ్చి, "రాధా! రెండు మాసములు వేఁచియుండవలెను" అని చెప్పి వంజకుఁ బోయెను.

ఆ రాత్రి పచ్చయప్ప తన పుత్రికలతో మాట్లాడుచుండినపుడు "రాధా! పశుపతి బుద్ధిమంతుఁడు, సుందరుఁడు, విద్యావంతుఁడు, ధనవంతుఁడు. అట్టివాఁ డింకొకఁడీప్రపంచమున లేఁడు. దైవవశమున నీ కాతనియందును, నాతనికి నీయందును ప్రేమ ముదయించెను.

ఆతనికి నీవంటి యుత్తమురాలు లభించుటయు దుర్లభమే. అట్టి భర్తను నీవు వడసి నా కుపచారము చేయుచుండిన నాకు వేఱ స్వర్గ మేల? నీ విదివఱకుఁ దలంచుచుండిన పిచ్చితలంపు లేవైన నున్న, వానిని మానుము. బ్రహ్మచారిణివిగ నుండి నా కుపచారము చేయుట

కన్న గృహిణీపదవి నందిన నా కెక్కుడు సౌఖ్యము చేకూర్పఁగలవు. పశుపతి నేఁ జెప్పినట్లు నడుచుకొనువాఁడు, మేనల్లుఁడు, సర్వవిధముల సరియైనవాఁడు.” అని పలికెను. రాధయు నంగీకరించెను.

రాధా పశుపతులకును, బాలలతాపినాకపాణులకును నొక్క శుభముహూర్తమునఁ బచ్చయప్పగారిభవనమున మహావైభవముతో వివాహములు గావింపఁబడెను.

